# సోవియట్
# కమ్యూనిస్టు పార్టీ
# కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి
# మిహాయిల్ గొర్బచేవ్
# అమెరికాలో జరిపిన
# అధికార పర్యటన

డిసెంబరు 7-10, 1987


సంపుటి 21 | డిసెంబర్ 25

51

సోస
సోవియట్ సమీక్ష

1987

1

# విషయసూచిక

# అమెరికాను సందర్శించనున్న సందర్భంగా ఎన్. బి. సి కి మిహాయిల్ గోర్బచేవ్ ఇంటర్వ్యూ

సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ ప్రధాన కార్యదర్శి మిహాయిల్ గోర్బచేవ్ అమెరికాను సందర్శించనున్న సందర్భంగా అమెరికన్ ఎన్. బి. సి. టెలివిజన్‌కంపెనీకి యిచ్చిన ఇంటర్వ్యూ పూర్తిపాఠం దిగువనిస్తున్నాం.

ప్రశ్న: ప్రధాన కార్యదర్శిగారూ, అందరి దృష్టి మీ అమెరికా సందర్శనపైనే వుంది. మీరు యీ దేశంలోని యితరపదవుల్లో వున్నప్పటికంటే సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ ప్రధాన కార్యదర్శిగా యిప్పుడు మీకు అమెరికన్లపట్ల అవగాహన పెరిగిందా?

జవాబు: బ్రోకాగారూ, యీ ప్రశ్నకు జవాబుచెబుతాను. ఎన్. బి. సి. ద్వారా లభించిన యీ సదవకాశాన్ని వుపయోగించుకుని, నేను మనల్నిచూస్తున్న, వింటూన్న సమస్త టెలివిజన్ ప్రేక్షకులకూ, సమస్త అమెరికన్ ప్రజలకూ మొట్టమొదట నా హృదయపూర్వక శుభాకాంక్షలను తెలుపుతూ కొన్ని ముక్కలు చెప్పాలని అనుకుంటున్నాను. వారికి సోవియట్ ప్రజల హృదయపూర్వక శుభాకాంక్షలను తెలపాలనుకుంటున్నాను.

ఈ సంవత్సరంలో యిప్పటికే, నాకు అమెరికన్లనుంచి ఎనభై వేల ఉత్తరాలు వచ్చాయి. అవి పార్టీ కేంద్రకమిటీకి విదేశాలనుండీ వస్తున్న ఉత్తరాల్లో మూడవవంతు వుంటాయి.

ఈ ఉత్తరాల్లో అనేక సమస్యలను ప్రస్తావించారు. యీ వుత్తరాలు కాంగ్రెస్ సభ్యులనుండీ, వ్యాపారస్థులనుండీ, చాలావరకు శాస్త్రజ్ఞులనుండీ, పండితులనుండీ, సాంస్కృతిక రంగంలో పనిచేసే వారినుండీ వచ్చాయి. యువజనులనుండీ యెన్నో లేఖలువచ్చాయి.

ఆ లేఖల్లో అనేకం నన్ను కదిలించాయి. ఆ లేఖల్లోని అనేక ఆలోచనలు ఒకే విధంగావున్నాయి. అవి అమెరికా ప్రజలకు యెంతో ఆందోళన కలిగిస్తున్న విషయాల

గురించిన ఆలోచనలు. అవి సామాన్యమైన అనేక ప్రశ్నలకు, సమస్యలకు సంబంధించినవి అయినప్పటికీ యివి అతిముఖ్యమైనవి.

ప్రపంచ పరిస్థితి యెంతో ఉద్రిక్తభరితంగా వున్నందుకు, ప్రమాదకరంగా వున్నందుకు, ప్రాంతీయ ఘర్షణలు యిప్పటికీ తగ్గకుండా, ప్రజ్వరిల్లుతున్నందుకు వారు ఆందోళన చెందుతున్నట్టు ఆ లేఖల్లోవుంది. సోవియట్-అమెరికా సంబంధాల స్థితిపట్ల వారికి యెంతో ఆందోళనవుంది: అది వారి దృష్టిలో ప్రథమస్థానం వహించిందని నా అంచనా. ప్రపంచంలోని పరిస్థితిని మెరుగుపర్చాలన్న అపారఆకాంక్ష, చాలా బలమైన ఆకాంక్ష అమెరికా ప్రజలకు వున్నట్టు ఆ వుత్తరాలద్వారా నాకు అనుభూతమయింది. మనమధ్య, మన ప్రజానీకాలమధ్య సంబంధాలు మార్పు చెందవలసిన అవసరం యిందులో ప్రధాన స్థానాన్ని ఆక్రమిస్తోంది.

అమెరికా ప్రజలను మరింత బాగా అర్థం చేసుకోవడానికి యీ లేఖలు నాకెంతో తోడ్పడ్డాయి. యితర మార్గాలద్వారా, అన్ని స్థాయిల్లోని అమెరికా రాజకీయనాయకులతో నాకుగల సంబంధాలద్వారా నాకు అందుతున్న అపారరాజకీయ సమాచారాన్ని యిది నిజంగా మరింత సంపన్నం చేస్తున్నది. నేనీపదవిని చేపట్టడానికి ముందుకన్నా యిప్పుడు నాకు అమెరికన్ సమాజంగురించి మరింతచక్కగా అవగాహన అవుతోందనే మాటనిజమే.

అయితే, యేది ముఖ్యమైన విషయమనేది మీకు తెలిసిందే. దాన్ని గురించే చెప్పాలనుకుంటున్నాను. నన్నూ, సోవియట్ యూనియన్ ప్రభుత్వాన్ని, మా సోవియట్ ప్రజలనూ వుద్దేశించి రాసిన తమ లేఖల్లో అమెరికా వారు చెప్పినదంతా మాకు చాలా ప్రియమైనది. మాకందరికీ, సోవియట్ ప్రజానీకానికి చాలా సులభంగా అర్థమయ్యేది. ఒక నూతన పరిస్థితి ఆవిర్భవించినట్లు యివి నాకు తెలియజేస్తున్నాయి. యిందువల్ల మనదేశాల ప్రజల మనోస్థితిని మరింత బాగా అర్థంచేసుకునేందుకు ప్రయత్నించడానికీ, అలా అర్థంచేసుకుని మన ప్రజల అభీష్టాన్ని తమ విధానాల్లో వ్యక్తపర్చడానికీ, మన సువిశాల దేశాల రాజకీయ వేత్తలకు, ప్రభుత్వాలకు వీలేర్పడుతుంది; బహుశా, అలా వ్యక్తపర్చడం వారి విధికూడా.

ప్రస్తుతం నేను యితర సమస్యలను పక్కనపెట్టి మన సంబంధాన్ని గురించిన విషయాన్ని కొంత వివరించదలచాను. యీ సమస్యను కూడా చర్చించాలన్న అభిలాషతో నేను వాషింగ్టన్‌కు వెడుతున్నాను. మన దేశాల మధ్య సంబంధాలను మనం యెలా మెరుగుపర్చగలగుతామనేది ఒక ముఖ్య సమస్య అని అనుకుంటున్నాను.

మనం బంధువులమెందుకుకాలేము, ఒకప్పుడు మనం బంధువులుగా వుండేవాళ్ళం, మనమిప్పుడు బంధువులుగా వుండలేమా అని అమెరికావారు తమ లేఖల్లో రాశారు. ప్రపంచంలో అనేక సమస్యలు వున్నాయి. యీ సమస్యలన్నిటినీ పరిష్కరించేందుకు మన దేశాల అపార శక్తిని, మన ఆర్థిక, మేథాస్తోమతలను సమీకరించలేమా?

యిది చాలా ముఖ్యమైనది; నిజంగా చాలా ముఖ్యమైనది.

మనకు పరస్పరావగాహన అవసరం. మనం ఒకరిపైన మరొకరం మరింత యెక్కువ గౌరవం చూపాలనీ, మన దేశాల చరిత్రను మరింత బాగా అర్థంచేసుకోవ డానికి ప్రయత్నించాలనీ అభిప్రాయపడుతున్నాము.

సోవియట్ యూనియన్ ఒక ప్రత్యేకమైన పరిణామక్రమం. అది నూటికిపైగా జాతుల, వుపజాతుల సమ్మేళనం. ప్రస్తుతం సోవియట్ యూనియన్‌గా వున్న, వచ్చే సంవత్సరం రష్యాలో క్రిస్టియన్ మత సహస్రాబ్దిని జరుపుకోనున్న ఆ జాతులలోని, వుపజాతుల్లోని ప్రతిఒక్కరి వెనుక వున్నదేమిటనే విషయం ఒక్కక్షణం వూహించ డానికి ప్రయత్నించండి.

అయితే, దానికిముందుకూడా కీవ్‌రస్ వుండేది, దానిలో శక్తివంతంగా అభివృద్ధి చెందుతూండిన ప్రజల సొంత సంస్కృతి వుండేది. తద్వారా వారు యితర దేశాలతో విస్తృత సంబంధాలు నెరవుకొంటూ వుండేవారు.

ట్రాన్స్‌కకేసియా జాతులనే, మధ్యాసియా జాతులనే తీసుకోండి. వాటి చరిత్ర, అనాదికాలంనుండీనే ప్రారంభమైంది. బాల్టిక్ మండల జాతులకు తమదైన సొంత చరిత్ర వుంది. అది సామాన్యమైనదేమీకాదు, గణనీయమైన చరిత్ర. ఈ జాతులన్నీ యిప్పుడు సోవియట్ యూనియన్‌గా అలరారు తున్నాయి.

మా చరిత్రలో సంక్లిష్టమైన భాగం యెంతో వుంది. దానిలో యెంతో పోరాటం వుంది. మేము మా స్వాతంత్ర్యం కాపాడుకోవడానికి చెంఘిజ్ ఖాన్ మొదలుకుని బాతియ్, తదితరుల వరకూ జరిగిన అనేకుల దండయాత్రలను తిప్పికొట్టాల్సివచ్చింది. అది మా జాతీయ లక్షణాన్ని తీర్చిదిద్దడానికి దారితీసింది. ఆ విధంగా మా విలువలు రూపుగొన్నాయి. యీ జాతులన్నీ తమ సంస్కృతినీ, తమ భాషనూ యెంతో విలువైనవిగా భావిస్తున్నాయి. యీ జాతుల ప్రజలు దేశభక్తులు. వారికి ఆత్మ గౌరవభావన వుంది.

మా చరిత్ర తెలియకపోతే మీరు మమ్మల్నీ, మా చర్యలనూ అర్థంచేసుకోలేరు. మేము శాంతికి అంకితమయ్యాము. మీరు సోవియట్ యూనియన్ అంతటా, ఆ మూల నుంచి ఈ మూలవరకూ ప్రయాణం చేయవచ్చు; మేము శాంతికి అంకితమయామని ప్రతిచోటా మీకు రుజువులు కనిపిస్తాయి. వచ్చే వారంలో నా అమెరికా సందర్శనను సోవియట్-అమెరికా సంబంధాల్లోని ముఖ్యదశగా మేము పరిగణిస్తున్నాము. యిది అధ్యక్షులు రీగన్‌తో మా మూడవ సమావేశం అవుతుంది. మేము మధ్యశ్రేణి, స్వల్పశ్రేణి మిసిలీల గురించిన సంధి మీద సంతకాలు చేయాల్సివుంది. వ్యూహాత్మకదాడి ఆయుధాల సమస్యలపై యెంతో శ్రద్ధను కేంద్రీకరించాలి. మేము యితర అంతర్జాతీయ సమస్యలపై కూడా చర్చలు జరపనున్నాము. కాబట్టి, మొత్తంపై మేము సంభాషణలు జరపాల్సిన విషయాలు అనేకం వున్నాయని అనుకుంటున్నాను.

ప్ర: ఇక్కడ మనం యీ గంటకాలంలో మాట్లాడుకోవలసిన విషయాలు అనేకం వున్నాయి. ఒక వుదాహరణ: మీ అమెరికా పర్యటన కోసం యెదురు చూడటం జరుగుతోంది. మధ్యశ్రేణి మిసిలీల సంధిపై సంతకాలు యెప్పుడు జరుగుతాయా అని సర్వత్రా వుత్సుకతతో యెదురు చూస్తున్నారు. దీనివల్ల సోవియట్ యూనియన్‌కు యూరప్‌లో ఆధిక్యతాస్థానం లభిస్తుందని అనేకమంది భయపడుతున్నారు కూడ. యూరప్‌లో మీకు గల సైనికుల సంఖ్యనూ, టాంకుల, దాడి హెలికాప్టర్ల సంఖ్యనూ తగ్గించుకోవడానికి మీరు సిద్ధంగా వున్నారా?

జ: ఎవరిపైనా దాడిచేయాలన్న కోరిక సోవియట్ యూనియన్‌కు యెంత మాత్రమూ లేదని అమెరికన్లు, యూరపియన్లు, తదితరులు ముఖ్యంగా తెలుసుకోవాలి. ఇది మొదటి విషయం. రెండవది. యీ రెండు ప్రత్యర్థి సైనిక కూటముల పరిధిలో రూపుగొన్న వాస్తవాలు వున్నాయి. సైనిక దళాల విషయంలోనూ, ఆయుధాల విషయంలోనూ కొంతవరకూ వ్యత్యాసాలు వున్నాయి. యీ విషయాన్ని యేమాత్రమూ జాప్యంచేయకుండా వెంటనే పరిష్కరించుకోవడానికి మేము సిద్ధంగావున్నాము. మేము మా ప్రతిపాదనలను యిప్పటికే చేశాము: నాటో నుంచీ మరింత క్రియాశీల వైఖరి కోసమే మేము యెదురుచూస్తున్నాము. ఈ విషయంలో ఆచరణాత్మకమైన పద్ధతుల్లో వ్యవహరించడానికి మేము సిద్ధంగా వున్నాము. చర్చలుజరపడానికి, యీ సమస్యలను పరిష్కరించుకోడానికి మేము సిద్ధంగా వున్నాము.

ప్ర: మీ సైనిక బలాలను దాడిచేసే స్థానాలనుంచి వుపసంహరించి మరింత ఆత్మరక్షణ స్థానాలకు మీరు యేకపక్షంగా మళ్లించినట్టయితే అది నాటోకు, ముఖ్యంగా అమెరికాకు ప్రోత్సాహకరంగా వుంటుందనుకుంటాను.

జ: మేము మా సైనిక సిద్ధాంతం యేమిటో తెలియబర్చాము. అది ఆత్మరక్షణ స్వభావంగలది. నేను మళ్ళీ చెపుతున్నాను. మధ్యశ్రేణి, స్వల్పశ్రేణి మిసిలీల విషయంలోలాగానే సాంప్రదాయిక ఆయుధాల, సాంప్రదాయిక సైనిక దళాల సమస్యను పరిష్కరించుకోవడానికి చర్చలకు మేము సిద్ధంగా వున్నాము. మేము నిర్మాణాత్మక పద్ధతిలో వ్యవహరిస్తున్నాము.

ప్ర: వచ్చే వేసవినాటికి దీర్ఘశ్రేణి మిసిలీలను, నిజంగా ప్రమాదకరమైన ఆ మిసిలీలను సగానికి, 50 శాతానికి తగ్గించడానికి సంబంధించిన సంధిపై మీరు, అధ్యక్షుడు రీగన్ సంతకాలు చేసేందుకు అవకాశాలు యేమైనా వున్నాయని మీరు అనుకుంటున్నారా?

జ: ఈ విషయంలో, నిజానికి సోవియట్-అమెరికా సంబంధాలకు వెన్నెముకగావుండే యీ విషయంలో మనముందు నిజమైన అవకాశాలున్నాయని నా విశ్వాసం.

సంభాషణలు యెలా సాగుతాయో, నా సందర్శనకాలంలో అధ్యక్షుడు రీగన్‌తో జరిగే నా సంభాషణల్లో, యీ విషయంపై అభిప్రాయాలను పరస్పరం తెలియజేసుకున్న తర్వాత యెలాంటి ఫలితాలు లభిస్తాయో ముందేచెప్పడం కష్టమని నా అభిప్రాయం. అయితే, యేదియేమైనా మేము చర్చించాల్సిన విషయాలు అనేకం వున్నాయనేది నిజం.

నేను యింతకుముందు చెప్పిన విషయమే మళ్ళీ చెబుతాను. నిరాయుధీకరణ, అణ్వాస్త్ర విసర్జనరంగంలోని యీ ప్రధాన దిశలో పురోగమించడానికి ప్రస్తుత ప్రభుత్వంతో, యీ ప్రభుత్వంతో కృషిసల్పడం సాధ్యమేనని మా విశ్వాసం.

మేము నిర్మాణాత్మకంగా వ్యవహరించి తీరుతాము. మేమావిధంగా వ్యవహరించగలమనీ, మేము నిజానికి నిర్మాణాత్మకంగా వ్యవహరిస్తూ వున్నామనీ అమెరికన్లకూ, మొత్తంమీద ప్రపంచానికీ నమ్మకం చిక్కిందని నేననుకుంటున్నాను.

ప్ర: ఆయుధాలపై చర్చల్లో మీ ప్రధాన ప్రతినిధి ఐ. సి. బి. ఎం లలో 50 శాతం తగ్గింపు వుండగలదని తాననుకుంటున్నాననీ, ఎస్. డి. ఐ, లేదా "నక్షత్ర యుద్ధాలు" విషయం అమెరికా ప్రజలే నిర్ణయించుకోవాల్సి వుందని యిటీవల చెప్పారు. ఐ. సి. బి. ఎం ల తగ్గింపునకు ఎస్. డి. ఐ విషయంలో మీరు విధించిన షరతులను కొద్దిగా సడలించారా?

జ: సంప్రతింపుల్లో ఎస్. డి. ఐ సమస్య చర్చనీయాంశం కాదని నేను నమ్ముతున్నాను. మేము వ్యూహాత్మక దాడి ఆయుధాలను గురించీ, వాటి స్థాయిలను, వుపస్థా లను గురించీ సంభాషణలు జరపనున్నాము. యిక్కడ ఒప్పందం దిశలో సర్దుబాటుకు మావంతుగా మేము తీసుకోవలసిన చర్యలు వున్నాయి, కొన్ని చర్యలను మేమిప్పటికే తీసుకున్నాము. ఎ. బి. ఎం సంధిని కచ్చితంగా పాటించే విషయమై మేము సంభాషణలు జరపనున్నాము. మేము మాట్లాడబోయేది అదే.

ప్ర: వచ్చే వేసవినాటికల్లా ఐ. సి. బి. ఎం. లనూ, దీర్ఘశ్రేణి మిసిలీలను 50 శాతంమేరకు తగ్గించగలమని మీరు నమ్ముతున్నారనీ, మీరు ఎస్. డి. ఐ సమస్యను విడిగా పరిష్కరిస్తారనీ నాకు అర్థమైంది. నేను స్పష్టంగా అర్థంచేసుకున్నట్టేనా?

జ: మా వైఖరిని మేము చాలా స్పష్టంగా చెబుతున్నాము. ఎ. బి. ఎం సంధిని కచ్చితంగా పాటిస్తూ మొదటిదశలో 50 శాతం తగ్గింపును అంగీకరించడానికి మేము సిద్ధంగా వున్నాము. ఎస్. డి. ఐ యేవిధంగానైనా ఎ. బి. ఎం సంధికి విరుద్ధంగా వుండనంతవరకూ దాని విషయంలో అమెరికా యేమైనా చేసుకోనివ్వండి. ఎ. బి. ఎ. కు విరుద్ధంకానంతవరకు, అమెరికా యిచ్ఛారచ్ఛగా పరిశోధనలో నిమగ్నం కానివ్వండి.

ప్ర: ప్రధాన కార్యదర్శిగారూ, "నక్షత్ర యుద్ధాలు" లేదా ఎస్. డి. ఐ విషయంలో వ్యవహరించడానికి అతిసులభమైన పద్ధతి యిదేనా? యుద్ధప్రమాదం

తొలగింపుకోసం చేస్తున్నట్టులాగానే ఎస్. డి. ఐ అవసరాన్ని లేకుండా చేయడానికి మొదట దీర్ఘ శ్రేణి మిసిలీలను పెద్ద యెత్తున తగ్గించేందుకు సంప్రతింపులు జరిపి అనంతరం అసలు ఎస్. డి. ఐ లాంటి వాటిపట్ల రాజకీయ అభిలాషగానీ, వాటి సాంకేతిక అవశ్యకత గానీ లేకుండా చేయడానికి అత్యంత సులభపద్ధతి యిదేనని మీ వుద్దేశమా ?

జ: అధ్యక్షులు రీగన్‌కు రక్యావిక్‌లో నేను సూచించింది సరిగ్గా అదే. ఆ మేరకు ఒప్పందంపై సంతకాలు చేయడానికి కేవలం రెండు అంగల దూరంలో మాత్రమే మేము వుండినాము. అయితే ఎస్. డి. ఐ మా మధ్య అడ్డుగోడగా నిల్చింది. మన మధ్యశ్రేణి మిసిలీలనూ, మన స్వల్పశ్రేణి మిసిలీలనూ తగ్గించుకుంటే, మొదటి దశలో, మన వ్యూహాత్మక దాడి ఆయుధాల్లో 50 శాతం కోతలు విధించుకోవడానికి, ఆతర్వాత మరింత ముందుకుపోయి, అణ్వస్త్రాల సంపూర్ణ నిర్మూలనకు మనం అంగీకరిస్తే అప్పుడీప్రశ్న తలెత్తుతుంది: దూర రోదసి సైనికీకరణ యెందుకోసం, ఎస్.డి.ఐ యెందుకోసం? కంప్యూటర్లలో తమకున్నదనుకొంటున్న ఆధిక్యతద్వారా, యేదో ఒక విధంగా దూరరోదసిలో ఆధిక్యతద్వారా మాపై ఆధిక్యత సాధించడానికి యిదొక ప్రయత్నం అని మీకు తెలుసు: యిది అమెరికన్ రక్షణ వ్యూహకారులకు గల మరో భ్రమ.

అయితే, శ్రోతాగారూ యీ విషయం పరిశీలిద్దాం. యుద్ధానంతరం, వుభయ పక్షాలూ ముందుకుపోవడానికి, ఆధిక్యతను సాధించడానికి యెన్ని ప్రయత్నాలు చేశాయో చెప్పండి? అయితే, దీనివల్ల ఒరిగిందేమీ లేదు. మన ప్రజల నిధులను వ్యర్థం చేస్తున్నాము. ప్రపంచంలో అతి తీవ్ర పరిస్థితిని సృష్టిస్తున్నాము, అంతే తొంభై ఐదు శాతం లేక బహుశా యింకా యెక్కువ శాతం అణ్వస్త్రాలు అమెరికా, సోవియట్ యూనియన్ లవే. కాబట్టి మనమేం చేయాలి, ఆయుధాలను దూరరోదసికి తీసుకుని పోవడమేనా?

అది అనూహ్య పర్యవసానాలతో కూడుకున్న అస్థిరత్వానికి దారి తీస్తుంది. ఉభయపక్షాల ప్రస్తుత అణ్వస్త్ర స్తోమతలను పోల్చిచూచేందుకు అవసరమైన గీటురాళ్ళను కనుగొనడానికి యెంతకాలం పట్టిందో ఒక్కసారి ఆలోచించండి. ఆ స్తోమతలను యెలా పోల్చిచూడాలి, యెలా అంచనావేయాలి అన్నవిషయం అతిక్లిష్టమైనది. అయినప్పటికీ, మన దశాబ్దాల కృషితో యీ గీటురాళ్ళను కనుగొన్నాము. అయితే, మనం మన ఆయుధాలతో దూర రోదసిలోకి వెళ్ళితే, దూర రోదసిలో ఆయుధపోటీని ప్రారంభిస్తే అక్కడ గీటురాయి యేముంటుంది? యెవరు యెవరిని జయిస్తారన్న వుద్రిక్తత నెలకొంటుంది.

అంతేకాదు యెదుటి పక్షం తనను మించిపోనున్నదని ఒక పక్షం గమనించినపుడు యేమౌతుంది. తర్వాత యేమి జరుగుతుంది? యిదీ నా మొదటి ప్రశ్న.

ఇక రెండవదేమంటే, సాంకేతిక పరిజ్ఞానంపై సర్వస్వం ఒడ్డటం చాలా ప్రమాద

కరమైన ఆట. అది సకాలంలో రాజకీయ నిర్ణయాలను తీసుకునే అవకాశాలు బొత్తిగా లేకుండా చేస్తుంది.

ప్రధాన విషయం యిది. మన ప్రజలు ఒక అభీష్టాన్ని వ్యక్తంచేసినపుడు యే దేశంలోనైనాసరే, ఒక చిన్న బృందపు, యింకా చెప్పాలంటే ఒక అతిచిన్న భాగపు అభీష్టం, ప్రయోజనాల వైపు మన మెందుకు మొగ్గుచూపాలి? అది నిజంగా ప్రజాస్వామికచర్య కానేకాదు. మీరు అల్పసంఖ్యాకుల అభీష్టాన్ని అధిక సంఖ్యాకులపై రుద్దజాలరు. యేదియేమైనా ప్రజాస్వామ్యమంటే అధిక సంఖ్యాకుల పాలన మాత్రమే.

ప్ర: కాని అధ్యక్షుడు నక్షత్రయుద్ధాల పథకాలకు కట్టుబడివున్నట్టు చెబుతున్నారు. వాటి విషయమై సంప్రతింపులకు నేను సిద్ధమైరాలేదన్నది స్పష్టమే. అయితే ప్రధాన కార్యదర్శిగారూ, సోవియట్ యూనియన్ కూడా రోదసిని సైనికీకరించడానికీ, తన సొంత ఎస్.డి.ఐ కార్యక్రమాన్ని రూపొందించుకోవడానికీ కృషిసల్పుతోందని అభిప్రాయపడేవారు అమెరికాలో అతిపెద్ద సంఖ్యలో వున్నారు. మనం యీ విషయాన్ని యిప్పుడే యిక్కడే పరిష్కరించగలమని నేననుకోవడం లేదు. మనం యిక నూతన ఆలోచనా ధోరణిని గురించి యెత్తుకుందామనుకుంటున్నాను. నూతన ఆలోచనా ధోరణిని గురించి మేమెంతో విన్నాం. మీరు రాసిన పెరిస్త్రోయికా పుస్తకంలో దీన్ని గురించి యెంతో చదివాము. నూతన ఆలోచనా ధోరణి అంటే అర్థం సైనిక పద్ధతులద్వారా భద్రతకు యిక యెంత మాత్రమూ హామీకల్పించలేమని మీరు చెబుతున్నారు. యీ విషయాన్ని నిరూపించడానికి ఆఫ్గనిస్తాన్ నుండీ సోవియట్ సైనిక దళాలను వుపసంహరించడంకన్నా మించిన మార్గం యేమి వుంటుంది? మీరా పని చేయడానికి యెప్పుడు సిద్ధపడతారో నాకిప్పుడు చెప్పగలరా?

జ: ఆ ప్రశ్నకు సమాధానం చెప్పడానికి ముందు సోవియట్ యూనియన్ ఎస్.డి.ఐ లేక ఎస్.డి.ఐ లాంటిదానిలో నిమగ్నమైందని మీరు చేసిన వ్యాఖ్యకు సమాధానమిస్తాను. సోవియట్ యూనియన్ చేస్తున్నదేమిటో చేయకుండా వుంటున్నదేమిటో చెప్పడం నిజంగా యెంతో కష్టం. అమెరికా చేస్తున్న వాటన్నిటినీ, దాదాపు సోవియట్ యూనియన్ చేస్తోంది.

ఎస్.డి.ఐ కార్యకలాపాలకు సంబంధించి అమెరికాలో యీ అంశాలపై జరుగుతున్న పరిశోధనలో, ప్రాథమిక పరిశోధనలాంటి కృషిలో మేమూ నిమగ్నమైవున్నామని అనుకుంటున్నాను. అయితే. మేము ఎస్. డి. ఐ ని నిర్మించబోము. మేము ఎస్. డి. ఐ ని మోహరించబోము. అమెరికాకూడా యిలాగే వ్యవహరించాలని దానికి మేము విజ్ఞప్తిచేస్తున్నాం. అమెరికన్లు మాయీ విజ్ఞప్తిని పెడచెవి పెట్టినట్లయితే, మేము పదిరెట్లు లేక నూరురెట్లు తక్కువ ఖర్చుతో దానికి సమాధానం కనుగొంటాము. అప్పుడు

తప్పు అమెరికాదీ, అమెరికా ప్రభుత్వానిదీ మాత్రమే అవుతుంది.

ప్ర: విషయమంతా అదే. ఎస్. డి. ఐ ని మొహరించడం బహుశా, వచ్చే శతాబ్దందాకా సాధ్యంకాదు. యిప్పటికే ఎస్. డి. ఐ పై కోతలను విధించడం జరిగింది. యీలోగా దీర్ఘ శ్రేణి మిసిలీలను తగ్గించడం అవసరమని అమెరికా ప్రజలకు సంకేతాలు పంపడం మంచిదికదా? యిప్పటికే ఆలస్యాలు జరిగాయి. ఎస్. డి. ఐ చేపట్టడం వివేకవంతమైనదనా అని యిప్పటికే అమెరికాలో ప్రశ్నలు తలెత్తాయి. యీలోగా, దీర్ఘ శ్రేణి మిసిలీల తగ్గింపునకు అంగీకరించడం ద్వారా మీరు మరింత త్వరగా ముందుకు సాగేందుకు వీలుందనీ, అవసరమైతే, ప్రతిస్పందించడానికి యిప్పటికీ మీకు వ్యవధివుందనీ నాకు అనిపిస్తోంది.

జ: అవును. అయితే ఎ. బి. ఎం సంధిని చెక్కు చెదరకుండా వుంచితేనే యిక ఆఫ్గనిస్తాన్‌ను గురించి. యిది మా పొరుగుదేశం. యీ దేశంలో అన్ని ప్రభుత్వాల కాలంలోను మేము మంచి యిరుగుపొరుగు వారముగా వుంటూవచ్చాము. రష్యాలో సోవియట్ అధికారాన్ని మొట్టమొదట గుర్తించిన రాజ్యాల్లో యిది ఒకటి. రాజులు, తదితరులు దీన్ని పాలించారు. వారూ తమ 'సొంత' పరిణామక్రమాలను కొనసాగించారు. అక్కడ యేమి జరిగినప్పటికీ దానితో మేము మిత్రులుగానే వుంటూవచ్చాము.

ఇదీ మా యిరుగుపొరుగు వారందరితోనూ మేము మా సంబంధాలను నిర్మించు కోవడానికి ప్రయత్నించే తీరు. ఆఫ్గనిస్తాన్‌లో విప్లవం తర్వాత, కొన్ని అంత రంగిక సంస్కరణలు జరపడానికీ, ఆ దేశ సమాజాన్ని ప్రాచీన వ్యవస్థనుండీ బయటికి తీసుకురావడానికీ ప్రయత్నం జరిగింది. వేరే ప్రభుత్వం అధికారంలోకివచ్చింది. అయితే అది పూర్తిగా ఆ దేశ అంతరంగిక విషయం.

అదేసమయంలో అన్నిటికన్నా ముఖ్యంగా నూతనప్రభుత్వాన్ని పడగొట్టటం కోసం బయటి జోక్యంతో సంబంధంగల కొన్ని పరిణామక్రమాలు అక్కడ పెంపొందాయి.

పొరుగు వారిమైన మాకు ఆఫ్గన్లు ఒక విజ్ఞప్తిచేశారు. యీ విజ్ఞప్తిని 11 సార్లు చేశారని కొందరూ, 13 సార్లు చేశారని మరికొందరూ అంటారు. అత్యంత కష్ట కాలంలో సహాయంకోసం వారు మాకు విజ్ఞప్తిచేశారు.

పరిస్థితి విషమించిన ఒక అతి విపత్కరసమయంలో మేము ఆఫ్గన్ ప్రభుత్వ అభ్యర్థనను అంగీకరించాము. మేము సోవియట్ సైనిక దళాలను పరిమిత సంఖ్యలో అక్కడికి పంపాము. యిది ఐ. రా. స నిబంధనావళికి విరుద్ధంకాదు. అయితే, నేడు యీ పరిస్థితిని చక్కదిద్దడం అవసరమని అనుకుంటున్నాము. యీ సమస్యను చిత్త శుద్ధితో, సత్వరంగా పరిష్కరించడానికి మేము మార్గాలను అన్వేషిస్తున్నాము. యీ సమస్యకు రాజకీయ పరిష్కారం కుదరాలని అమెరికా ప్రభుత్వం నిజంగా, చిత్తశుద్ధితో కోరుతూన్నట్లయితే ఆ పని చాలా త్వరగా జరగవచ్చునని విశ్వసిస్తున్నాము.

ప్ర: చాలా త్వరగా అంటే, మూడునెలల లోపలా, లేక ఆరునెలల లోపలా?

జ: దాన్ని గురించి రీగన్‌తో మాట్లాడాలనుకుంటున్నాను.

ప్ర: వాషింగ్టన్‌లో మీ చర్చనీయాంశంలో దానికి ప్రాధాన్యత వుంటుందా? ఆఫ్గనిస్తాన్ నుండీ సైనికదళాల ఉపసంహరణ, అక్కడి ప్రభుత్వంనుంచీ సోవియట్ యూనియన్‌కు ప్రమాదం వుండబోదనే హామీ, అంతేనా?

జ: మధ్య అమెరికా, దక్షిణాది ఆఫ్రికా, మధ్యప్రాచ్యం, పర్షియా సింధు శాఖ, ఆఫ్గనిస్తాన్—వీటన్నిటిలోని ప్రాంతీయ ఘర్షణలపై చర్చించడం జరుగుతుందని నేను వూహిస్తున్నాను.

ప్ర: ప్రధాన కార్యదర్శిగారూ, క్యూబా, నికరాగ్వాలకు గతంలో లాగానే యిప్పుడు తోడ్పాటునివ్వడానికి మీరు సిద్ధంగావున్నారా?

జ: ఆ రాజ్యాలకు తోడ్పాటునివ్వడం, వాటితో సంబంధాలను నెరపడమే కాదు, మేమా సంబంధాలను అభివృద్ధిపర్చి, మెరుగుపర్చాల్సి వుంది. అయితే, మీరా ప్రశ్న అడగడంలో మీ వుద్దేశం వేరే అనుకుంటున్నాను.

ప్ర: నేనడిగిన దాని అర్థమిది. క్యూబాకూ, నికరాగ్వాకూ మీరు మరిన్ని ఆయుధాలను యిస్తారా, మరికొందరు సలహాదార్లను పంపుతారా?

జ: ఆ ప్రాంతంలో వుద్రిక్తతలు అలాగే కొనసాగేలా చేయడానికి, జోక్యానికి సాకులను వెతకడానికి యీ ఆయుధాల సరఫరా, సలహాదార్ల పంపడం గురించి యెక్కువ మాట్లాడటం జరుగుతోందనుకుంటున్నాను. శాండినిస్టా ప్రభుత్వంవల్ల అమెరికా భద్రతకు ప్రమాదం యేర్పడుతోందని విన్నప్పుడు నాకు నవ్వొస్తుంది. మీరు నిజంగా అలా అనుకోవడంలేదు. లోగడ ఆ దేశాన్ని అమెరికా పెరడుగా మార్చివేశారు. అక్కడి ప్రజలు పాతపద్ధతుల్లో జీవించలేకపోయారు. నియంతృత్వాన్ని వారు యిక యేమాత్రమూ సహించలేకపోయారు. దానికి వ్యతిరేకంగా తిరుగబడినారు.

అధికారం కైవసంచేసుకున్న ప్రజల న్యాయసమ్మతమైన ఆగ్రహాన్ని బలపర్చిన వారు చేసింది నైతికంగా సరైనపని అని మేము విశ్వసిస్తున్నాము. అమెరికా ప్రభుత్వానికి యిది యెందుకు నచ్చడలేదు? నికరాగ్వా అమెరికాకు ప్రమాదకారికాదని అమెరికన్ కాంగ్రెస్‌లో సైతం అర్థంచేసుకొన్నారనీ, అమెరికన్లు ఖచ్చితంగా అర్థంచేసుకొన్నారని నేననుకొంటున్నాను.

ప్ర: అయితే మీరు చెప్పినట్టి నూతన ఆలోచనా ధోరణి ప్రకారం నికరాగ్వా, క్యూబాలాంటి ప్రదేశాలకు సైనిక సహాయాన్ని తగ్గించడానికి, ఆ ప్రభుత్వాలు తమ కాళ్ళపై తాము నిలబడ నారంభించ నివ్వడానికి యిది సమయం కాదా?

జ: మీరు నూతన ఆలోచనా ధోరణిని గురించి అదే పనిగా మాట్లాడు

తున్నారు కాబట్టి మీకొక చిన్న పాఠం చెప్పనివ్వండి. నేను చెప్పబోయే దానిపై మీకెలాంటి ఫిర్యాదులూ వుంటాయనుకోను.

ప్ర: మీరు నూతన ఆలోచనా ధోరణి బోధకులు....

జ: (గొర్బచేవ్ నవ్వుతూ) ప్రపంచ పరిస్థితి 30, 40 యేళ్ళకు పూర్వం వున్నదానికి మౌలికంగా భిన్నమైనదని అనుకుంటున్నాను. యిక 50 లేక 70 యేళ్ళ క్రితంకన్నా యింకా చాలా భిన్నంగా వుందని వేరే చెప్పనక్కరలేదు. సామ్రాజ్యాలు అంతరించిపోయాయి. అవి యిక లేవు. డజన్లకొద్దీ దేశాలిప్పుడు స్వతంత్రంగా అభివృద్ధి చెందుతున్నాయి. యీ దేశాలన్నీ కేవలం రాజకీయ స్వాతంత్ర్యాన్నీ, స్వయంపాలననూ మాత్రమేగాక మెరుగైన జీవితాన్ని కోరుతున్నాయి. ఆ దేశాల ప్రజలు మనుషులుగా జీవించాలని కోరుకుంటున్నారు. వారికి తిండి అవసరం, బట్ట అవసరం, మందులు అవసరం.

ఆసియా, లాటిన్ అమెరికా, ఆఫ్రికాల్లోని రెండున్నర బిలియన్లమంది ప్రజలకు విస్తార సహజ వనరులు, విస్తార మానవ బలగ వనరులు అందుబాటులో వున్నప్పటికీ వారు అప్పుల్లో మునిగివున్నారు. వారి జీవన ప్రమాణం బహు తక్కువగా వుంది. ఈ విషయం, ఒక్కసారి ఆలోచించడానికి ప్రయత్నించండి.

కాబట్టి యీ ప్రశ్న వుత్పన్నమవుతోంది: యీ పరిస్థితిని పట్టించుకోకుండా వుండగలమా? లేదు అలా పట్టించుకోకుండా వుండలేము. దాన్ని పరిష్కరించడం అవసరం.

జీవావరణ పరిస్థితిని తీసుకోండి. యిది ప్రపంచవ్యాప్త సమస్యకాదా? రోగాలకు వ్యతిరేకంగా పోరాటం మాటేమిటి? ఇది వుమ్మడి సమస్య కాదా? శాస్త్ర, సాంకేతిక శాస్త్ర విప్లవాన్ని ఆకళింపుకొనే మాటేమిటి? ఈ సమస్యలన్నిటినీ మనం సహకారం లేకుండా పరిష్కరించగలమా? యిది వుమ్మడి, ప్రపంచవ్యాప్త సమస్యకాదా?

సోవియట్ యూనియన్‌కు ప్రయోజనాలుంటే, అమెరికాకు ప్రయోజనాలుంటే యితర దేశాలకూ, యితర దేశాల ప్రజలకూ వాటి వాటి ప్రయోజనాలు వాటికి వుంటాయనుకుంటాను. మునుపు అంతర్జాతీయ సంబంధాలు బలవంతుడిదే అధికారం, బడితె యెవ్వరిదో బర్రెవారిది అనే న్యాయం వినాదంపై నిర్మాణమయాయి. కాని అవి యీనాటికి తగినవికావు. మనకెంత బలమున్నప్పటికీ దేశదేశాల ప్రజలపై మన విలువలను, మన జీవన విధానాన్ని రుద్దలేము; వారిపై సామాజిక యెంపికను రుద్దలేము. దాన్ని నిర్ణయించుకునేవని వాళ్ళదే. మనం యీ యెంపిక హక్కును గుర్తించనిదే, ప్రతీ దేశ ప్రయోజనాలనూ గుర్తించనిదే అంతర్జాతీయ సంబంధాలనుంచీ యెలాంటి ప్రయోజనమూ సిద్ధించదు.

అలాంటి సంబంధాలలో తీవ్ర విస్ఫోటనల ప్రమాదం గర్భితమై వుంటుంది. ప్రతి దేశానికి గల యెంపిక హక్కును గౌరవించడం నూతన ఆలోచనాధోరణికి ప్రాతిపదిక్షమేము ఆ యెంపిక హక్కును గుర్తిస్తాం. అంతేకాదు. నైతికంగానూ, సాధ్యమై

వపుడు ఆర్థిక, సైనిక, రక్షణ సహాయాలందించడంద్వారా కూడా, ఆయా దేశాలకు గల ఆ హక్కును బలపర్చేందుకు అవిధంగా ప్రయత్నిస్తాము. ఆయా దేశాల ప్రజలు తాము కైవసం చేసుకున్న అధికారాన్ని రక్షించుకోగలిగేలా చేస్తాము.

ఎవరైనా యీ పరిస్థితి లోతుపాతులు తెలుసుకోవాల్సింది యిక్కడే. ఎవరైనా సమన్వయీకృత కృషి ద్వారా తన వైఖరిని మార్చుకోవాల్సివుంది. ఎవరైనా తమ చుట్టూగల ప్రపంచాన్ని ఆదేశించజాలరు. దీనివల్ల యేమీ ప్రయోజనంలేదు. ఎవరైనా తన వైఖరిని మార్చుకోవాల్సివుంది.

ప్ర: ప్రధాన కార్యదర్శిగారూ, రాజకీయాల్లో చిహ్నాలు యెంత ముఖ్యమైనవో మీకు తెలిసిందే. తూర్పు, పశ్చిమాలుగా ప్రపంచ విభజనకన్నా, బెర్లిన్ గోడకన్నా యెక్కువ అసహ్యకరమైన చిహ్నం ప్రపంచంలో మరొకటిలేదు. తూర్పు జర్మన్లు దాన్ని నిర్మూలించేలా వారిపై మీకున్న పలుకుబడిని యెందుకు మీరు వుపయోగించరు? యికముందు ఆ విభజనవల్ల ప్రయోజనమేమిటి?

జ: అది చాలా స్పష్టమైన ప్రశ్న అని అనుకుంటున్నాను. తన యెంపికను రక్షించుకోవడం, తన ఆంతరంగిక వ్యవహారాల్లో యెలాంటి జోక్యాన్నీ అనుమతించక పోవడం—యివి ఒక సార్వభౌమ దేశానికి, జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్‌కు గల సార్వభౌమ హక్కు. యీ దేశ ప్రజలకు పశ్చిమ బెర్లిన్‌ద్వారా రాజకీయంగానూ, ఆర్థికంగానూ యెంతో హాని జరిగింది కాబట్టి యివన్నీ ఒక నిర్దిష్ట పరిస్థితివల్ల వుత్పన్నమైన వాస్తవాలు.

నేను ఒకప్పుడు ఒక పశ్చిమ జర్మనీ దేశస్థుడికి చెప్పినట్టు మీకు యిలా చెప్పగలను. ఆయన నాతో యిలాఅన్నారు. "గొర్బచేవ్ గారూ, హిట్లర్లు వస్తారు, పోతారు. అయితే జర్మన్ ప్రజలుమాత్రం నిత్యంవుంటారు. జర్మన్ రాజ్యమూ అలాగే వుంటుంది అని స్టాలిన్ చెబుతూవుండేవారు. కానీ, మీరు జర్మనీని రెండు రాజ్యాలుగా విభజించారు." అప్పుడు నేనాయనతో యిలాచెప్పాను: సరే, మనం చరిత్రనూ, వాస్తవాలనూ గుర్తుచేసుకుందాం. వాటినన్నిటినీ ఆయనకు గుర్తుచేశాను. యివన్నీ ఆయనకు తెలుసునని తేలింది. యాల్టా, పోట్స్‌డామ్ నిర్ణయాలకు విరుద్ధంగా జర్మనీ విభజన జరిగింది.

కాబట్టి, యీగోడ మీరనుకుంటున్న దానికంటే ముందే ప్రత్యక్షమైంది. ఆగోడ మరో విధమైన పదార్థాలతో కట్టినదంటే, అది వేరే సంగతి. ఫలితంగా జరిగినవేవో అవే యిప్పుడు మన ముందున్నాయి: యిప్పుడవీ వాస్తవాలు. మనం వాటినలాగే చూడాలి.

ప్ర: సరే, యీగోడ చరిత్రను మళ్ళీ మనం ఆసాంతం యే కదుపుపెట్టలేమని అనుకుంటాను. కాని, యిప్పుడు మానవ హక్కులను గురించి యెత్తుకుందాం. సోవియట్ యూనియన్ ప్రజలు తమ పౌరసత్వాన్ని కోల్పోయే ప్రమాదం లేకుండా వారు స్వదేశం నుంచీ వెళ్ళడానికీ, తిరిగి రావడానికీ మీరు అనుమతించకుండా వున్నట్లయితే సోవియట్

యూనియన్‌లో నూతన ఆలోచనా ధోరణి, ఒక నూతన ప్రజ్ఞానంవుందని ప్రపంచాన్ని మీరెలా నమ్మించగలరు?

జ: బ్రోకాగారూ, నేను సూటిగా చెబితే మీకు కోపం రాదనుకుంటాను. నా యెదుట, బల్లకు అవల ఒక విద్యావంతుడు, బాగా విషయ పరిజ్ఞానమున్న వ్యక్తి కూర్చుని వున్నాడని భావిస్తున్నాను. చాలాపెద్ద, ముఖ్యమైన విషయానికి మనం వచ్చినప్పుడు మీరు కేవలం దానికి సంబంధించిన వ్యూహాగానాన్ని గురించి ప్రస్తావిస్తున్నారు.

ఏ అమెరికన్ ప్రతినిధితోనైనా, మీరు సిద్ధంగావుంటే మీతో సైతం మానవ హక్కులను గురించి మాట్లాడటానికి నేను సిద్ధమే, మా దేశంలోనూ, మీ దేశంలోను, ప్రపంచంలోని యితర భాగాలలోను మానవ హక్కుల పరిస్థితి యెలావుందో మీకు రుజువుచేయగలను. మేము హక్కులకు, పౌరుల విస్తృత హక్కులకు అనుకూలం.

వాస్తవానికి అదే మా విప్లవ వుద్దేశం. విప్లవ కాలంలో మేమేమి చేశామో మీకు తెలుసా? అధికారాన్ని భూస్వాములనుంచీ లాగివేసి ప్రజలకు యిచ్చాము. ఫ్యాక్టరీలను, యంత్రాగారాలను, వ్యక్తిగత ఆస్తిని లాక్కుని వాటిని శ్రామిక ప్రజలకు యిచ్చాము. మనిషిని మనిషి చేసే దోపిడీని ఆ ప్రాతిపదికపై రద్దు చేశాము.

ప్రణాళికా బద్ధ ఆర్థిక వ్యవస్థను వృద్ధి చేశాము. ప్రతి వ్యక్తికీ పని హక్కుకు హామీ యిచ్చాము. యిప్పటికి అనేక సంవత్సరాలుగా 50 పైచిలుకు సంవత్సరాలుగా మేము నిరుద్యోగం యెరుగము. దేశంలో విద్యవుచితం. దీనికి ప్రభుత్వం హామీ యిస్తోంది. వైద్య చికిత్స వుచితం. దీనికి ప్రభుత్వం, సమాజం హామీయిస్తున్నాయి. శ్రామిక ప్రజలకు యిళ్ళు సమకూర్చేందుకు బాధ్యతను చాలవరకూ ప్రభుత్వమే వహిస్తోంది.

ఇది ఆసక్తికరమైన విషయం. యెందుకంటారా? జాతీయాదాయం స్థాయిని తీసుకుంటే, తలసరి లెక్కన మా దేశం అమెరికాకన్నా దిగువనే వుంది. కాని, సామాజిక గ్యారంటీల విషయంలో మా సమాజం మీ సమాజ స్థాయికన్నా చాలా యెక్కువ వున్నత స్థానంలో వుంది. చూడండి, మీరు యెప్పుడు పుట్టారు?

ప్ర: ప్రధాన కార్యదర్శిగారూ, నేను 1940 లో పుట్టాను. ఇక్కడ నేను దేన్నిగురించి మాట్లాడుతున్నానో మీకు తెలుసునని నాకుతెలుసు....

జ: ఒక నిముషం వుండండి, ఆ విషయానికే వస్తాను.

కాబట్టి, యీ సమస్యలన్నీ పరిష్కారమైతే తప్ప నిజమైన హక్కులేవీ వుండ జాలవని నమ్ముతూ, ఫ్రాంక్లిన్ డిలానో రూజ్వెల్ట్ 1944 లో సామాజిక, ఆర్థిక హక్కులను గురించిన తన బిల్లును ప్రవేశపెట్టారు. అది చాలా ఆసక్తికరమైన బిల్లు. కానీ అది ఆరోజునుంచీ కాంగ్రెస్ పురావస్త్రభాండాగారంలో అలాగే పడివుంది.

సామాజిక. ఆర్థిక హక్కులను గుర్తించకుండా వున్నందుకు, ఆ విషయానికి సంబంధించిన అంతర్జాతీయ ఒప్పందాలపై అది సంతకం చేయనందుకు, లేక, దాన్ని

ధ్రువీకరించవందుకు విమర్శలకు అమెరికా గురి అవుతున్నది. ప్రపంచమంతా అమెరికాను విమర్శిస్తోంది. గత జూలైలో రీగన్ మళ్ళీ సామాజిక, ఆర్థిక హక్కుల పై తన పక్కలో ఒక బిల్లును ప్రవేశపెట్టారు. కానీ, అది రూజ్వెల్టు బిల్లుకు భిన్నమైందను కోంది. అమెరికా ప్రజలకు గల ఆర్థిక, సామాజిక హక్కుల రక్షణ విషయంలో వారి హక్కును అమెరికన్ కాంగ్రెస్, అమెరికన్ ప్రభుత్వం గుర్తించడానికి యింకా చాలా కాలం పడుతుందని, మిసిసిపీ, ఓల్గా నదులలో చాలా నీరు ప్రవహిస్తుందని నేను అనుకుంటున్నాను. కానీ, ఆ హక్కులకన్నిటికీ యిదివరకే సోవియట్ యూనియన్‌లో హామీ కల్పించాము.

మీరు ప్రస్తావించిన సమస్యను తీసుకుందాం. మీ దేశమేర్పడడం వలసక్రమాల ఫలితంగానే కాబట్టి అమెరికన్ పక్షానికి దేశంనుంచీ నిష్క్రమణ, దేశంలోకి ప్రవేశం గురించిగల శ్రద్ధ నేనర్థంచేసుకుంటున్నాను. కాబట్టి, మన దృక్పథాలు వేరు. మెక్సికో నుంచి, లేదా, యితర దేశాలనుంచీ నైపుణ్యాలులేని వారిని రానివ్వడం అమెరికాలో, లేదా, కెనడాలో వారికి యిష్టంలేదని మీకు తెలుసు. సోవియట్ యూనియన్‌నుంచీ వలస పోవాలనుకున్న వారు 1970 లలో ప్రత్యేకించి పెద్ద యెత్తున తరలిపోతున్నప్పుడు వున్నత స్థానంలోవున్న మీదేశ ప్రభుత్వ ప్రతినిధి ఒకరు యిలా ప్రకటించాడు: సోవియట్ యూనియన్‌కు నష్టకరంగా మేము గణితశాస్త్రజ్ఞుల సమస్యను 50 శాతం పరిష్కరించుకున్నాము. యిక్కడకూడా అమెరికా తాను మానవ హక్కులకోసం నడుముకట్టినట్టు నటిస్తూ యీ మార్గాలద్వారా తన సొంత సమస్యను పరిష్కరించుకో గలుగుతున్నది. కాని, వారు ప్రోత్సహిస్తున్నదల్లా మేధావుల వలసనే.

కాని, మమ్మల్ని మేము కాపాడుకుంటున్నాము. అదీ మొదటి విషయం: ఇక రెండో విషయం: మా దేశంనుండీ ప్రజలను యెరచూపి లాగివేయడాన్ని మేము యెన్నటికీ అనుమతించబోము.

ప్ర : అనేక సందర్భాల్లో....

జ : ఈ సందర్భాలు కాలగతితో అంతకంతకు స్పష్టమవుతాయి. ప్రతి ఒక్కటీ స్పష్టమౌతుంది. వ్యక్తిగతమైన విడివిడి సందర్భాలన్నిటినీ మేము కూలం కషంగా పరిశీలిస్తున్నాము. యిది కాంగ్రెస్‌కూ, అధ్యక్షుడికీ బాగా తెలుసు. ప్రతివ్యక్తి విషయాన్నీ మానవతాస్ఫూర్తితో మా చట్టాల పరిధిలో యెల్లప్పుడూ పరిష్కరిస్తున్నాం. మాలో సామెత వున్నట్లు యితరుల మఠంలోకి తన సొంత నియమావళితో ప్రవేశిస్తానని ఎవరూ అనకూడదు. మాకు ఒక రాజ్యాంగం, శాసనాల ప్రాతిపదికపై మా ప్రజా తంత్ర రాజ్యం వుంది. మా సత్సంకల్పం సంగతికివస్తే మాకదీ వుంది. కుటుంబ పునరేకీకరణ—అది నిజంగా సమస్య అని మా అభిప్రాయం. యీ సమస్యను పరిష్కరించడానికి శక్తివంచన లేకుండా పాటుపడతాం. విదేశాలకు వలసపోవడానికి సంబంధం

వున్న యితర సమస్యలుకూడా వుండవచ్చు. వాటిని శ్రద్ధతో పరిశీలించనున్నాము.

కాని, యీ సమస్యను రాజకీయ ప్రయోజనాలకై వుపయోగించుకోరాదు.

ప్ర: ప్రధాన కార్యదర్శిగారూ, మీ దేశంలో చట్టం మరీ విధానంగా అమలు జరుగుతుందని మీరనుకుంటున్నారా? మీ వ్యక్తిగత అభిప్రాయమేమిటి? 4000 మంది సోవియట్ యూదులవీసాల విషయంలో చాలా జాప్యం జరుగుతోంది. వారి విషయ మేమి? వారిలో కొంతమంది యిప్పుడు కాన్సర్‌తో బాధపడుతున్నారు; తమ కుటుంబా లతో కలిసివుండేందుకుగాను సోవియట్ యూనియన్‌ను వదలివెళ్ళాలని వారి కోరిక. సాటిమనుషులుగా వారిని గురించి మీ అభిప్రాయమేమిటి?

జ: కొందరిని రాజ్యభద్రతా కారణాలవల్ల మాత్రమే దేశంవదలివెళ్ళడానికి అనుమతించడం లేదని నేననుకుంటున్నాను. అందుకు మరే కారణాలు లేవు. మేము యిక ముందుకూడా అలాగే వ్యవహరిస్తాము.

ప్ర: ప్రధాన కార్యదర్శిగారూ, పెరిస్త్రోయికాను గురించీ, మీ ఆర్థికరంగ నూతన వ్యవస్థీకరణను గురించీ కొంత అడగాలని భావిస్తున్నాను. సోవియట్ యూని యన్‌లో ఆహారోత్పత్తి పునర్వ్యవస్థీకరణకన్నా యెక్కువ అవసరమైనది మరొకటిలేదు. యీ మహారాజ్యం ఆహారాన్ని దిగుమతిచేసుకోవలసి వస్తోంది. రెండు శాతమున్న మీ చిన్న కమతాలు పెద్ద మొత్తంలో ఆహారపదార్థాలను వుత్పత్తిచేస్తున్నాయి. వ్యక్తిగత వ్యవసాయ కమతాలను మీరు పెద్ద యెత్తున విస్తృతపరచి మరింత ప్రోత్సాహమిచ్చే ప్రాతిపదికపై వాటిని నెలకొల్పుతారా?

జ: ఈ ప్రశ్న మీ అధ్యక్షుడు రీగన్ అడిగిన వాటిలో ఒకటి. బహుశా, ఈ ప్రశ్ననుకూడా వేయవలసిందిగా మిమ్మలను ఆయన అడిగి వుండవచ్చునని అను కుంటున్నాను. సరిగ్గా యిదే ప్రశ్న.

ప్ర: లేదు. ఈ సమాచారం విస్తృతంగా అమెరికాలో అధ్యక్షునికి, సామాన్య విలేఖరులకూ కూడా లభ్యమవుతున్నది.

జ: సరే, వస్నొకవిషయం చెప్పనివ్వండి. మా దేశంలో ఆహార సమస్య నిజంగానే వుంది. అయినప్పటికీ, మేము సగటున, 3,400 కాలరీల ఆహారం తీసు కుంటున్నాము. కాబట్టి, అసలు సమస్య తిండి తీర్థాల స్వరూపానికి సంబంధించినది.

ఇక, వ్యక్తిగత చిన్న కమతాలు యెంత వుత్పత్తిచేస్తున్నవనే విషయానికి వద్దాం. వ్యక్తిగత ఖండ్రికల మొత్తం విస్తీర్ణం వ్యవసాయ భూమిలో దాదాపు 2 శాతం వుంటుంది. అవి కొన్ని వ్యవసాయప్పంటల్లో మూడోవంతు పండిస్తున్నాయి. ఆ వ్యక్తిగత కమతాలు వాటంతటవే అయితే యేమీ చేయగలిగివుండేవి కావు. వాటికి కావలసిన ధాన్యం, పశువులు, సాంకేతిక సహాయం, నిపుణుల సలహాలు, రవాణా సదుపాయాలు, విత్తనాలు సమిష్టి క్షేత్రాలనుంచీ, ప్రభుత్వ క్షేత్రాలనుంచీ అందుతున్నాయి. అవి సమిష్టి క్షేత్రాలతోనూ, ప్రభుత్వ క్షేత్రాలతోనూ యేకీకృతమై వున్నాయి.

కంట్రాక్టుల పద్ధతి ఒకటి వుంది. ఒక సమిష్టిక్షేత్రం, ఒక చిన్న కమతం కంట్రాక్టులపై సంతకం చేస్తాయి. మామూలుగా వాటికి అదే ప్రభుత్వ క్షేత్రంలోనో, లేదా అదే సమిష్టి క్షేత్రంలోనో సభ్యత్వం వుంటుంది. ఆవిధంగా అవి వ్యవసాయోత్పత్తిని పెంచే క్రమంలో భాగస్వామ్యం పొందుతున్నాయి.

ప్ర: ఈ పద్ధతిని మీరు విస్తరింపచేస్తారా?

జ: దీనంతటిలో చాలా ఆసక్తిదాయకమైన ఒక విశేషముంది. ప్రస్తుతం మేము ఒక దీర్ఘ కాలిక ప్రాతిపదికపై కుటుంబాలకు, కొంతమంది గల బృందాలకు ఒక ఖండ్రికను తీసుకోవలసిందిగా లేదా కొన్ని పరికరాలనో, యంత్రాలనో అద్దెకు తీసుకుని, తమ చొరవ యెలాంటిదో చూపవలసిందిగా కోరుతున్నాము.

ఈ అవకాశాలను, భారీస్థాయి క్షేత్రాల శక్తి, స్తోమతలను, యీ చిన్న బృందాల వ్యక్తిగత ప్రయోజనాలను మేళవించగలుగుతున్నాము. మేము అన్ని విధాలా తోడ్పాటు యివ్వనున్న రంగమిది. ఇప్పటికే, యిది మంచి ఫలితాలనిస్తోంది.

కాని, యిలా చేస్తున్నామంటే మేము సమిష్టి వ్యవసాయక్షేత్ర వ్యవస్థను రద్దు చేస్తున్నామని అర్థం యెంతమాత్రం కాదు. పెద్ద పాత్ర వహిస్తున్న భారీస్థాయి క్షేత్రాలకు గల అవకాశాలతో, యేదో ఒక పంటను పండించాలని, లేదా మాంసం, పాడి సరకులను వుత్పత్తిచేయాలని అభిలాష వున్న కుటుంబ లేదా, కొద్దిమంది గల చిన్న బృందం చొరవనూ, ప్రయోజనాలనూ, వ్యక్తిగత, పాదార్థిక ప్రయోజనాలనూ సమ్యమైన రీతిలో సమ్మిళితంచేసే పద్ధతి యిది. మేము దీన్ని క్రియాశీలంగా పెంపొందిస్తాము.

ప్ర: ధరలను నిర్ణయించడానికి విడి విడి కర్మాగారాదులను అనుమతించ నున్నారా? మీ దేశంలో నిరుద్యోగం పెరగడానికి అనుమతించ బోతున్నారా? పెరిస్త్రోయికాలో భాగంగా ఆర్థిక మాంద్యాలు, ద్రవ్యోల్బణం రాగల ప్రమాదానికి తావిస్తారా? అది సోవియట్ ఆర్థిక వ్యవస్థను సమూలంగా తలక్రిందులు చేయడమవుతుందికదా?

జ: లేదు. దీన్ని సోషలిజం పరిధిలోనే, మా సొంత పద్ధతులద్వారానే పరిష్కరిస్తాము పాశ్చాత్యదేశాల్లో, నిర్మాణ రూపానికి సంబంధించిన విధానంవల్ల ఆధునికీకరణలతోపాటు నిరుద్యోగం పెరుగుతోంది. దీన్ని తప్పించాలని మా దృఢకాంక్ష. నేను పేర్కొన్న పద్ధతిద్వారానే ఈ పని చేస్తాము.

ప్రణాళికా బద్ధ ఆర్థిక వ్యవస్థ అటువంటి అవకాశాలను ఆవిష్కరిస్తుంది. అధునాతన శాస్త్ర సాంకేతిక రంగాలలో, యితర రంగాలలో, ప్రత్యేకించి సేవా, వర్తకరంగాలలో కొత్త ఉద్యోగాలను సృష్టించే ప్రణాళికలను యిప్పటికే రూపొందిస్తున్నాము.

ప్రజలను ఒక రంగంనుంచి మరొక రంగానికి ప్రణాళికా బద్ధ ప్రాతిపదికపై బదలాయించడం జరుగుతోంది. వారికి ప్రభుత్వం తగిన సహాయంచేస్తుంది. అవసరమైన పునశ్శిక్షణ కూడా యిస్తుంది.

శ్రామిక ప్రజల ఆదాయాలకు దెబ్బతగలని విధంగా యిదంతా జరుగుతుందని నా నమ్మకం. వేరుమాటల్లో చెప్పాలంటే నిరుద్యోగానికి అవకాశంలేని విధంగా, సోషలిస్టు దృక్పథాల పరిధిలో, ఆర్థిక వ్యవస్థను శాస్త్ర, సాంకేతిక ప్రగతికి అనుగుణంగా మలిచే విధానాన్ని అమలు జరుపుతాము. అది మా కీలక కర్తవ్యం.

ప్ర: సమీప భవిష్యత్తులో సోవియట్ యూనియన్‌లో కమ్యూనిస్టు పార్టీ తప్ప మరొక పార్టీ వుండదన్న మాటేనా?

జ: మరో పార్టీ ఆవశ్యకత నాకు కనిపించడంలేదు. అది మా సమాజ దృక్పథం. నేడు జరుగుతున్న మార్పులు, ఆర్థిక రంగాన్ని, రాజకీయాలను, ప్రజా స్వామ్య రంగాన్ని, ఆత్మిక రంగాన్ని, సామాజిక రంగాన్ని ఆవరించిన గంభీరమైన మార్పులు అన్నీకూడా సోవియట్ కమ్యూనిస్టు పార్టీ చొరవపైన్నే జరుగుతున్నాయి.

దేశంలో మేమొక కొత్త వాతావరణాన్ని, గ్లాస్నోస్త్, బాహాటత వాతావరణాన్ని పెంపొందించాము. ప్రజాతంత్రీకరణ, గ్లాస్నోస్త్ క్రమాలను యింకా ముందుకు తీసుకు వెళ్ళే పథకాలు మాకున్నాయి. ఇదంతా కమ్యూనిస్టు పార్టీ చొరవపై సాగుతోంది. పార్టీ విమర్శనాగ్నిని తనపై కూడా ప్రసరింపజేసుకున్నది. ప్రజాస్వామ్యమంటే యిదే.

ప్ర: సరే, యింకోసంగతి: మీరు సత్యమే ప్రధాన విషయమని మీ వుపన్యాసాల్లో చెప్పారు. మరింత వెలుగు వుండాలని లెనిన్ చెప్పినట్టు మీరు వుల్లేఖించారు. కాని, కేంద్రకమిటీలో మీ సహచరుల్లో ఒకరూ, మాస్కో పార్టీ అధినేత అయిన బోరిస్ యెల్త్సిన్ సంస్కరణలకు అనుకూలంగా, మరింత సత్వరమైన సంస్కరణలకు అను కూలంగా మాట్లాడినప్పుడు, ఆయన ప్రసంగాన్ని ప్రచురించలేదు. కాని, ఆయన్ను పదవినుంచీ తొలగించినప్పుడు చాలా బహిరంగ పద్ధతిలో ఆ పని జరిగింది. దీన్ని గురించి చాలా రాశారు కూడా. దీనిలో స్టాలినిజం ప్రతిధ్వనులున్నట్టు కొంతమంది అమెరికన్ పరిశీలకులు భావిస్తున్నారు. జరిగినది పొరపాటా?

జ: లేదు. పొరపాటు జరగలేదు. మేము పెరిస్త్రోయికా మార్గాన్ని దృఢంగా, నిలకడగా అనుసరిస్తాము. ప్రజాస్వామ్య పథాన్ని, సంస్కరణల పథాన్ని దృఢంగా, నిలకడగా అనుసరిస్తాము. కానీ. మేము పరిణామ దశలను దాటవేయము. యేవిధమైన దుస్సాహసికతనూ అనుమతించబోము. ఆ విషయంలో మేము యితర దేశాల అనుభవాన్ని, మా సొంత అనుభవాన్ని కూడా అధ్యయనం చేశాము. కాని, మేము యధాతథవాదాన్ని కూడా అనుమతించబోము. దుస్సాహసికతను అనుమతించ కుండానూ, అదేసమయంలో ఛాందసవాదాన్ని దృఢంగా తిప్పికొడుతూ మా పోరాటాన్ని సాగిస్తాము. మా పని తుదకంటా నిర్వహిస్తాము. బాధ్యతతో వ్యవహరిస్తాము. మా వెనుక బ్రహ్మాండమైన మా దేశం యావత్తూవుంది; దేశ మహాప్రజ యావత్తూ వుంది. రాజకీయాలతో సయ్యాటలను అనుమతించజాలము. చూడండి, యెల్త్సిన్ విషయంలో

జరిగింది వాస్తవానికి యే ప్రజాస్వామ్యంలోనైనా జరిగే ఒక మామూలు పరిణామమే.

అమెరికాలో, అధ్యక్షుడు రీగన్ ప్రభుత్వంలో యిటీవలనైతం యెంతమంది పాత మంత్రుల స్థానంలో కొత్తవారు వచ్చారో నేను యేకరువు పెట్టదలచలేదు.

ప్ర: అవును. తమ స్థానంలో కొత్త వారు వచ్చినప్పుడు, తమనెందుకు తొలగించడం జరిగిందీ అనే విషయమై మాట్లాడే అవకాశం వారికుంటున్నది. వారు చెప్పేదేమిటో మేము వినగలుగుతున్నాము.

జ: ఈ సందర్భంలో ఒక మాట. కేంద్రకమిటీ ప్లీనరీ సమావేశంలో— కామ్రేడ్ యెల్త్సిన్ రెండుసార్లు మాట్లాడారు. నగరపార్టీ కమిటీ ప్లీనరీ సమావేశంలో మాట్లాడారు. నగరపార్టీ కమిటీలో ఆయనచేసిన ప్రసంగాన్ని యధాతథంగా ప్రకటించడం జరిగింది. తన పదవినుంచీ తన్ను విడుదలచేసిన సమస్యను యెల్త్సిన్ ఆ సమావేశంలో స్వయంగా లేవనెత్తారు.

అటువంటి సమస్యలను మేమే స్వయంగా పరిష్కరించుకోగలం. దయచేసి వాటిని మాకే వదిలిపెట్టండి. పెరిస్త్రోయికాలో యితర సమస్యలుకూడా వుండబోతాయి. వాటిని కూడా పరిష్కరించవలసివుంటుంది. పెరిస్త్రోయికా లక్ష్యంగా మా రాజకీయ పంధాను మేము కొనసాగిస్తూనేవుంటాము. ఆ పంథాను అనుసరించడంలో పట్టుదలతో వ్యవహరిస్తాం.

ప్ర: మనకిక కొన్ని నిముషాల వ్యవధి మాత్రమే వుంది. వ్యక్తిగా గొర్బచేవ్‌ను గురించి మరికొంత తెలుసుకోవాలనివుంది. స్త్రీలను నిజంగా స్త్రీల విద్యుక్తధర్మానికి తిరిగి మళ్ళేలా యెలా చేయవచ్చుననే విషయంలో మీ దేశంలో తీవ్రవాదోపవాదాలు జరిగాయి. స్త్రీ తల్లిగా, గృహిణిగా తన సాంప్రదాయక పాత్రలో స్వగృహంలో మరింత యెక్కువకాలం గడపాలని మీరు భావిస్తున్నారా?

జ: లేదు. స్త్రీలు సమస్త జీవితరంగాల్లో, సమాజంలో జరుగుతున్న సమస్త పరిణామ క్రమాల్లో పాల్గొనాలని నా అభిప్రాయం. కాని, వారు ఒక రంగంలో చేసేకృషి మరొ రంగంలో చేసేకృషికి నష్టం కలిగించకుండా వుండేలా యిది జరగాలి. అంతేకాదు. మా స్త్రీలు సామాజిక, సాంస్కృతిక క్రమాలలో తమ క్రియాశీల పాత్రను తమ విధ్యుక్త ధర్మంతో అంటే, గృహిణిగా, కుటుంబనేతగా, రక్షకురాలుగా తన ధర్మంతో మేళవించడానికి వారికి యెలా తోడ్పడాలో ఆలోచించాలి. కుటుంబం పటిష్టంగా వుందీఅంటే సమాజమూ పటిష్టంగా వుందన్నమాటే.

కాబట్టి, పౌర వ్యవహారాల్లో మహిళల భాగస్వామ్యంపై మేము ఆంక్షలు విధించబోము. అటు తమ మాతృత్వ విధులను, తల్లులుగా తమ పాత్రను, యిటు దేశ క్రియాశీల పౌరులుగా తమ పాత్రను సమ్మిళితం చేయటం మహిళలకు మరింత సులభంగా వుండేలా మేము వారికి తోడ్పడుతాము.

ప్ర : మీ ప్రయాణాలలో శ్రీమతి గోర్బచేవ్ మీతో వుండటం ప్రస్ఫుటంగా కన్పించింది. సాయంత్రం మీరు యింటికి వెళ్ళినప్పుడు పౌర జీవిత సమస్యలు, మొదలైన వాటిని గురించి ఆమెతో మాట్లాడుతారా?

జ : మేము అన్ని విషయాలూ చర్చిస్తాము.

ప్ర : అమెరికాను గురించి మీరు యే విధంగా తెలుసు కుంటుంటారు? మీరు అమెరికన్ వార్తాపత్రికలను చదువుతారా? అమెరికన్ టెలివిజన్ కార్యక్రమాలను చూస్తారా? అమెరికాలో యేమి జరుగుతున్నదీ మీకు తెలిపేందుకు వేరే ప్రత్యేక సిబ్బంది వున్నారా? మా దేశం గురించి తెలుసుకోవాలన్న మీ కుతూహలాన్ని యెలా తీర్చుకుంటున్నారు?

జ : నాకు చాలా సమాచారం అందుతుంది. పత్రికలద్వారానే గాక యితర మార్గాలద్వారా కూడా. అమెరికాలోని రాజకీయ సాహిత్యం, సోవియట్ విషయ పరిశోధనా సాహిత్యం, కల్పనా సాహిత్యం—వీటి అనువాదాలు అనేకం మాకున్నాయి. కాబట్టి, మా దేశంలో అమెరికాపట్ల ఆసక్తిగల యెవరికైనా అమెరికాను గురించి తెలుసుకునేందుకు అపార అవకాశాలు వున్నాయి.

ప్ర : మీరు అమెరికన్ గ్రంధ కర్తల పుస్తకాలేవైనా చదివారా?

జ : నేను చదివే వాటిలో సహజంగా రష్యన్ సాహిత్యానిదే ప్రధమ స్థానమని చెప్పాల్సివుంది. కాని, మా దేశంలో అమెరికన్ సాహిత్యంపట్ల నిజంగా యెంతో ఆసక్తివుంది. మా దేశంలో అనువదించిన అమెరికా రచయితల పుస్తకాలను గురించి లెక్కవేస్తే చాలా పెద్దసంఖ్యే తేలుతుంది. నేను యెక్కువగా అమెరికన్ ప్రబంధ సాహిత్యమే చదివాను. కాని, ప్రముఖ ఆధునిక రచయితల పుస్తకాలు కూడా నేను చదివిన వాటిలో వున్నాయి.

మానవ భావనా రంగాలన్నిటిలో తాము సాధించినవే పరమ సత్యమని అమెరికన్లు భావించకుండా వుండాలని మాత్రమే నేను కోరుతున్నాను.

వారితో అనేక సమస్యలపై చర్చలుజరపాలనీ, పరస్పరం అభిప్రాయాలను తెలుపుకోవాలనీ వాంఛిస్తున్న వారు యెందరో వున్నారని వారికి అప్పుడు మాత్రమే తెలుస్తుంది.

ప్ర : అమెరికాలో 1988 లో జరిగే అధ్యక్షుని యెన్నికల ప్రచారాన్ని మీరు గమనిస్తున్నారా? వచ్చే ఆకురాలుకాలంలో యెవరు గెలుస్తారని మీరనుకుంటున్నారు? అది అమెరికన్లందరూ తమకు తాము వేసుకుంటున్న ప్రశ్న.

జ : పార్టీ అనుబంధంతో నిమిత్తం లేకుండా, రిపబ్లికన్, లేదా డెమోక్రాటిక్, లేదా మరే పార్టీకిచెందిన యే ప్రభుత్వంతోనైనాసరే నిర్మాణాత్మకంగా మేము పనిచేయబోతామన్న భావంతో మేము వ్యవహరిస్తామని మీకు తెలుసు.

ఆవలి పక్షానికి తగువిధమైన అభిలాషవుంటే, తగువిధంగా కృషిచేస్తే, మేము వారితో తప్పక సహకరిస్తాము.

ఇక యెన్నికల ప్రచారం సంగతా? ఆ ప్రచారం తర్వాత సైతం మేము క్రియాశీలంగా సహకరిస్తామని, ప్రస్తుత అధ్యక్షుని తర్వాత ఆ స్థానానికి వచ్చిన యెవరితోనైనా సరే సహకరించడానికి మేము సిద్ధంగావుంటామని మాత్రం చెప్పదలచాను.

ఎవరు గెలుస్తారు, యెవరు తర్వాత అధ్యక్షుడవుతారు అని జోస్యంచెప్పడమనేది బాధ్యతా రహితమైన పని అని నాఅభిప్రాయం. తమకు కావలసినదెవరో అమెరికన్లు నిర్ణయించుకుంటారు. వారే స్వయంగా నిర్ణయం చేసుకుంటారు.

ప్ర: ప్రధాన కార్యదర్శిగారూ, చివరగా చాలాచాలా క్లుప్తంగా చెప్పండి: గొర్బచేవ్ శకంగురించి, యిక పదేళ్ళ తర్వాత అమెరికన్లు మిమ్మల్ని యేవిధంగా గుర్తుంచుకోవాలని మీ కోరిక?

జ: పదేళ్ళలో యిప్పటిదంతా స్మృతిపథంలోకి వెళ్ళిపోవడం నాకిష్టం లేదు. మేమిప్పుడు రూపొందించ నారంభించిన కృషి, ఆనాటికి ఒక నిజమైన పెల్లుబగా వుంటుందని నేననుకుంటున్నాను. కాబట్టి, యిది కేవలం ఒక పాతదానికి, గతానికి సంబంధించినదిగా వుండబోదని, శక్తివంతమైన వర్తమానకాలంలో భాగంగా వుంటుందని నా ఆశా, నా నమ్మకం.

నా సహచరులతోకలసి, మా శ్రామిక ప్రజలతో కలిసి యీనాడు నేను పనిచేస్తున్నది ఆ ధ్యేయంకోసమే. యీనాడు మేము మంచి విత్తనాలు వేస్తున్నామని, అవి మంచి పంటను, మంచి ఫలితాలను యిస్తాయని అనుకుంటున్నాను. అలాకాకుంటే యిప్పుడు మేము చేయడానికి ప్రయత్నిస్తున్నదంతా, వుత్సాహంలోనూ తీవ్రంగానూ చేస్తున్నదంతా, సోషలిజంకోసం, సోవియట్ ప్రయోజనాలకోసం ప్రతిదానిలో మంచి మార్పును తీసుకురావాలన్న గొప్ప అభిలాషతో చేస్తున్నదంతా అర్ధరహితమవుతుంది. ఈ దేశంలో నేడు జరుగుతున్నది, మానవ నాగరికత పురోగతికి ఒక ఖచ్చితమైన దోహదమవుతుందని నా నమ్మకం.

ప్ర: ప్రధాన కార్యదర్శిగారూ, ఈ అవకాశమిచ్చినందుకు మీకు నా ధన్యవాదాలు.

జ: "అమెరికన్ గడ్డపై మళ్ళీ మనం కలుసుకునేంతవరకు సెలవు" అని నా అమెరికన్ ప్రేక్షకులకు ఈ అవకాశాన్ని పురస్కరించుకుని మరోసారి నన్ను చెప్పనివ్వండి.

(టాస్, 1987 డిసెంబరు 1)

# అమెరికా పర్యటనారంభంలో మిహాయిల్ గొర్బచేవ్ పత్రికా ప్రకటన

1987 డిసెంబర్ 7 న అమెరికా చేరినమీదట సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ ప్రధాన కార్యదర్శి మిహాయిల్ గొర్బచేవ్ పత్రికా ప్రచురణార్థం ఒక చిన్న ప్రకటన చేశారు. తనకు అభినందనాలు తెలిపినందుకూ, అతిథి సత్కారాలు చేసినందుకూ అమెరికా విదేశాంగ మంత్రి జార్జి షుల్జ్‌కు కృతజ్ఞత తెలిపిన తర్వాత ఆయనిలా చెప్పారు:

ముందుగా సోవియట్ యూనియన్ ప్రజలందరితరపునా అమెరికా పౌరులకు శుభాకాంక్షలను తెలపదలుస్తున్నాను. మనదేశాలమధ్యా, మన ప్రజానీకాలమధ్యా మరింత మంచి సంబంధాలుండాలని మేము హృదయపూర్వకంగా కోరుతున్నామని సోవియట్ యూనియన్ ప్రజలతరఫునా, ప్రభుత్వంతరఫునా అమెరికన్ ప్రజలందరికీ హామీ యివ్వదలుస్తున్నాను.

మధ్యశ్రేణి, స్వల్పశ్రేణి మిసిలీల నిర్మూలన సంధిపై సంతకాలుచేసి తత్సంబంధమైన పనిని పూర్తిచేసేందుకు మనం యేంచేయాలని ప్రపంచంలోని సమస్త దేశాల ప్రజలూ, సమస్త దేశాలూ యెదురుచూస్తున్నాయో ఆవిధంగా యీ సమస్యకు పరిష్కార కృషిని పూర్తిచేసేందుకు నేను యీ పర్యటనార్థం మీ దేశానికి వచ్చాను.

సోవియట్-అమెరికా సంబంధాల కీలక సమస్యలు, వ్యూహాత్మకదాడి ఆయుధాల తగ్గింపునకు సంబంధించిన సమస్యలు అమెరికా అధ్యక్షునితో మా చర్చల్లో ప్రధాన చర్చనీయాంశంగా వుండబోతాయి.

అమెరికా నాయకులకు, అమెరికా అధ్యక్షునికి మేము చెప్పాల్సిన విషయాలున్నాయి. వారి పక్షంనుండీ కొన్ని కొత్తమాటలను వినగలమని మేము ఆశిస్తున్నాము. యితర అంతర్జాతీయ సమస్యలను కూడా మేము చర్చించబోతున్నాము. అవి దేశాలను కలవరపస్తున్న సమస్యలనీ, పరిష్కారంకోసం యెదురుచూస్తున్న సమస్యలనీ వేరే చెప్పనవసరంలేదు. ప్రపంచవ్యవహారాల్లో మనం నిర్వహించాల్సినపాత్రను మన రెండు దేశాలలో యెవ్వరమూ తప్పించుకోలేము. రెండుదేశాల ప్రజలపట్లా, యావత్తు ప్రపంచదేశాల ప్రజలపట్లా అత్యంత బాధ్యతా యుతంగా పనిచేయాల్సి వుంటుంది. అసలు, యీ సమావేశం జరుగుతూందన్న వాస్తవమూ, దాని ఎజెండా, యీ సోవియట్-అమెరికా మూడవ శిఖరాగ్ర సమావేశం ఎజెండా—యిది సోవియట్ యూనియన్ నాయకులపైనా, అమెరికా నాయకులపైనా పడిన బాధ్యత పెరుగుదలనూ, ఆ బాధ్యత పట్ల వారి అవహన పెరుగుదలనూ సూచిస్తున్నాయి. నిర్మాణాత్మక చర్చలు జరగాలనీ, సంబంధాలను మరింత మెరుగుపర్చుకోవాలనీ మేం కోరుతున్నాం.

యావన్మంది అమెరికన్లకూ శాంతి, సంక్షేమాలు ఒనగూడాలని ఆకాంక్షిస్తున్నాను.

ధన్యవాదాలు

(టాస్, 1987 డిసెంబరు 7)

# స్వాగతోత్సవ సమావేశంలో మిహాయిల్ గోర్బచేవ్ ప్రసంగం

వైట్‌హౌస్ పచ్చిక మైదానంలో యేర్పాటుచేసిన స్వాగతోత్సవ సమావేశంలో డిసెంబరు 8 న సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి మిహాయిల్ గోర్బచేవ్ చేసిన ప్రసంగమిది:

గౌరవనీయులైన అధ్యక్ష మహాశయా,
గౌరవనీయ శ్రీమతి రీగన్‌గారూ,
సోదర సోదరీమణులారా,
కామ్రేడ్స్,

అధ్యక్ష మహాశయా, మీరు యిచ్చిన హృదయపూర్వక స్వాగతానికి, దయతో పలికిన అభినందనలకు యెంతో కృతజ్ఞత.

అధ్యక్ష మహాశయా, అమెరికా, సోవియట్ ప్రజల ఆశలకు, మొత్తం ప్రపంచ ప్రజల ఆశలకు న్యాయం చేయడానికీ, సదుద్దేశంతో సమిష్టి కృషిద్వారా ఆయుధపోటీ తర్కాన్ని నిర్మూలించడానికి మన రెండుదేశాల ప్రభుత్వాలపై, మనిద్దరిపై చరిత్ర గురుతరబాధ్యతను మోపింది.

మనం చేసే యెంపికపై, యీ కిందివాటిలో దేన్ని సాధించాలనే విషయంలో మన యెంపికపై ప్రపంచ పరిణామాలు చాలావరకు ఆధారపడివుంటాయి; ప్రచ్ఛన్న యుద్ధంనుండి సంభవించిన భయాలు, అపనమ్మకాలు, తలపాటుకు దారిస్తున్న యీ భయాలు అపనమ్మకాలు, లేదా నాగరికత మనుగడకు హామీ కల్పించాలని కోరుతున్న విజ్ఞత.

సోవియట్ యూనియన్‌లోని మేము మా యెంపిక చేసుకున్నాం. మన దేశాలు మహాసముద్రాలవల్లనేగాక ప్రగాఢమైన చారిత్రక, సైద్ధాంతిక, సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక విభేదాలవల్లకూడా వేరుపడివున్నాయని మేం అవగతం చేసుకున్నాం. అయితే తలపాటుకు, శతృత్వానికి, ఆయుధపోటీకి సాకుగా ఆ విభేదాలను వినియోగించు కోకుండా వుండటమే యీనాటి రాజకీయాల విజ్ఞత.

రెండవ ప్రపంచయుద్ధంలో అమెరికా ప్రవేశం తర్వాత 46 యేళ్లకు మనం సందర్శనలను ప్రారంభిస్తున్నాం. అదే రోజుల్లో—1941లో—మాస్కో పరిసరాల్లో నాజీసైన్యాల పరాజయం ప్రారంభమైంది. అది చిహ్నప్రాయమైనది. మనం బంధువులుగా కలసి మెలసి పోరాడినయుద్ధంలో దుష్టశక్తులపై విజయంకోసం వుమ్మడి పథంలో యానానికి నాంది పలికిన రోజులవి.

మనకు గల అవకాశాలను, మన బాధ్యతలను ఆ విధంగా చరిత్ర గుర్తుచేస్తున్నది.

చరిత్రలోని కీలక దశల్లో తమ అత్యున్నత బాధ్యతను స్వీకరించడానికి మన రెండుదేశాలు సమర్ధమైనవని మనం సంతకం చేయనున్న సంధి తెలుపుతున్నది. యిది సోవియట్, అమెరికా మధ్యశ్రేణి, స్వల్పశ్రేణి మిసిలీలను నిర్మూలించేందుకు వుద్దేశించిన సంధి.

అణ్వస్త్రరహిత ప్రపంచానికి దారితీసే మార్గంలో యిది మొదటి అంజ అవుతుం దనడంలో సందేహంలేదు. అధ్యక్ష మహాశయా, యీ మార్గనిర్మాణ విషయాన్నిగురించి మీరూ నేనూ రక్యావిక్‌లో చర్చలుజరిపాం. యీ తొలిఅంజ భవిష్యత్తులోకివేసే పెద్ద అంజే. యిది మన రెండుదేశాల ప్రజలు, మొత్తం ప్రపంచప్రజలు కోరుకుంటున్న భవిష్యత్తు.

వ్యూహాత్మక స్థిరత్వానికి గట్టిహామీ ప్రాతిపదికగా వ్యూహాత్మకదాడి ఆయుధాలను సగానికి సగం తగ్గించే ఆతర్వాతి ఒప్పందం, అతిముఖ్యమైన ఆ ఒప్పందం లక్ష్యాన్ని ముందుకు తీసుకపోయే వుద్దేశంతో నేను వాషింగ్టన్‌కు వచ్చాను. సోవియట్-అమెరికా సంబంధాల్లోని యితర సమస్యలపై అత్యంత గంభీరమైన, నిర్మొహమాటమైన చర్చల కోసం మేము నిరీక్షిస్తున్నాం.

సోవియట్ విదేశాంగ విధానం యీనాడు పెరిస్త్రోయికాతో—సోవియట్ సమాజ ఆంతరంగిక పునర్వ్యవస్థీకరణతో—అత్యంత సన్నిహితంగా ముడిపడివుంది. ఆర్థిక, సామాజిక, రాజకీయ, మేధారంగాలన్నిటిలో సమూల సంస్కరణ పంథాను, అభివృద్ధి పంథాను సోవియట్ ప్రజలు సాహసంతో చేపట్టారు.

ఈ సంస్కరణల విజయానికి ప్రజాస్వామ్యీకరణ, గ్లాస్నొస్త్ నిర్ణయాత్మకమైన అవసరాలు. మేము సుదీర్ఘ పథానసాగడానికి, మేము అనుసరించిన పథాన్ని తిరుగు లేకుండా చేయడానికి కూడా అవి హామీయిస్తాయి. యిదీ మా ప్రజల సంకల్పం.

ఈ బృహత్తర పథకాలను సోవియట్ ప్రజలు అమలుజరుపుకోవాలి అంటే పుడమిపై ప్రతిచోటా శాంతి పరిరక్షణ, దాని పటిష్టీకరణ వారికెంతో అవసరం.

అధ్యక్షమహాశయా,

సోదర సోదరీమణులారా,

సోవియట్ యూనియనూ, అమెరికాలు నాజీజానికి వ్యతిరేకంగా యుద్ధంలో మిత్రులుగానేగాక, మానవాళికోసం సురక్షితమైన ప్రపంచానికి, అణుయుద్ధ సర్వనాశన భయంలేని ప్రపంచానికి బాటవేసే దేశాలుగాకూడా ఇతర దేశాలతోకలిసి కృషిచేయడం ద్వారా 20 వ శతాబ్దపు చరిత్రలో తమ స్థానాన్ని నిలబెట్టుకుంటాయని నేను ఆశిస్తున్నాను.

ఒక మహత్తర, శాంతికాముక రాజ్యానికి దీటైన రీతిలో చిత్తశుద్ధితో, బాధ్యతా భావంతో మా వంతు పాత్రను మేము నిర్వహించడానికి సిద్ధంగావున్నామని సోవియట్ ప్రజల తరపున నేను ప్రకటిస్తున్నాను.

(టాస్, 1987 డిసెంబరు 8)

# సంతకాల వుత్సవంలో గొర్బచేవ్ ప్రసంగం

వైట్ హౌస్‌లో జరిగిన ఒక వుత్సవంలో 1987 డిసెంబరు 8న రెండు తరగతుల అణ్వాయుధాలను—మధ్యశ్రేణి, స్వల్పశ్రేణి మిసిలీలను—నిర్మూలించడానికి వుద్దేశించిన సోవియట్-అమెరికా సంధిపై సంతకాలు జరిగాయి.

ఆ వుత్సవంలో పాల్గొన్నవారినుద్దేశిస్తూ సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ ప్రధాన కార్యదర్శి మిహాయిల్ గొర్బచేవ్ యిలా అన్నారు:

అధ్యక్ష మహాశయా,

సోదర సోదరీమణులారా,

కామ్రేడ్స్,

మనం యిప్పుడు వీక్షించనున్న ఘటన ప్రాముఖ్యతపై భావితరాలు సునాయాసంగా తమ తీర్పును యివ్వగలవు. అయితే మనం చేయనున్నది—అణ్వాయుధాలను నిర్మూలించే ప్రప్రథమ ఒప్పందంపై సంతకంచేయడమనేది—అటు ప్రపంచ రాజకీయాల దృక్కోణంనుండీ, యిటు మానవీయ దృక్కోణంనుండీకూడా మానవాళికి సార్వత్రిక ప్రాధాన్యతగలదని చెప్పడానికి నేను సాహసిస్తున్నాను.

ప్రతిఒక్కరికీ, ముఖ్యంగా మన రెండు మహత్తర దేశాలకూ మనం సంతకాలు చేయడానికి సిద్ధంగా వుంచిన సంధిపాఠం ఒక గొప్ప అవకాశాన్ని సమకూర్చుతోంది. అది మహోపద్రవ ప్రమాద భయంనుంచి దూరంగా తీసుకెళ్ళే మార్గంలో అడుగు పెట్టేందుకు యెట్టకేలకు లభించిన అవకాశం. దాన్ని సంపూర్ణంగా వినియోగించుకుని అణ్వస్త్రరహిత ప్రపంచం దిశలో కలసికట్టుగా సాగడం మన విధి. ఆ చర్య మన పిల్లలకు, మనుమలకు, మునిమనుమలకు అణ్వస్త్రరహిత ప్రపంచాన్ని అందిస్తుంది: భీతిలేకుండా, మారణాయుధాలపై వనరులను వున్మాదంతో వ్యర్థంచేయకుండా సంతోషమయమైన జీవితాన్ని, ఫలప్రద జీవితాన్ని వారు గడిపే అవకాశాన్ని యిస్తుంది.

ఈ మొక్కను నాటుతున్నందుకు మనం నిజంగా గర్విస్తున్నాం. అది ముమ్మందు బ్రహ్మాండమైన శాంతివృక్షంగా ఎదుగవచ్చు. అయితే మనం పరస్పరం ప్రశంసలు కురిపించుకోవల్సిన సమయం యింకా చాలా దూరంలో వుందనుకుంటా. "ఒక మంచి పనికి బహుమతి ఆ పనిని చేయడమే"అని అమెరికన్ మహాకవి, తత్వవేత్త రాల్ఫ్‌వాల్డో ఎమర్సన్ చెప్పినది సరైనదే.

మనం మనకృషికి పూనుకోవడం ద్వారా మనల్ని మనం బహూకరించుకుందాం. ముమ్మరకృషి, సంభాషణలతో తొణికిసలాడే యేడేళ్ళ సుదీర్ఘమార్గాన్ని మనం గడచి వచ్చాం.

ఈ బల్ల వేపు మరొక్క అడుగువేస్తేచాలు సంధిపై సంతకాలు జరుగుతాయి.

1987 డిసెంబరు 8 ప్రసిద్ధ ఘటనగా చరిత్రపుస్తకాలలో నమోదుకావాలి. మానవ జీవితంలోని అణుయుద్ధ ప్రమాద భరితమైన శకానికీ, నిస్సైనికీకరణ శకానికీ మధ్య స్పష్టమైన విభజనరేఖగా యీ రోజు చరిత్రలో నిలవాలి.

(టాస్, 1987 డిసెంబరు 8)

# ఐ. ఎన్. ఎఫ్ సంధిపై సంతకాలు

సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రధానకార్యదర్శి మిహాయిల్ గోర్బచేవ్, అమెరికా అధ్యక్షుడు రోనాల్డ్ రీగన్ డిసెంబరు ఎనిమిదో తేదీన మధ్యశ్రేణి, స్వల్ప శ్రేణి మిసిలీల నిర్మూలనకు సంబంధించిన సోవియట్-అమెరికా సంధి (ఐ.ఎన్.ఎఫ్)పై సంతకాలు చేశారు.

"అణుయుద్ధం మొత్తం మానవాళికి విధ్వంసనాత్మక పర్యవసానాలను తెచ్చిపెడుతుందనే యెరుకతో, వ్యూహాత్మక స్థిరత్వలక్ష్యాన్ని పటిష్టంచేసే ఉద్దేశ్యంతో, ఈసంధిలో పేర్కొన్న చర్యలు యుద్ధ ప్రమాదాన్ని తగ్గించి అంతర్జాతీయ శాంతి, భద్రతలను పటిష్టంచేస్తాయన్న దృఢవిశ్వాసంతో" ఇరుపక్షాలూ ఈ ఒప్పందం చేసుకుంటున్నాయని సంధి ఉపక్రమణిక తెలియజేస్తోంది.

సోవియట్ యూనియన్, అమెరికా, తమతమ మధ్యశ్రేణి, స్వల్పశ్రేణిమిసిలీలను ధ్వంసం చేస్తాయి, ఇకపై యిలాంటి ఆయుధాలను సమకూర్చుకోవు.

సంధిలో పేర్కొన్న షరతులను సంధి స్పష్టంగా వివరించింది. సోవియట్, అమెరికన్ పక్షాలు యేయే మధ్యశ్రేణి, స్వల్పశ్రేణి మిసిలీలను నిర్మూలించాల్సివుంటుందో నిర్దిష్టంగా పేర్కొన్నది.

మధ్యశ్రేణి మిసిలీలనూ వాటి ప్రయోగవాహకాలనూ, ఈ మిసిలీలకు దన్నుగా వుండే వ్యవస్థలను, పరికరాలను యిరుపక్షాలూ సంపూర్ణంగా నిర్మూలించాల్సివుంటుంది. ఈ ఒప్పందం అమల్లోకి వచ్చాక, మూడేళ్ళ తర్వాత యేఒక్క దేశమూ యీ తరహా అణుమిసిలీలనూ, ప్రయోగవాహకాలనూ, వీటికి దన్నుగా వుండే వ్యవస్థలనూ, పరికరాలనూ కలిగి ఉండకూడదు.

మధ్యశ్రేణి మిసిలీల నిర్మూలన రెండు దశలుగా సాగుతుంది. సంధి అమల్లోకి వచ్చాక 29 నెలలలోపే తొలిదశ ఆయుధాల నిర్మూలన పూర్తిచేయాల్సివుంటుంది. యిది అమలు జరిగాక మధ్యశ్రేణి మిసిలీలు అమర్చిన ప్రయోగవాహకాల సంఖ్య, 171 అణ్వస్త్రాలతో కూడివున్న మిసిలీలు అమర్చిన ప్రయోగవాహనాల సంఖ్యను మించివుండకూడదు. అలాగే మోహరించిఉన్న మధ్యశ్రేణి మిసిలీల సంఖ్య, 180 అణ్వస్త్రాలు ప్రయోగించే సామర్థ్యంగల మిసిలీల సంఖ్యను మించకూడదు. ఇది యిరుపక్షాలకూ వర్తిస్తుంది.

200 అణ్వస్త్రాలను ప్రయోగించగల సామర్థ్యం వున్న మిసిలీల సంఖ్యకు మించి యేఒక్క దేశమూ ప్రయోగవాహకాలను కలిగి ఉండకూడదనీ, మధ్యశ్రేణి మిసిలీల సంఖ్య—మోహరించి వున్నవీ లేనివీ అన్నీ కలిపి—200 అణ్వస్త్రాలను ప్రయోగించగలిగిన మిసిలీల సంఖ్యకు మించకూడదనీ ఈ ఒప్పందం స్పష్టంగా నిర్దేశిస్తోంది.

ఇక స్వల్పశ్రేణి మిసిలీల విషయానికొస్తే, ఒప్పందం అమల్లోకి వచ్చాక 18 మాసాల్లోపే ఈ తరహా అణుమిసిలీలను సంపూర్ణంగా నిర్మూలించాలని యీ సంధి నిర్దేశిస్తోంది. మోహరించివున్న ఈ తరహా మిసిలీలను, అవి అమర్చివున్నా, అమర్చకుండా వున్నా మొత్తం ప్రయోగవాహకాలను అన్నిటినీ రెండు పక్షాలూ 90 రోజుల లోపుగా

నిర్మూలన నదుపాయాలున్నచోటికి తరలించాలని సంధి నిర్దేశించింది. వీటి నిర్మూలనకు సంబంధించిన అధికార ఒప్పందంలో నిర్వచించిన రీతిలో వాటిని ధ్వంసం చేసేంత వరకూ ఈ మిసిలీలను, ప్రయోగవాహకాలను అక్కడే ఉంచాలి. మోహరించకుండావున్న మొత్తం స్వల్పశ్రేణి మిసిలీలను సంధి అమల్లోకివచ్చిన 12 నెలల్లోగా నిర్మూలనా నదుపాయాలున్న చోటికి తరలించాలి.

మధ్యశ్రేణి, స్వల్పశ్రేణి మిసిలీలనూ, వాటి ప్రయోగవాహకాలనూ, దన్ను వ్యవస్థలనూ, పరికరాలనూ ధ్వంసంచేయడానికి సంబంధించిన విధానాలను ఈ సంధిలో వివరంగా పేర్కొన్నారు.

సంధి అమలును పరస్పరం పర్యవేక్షించడం గురించి ప్రత్యేకంగా ఒక ప్రకరణం సంధిలోవుంది. ఆయాదేశాల్లోనూని మిసిలీ స్థావరాల్లోనూ, విదేశాల్లోని స్థావరాల్లో నయితం పర్యవేక్షణ జరిపే హక్కు యిరుపక్షాలకూ వుంది. సంధి అమల్లోకి వచ్చాక 30 రోజుల తర్వాత అన్ని మిసిలీలస్థావరాల్లోనూ, వాటికి సంబంధించిన నదుపాయాలున్న ప్రదేశాల్లోనూ పర్యవేక్షణ జరిపే హక్కు యిరుపక్షాలకూవుంది. అలాగే యిరుపక్షాల మధ్య కుదిరిన "అవగాహన పత్రం"లో పేర్కొన్న మిసిలీ నదుపాయాల వ్యవస్థలనూ, మిసిలీల వుత్పత్తికి సంబంధించిన వ్యవస్థలనూ, మిసిలీల నిర్మూలన నదుపాయాలనూ పర్యవేక్షించేందుకు రెండుదేశాలకూ హక్కువుంది. యీ పర్యవేక్షణ కార్యక్రమాలు, సంధి అమల్లోకి వచ్చాక 90 రోజుల లోపున పూర్తిచేయాలి.

సంధి అమలులోకి వచ్చిన తర్వాత 13 సంవత్సరాలలోపు యేపక్షమైనా ఒప్పందం అమలును పర్యవేక్షించవచ్చు. ఒప్పందం అమల్లోకి వచ్చాక మొదటి మూడు సంవత్సరాల కాలంలోనూ ఏడాదికి 20 సార్లు పర్యవేక్షించడానికీ, అటు తర్వాత అయిదేళ్ళ కాలంలో సంవత్సరానికి 15 సార్లు పర్యవేక్షించడానికీ, చివరి ఐదు సంవత్సరాల్లోను ఏడాదికి 10సార్లు పర్యవేక్షణజరపడానికీ యిరుపక్షాలకూ హక్కు వుంటుంది.

సంధి అమలును తనిఖీచేసే సందర్భంగా, అంతర్జాతీయ న్యాయచట్టాలు ఆమోదించిన సామాన్య సూత్రాలమేరకు, ఆయాదేశాలు సొంత సాంకేతిక సాధనాలను వినియోగించుకోవచ్చని యీ సంధి స్పష్టంగా పేర్కొంది.

సోవియట్ యూనియన్, అమెరికా దేశాలు సంధికి కట్టుబడివుండాలనీ, సంధి నిర్దేశించిన విషయాలకు విరుద్ధంగా వుండే అంతర్జాతీయ నిబద్ధతలనుగానీ, పథకాలనుగానీ యే ఒక్క పక్షమూ చేపట్టకూడదనీ యీ సంధి నొక్కి చెప్పింది. యీ సంధికి కాలపరిమితి లేదు.

ఈ సంధితోపాటుగా దీనిలో అంతర్భాగంగా వుండే అనేక అధికార పత్రాలపై కూడా మిహాయిల్ గొర్బచేవ్, రోనాల్డ్‌రీగన్ సంతకాలు చేశారు. వాటిల్లో సంధి తాలూకు ప్రాథమిక సమాచారానికి సంబంధించిన అవగాహనా పత్రం, సంధి ప్రకారం మిసిలీల వ్యవస్థల నిర్మూలనను నియంత్రించే విధానాలకు సంబంధించిన పత్రం, సంధి అమలును పర్యవేక్షించడానికి సంబంధించిన పత్రం వున్నాయి.

(టాస్, 1987 డిసెంబరు 8)

# సోవియట్ యూనియన్, అమెరికా ప్రజలకు గోర్బచేవ్ విజ్ఞప్తి

మధ్యశ్రేణి, స్వల్పశ్రేణి మిసీలీల నిర్మూలనగురించి సోవియట్ యూనియన్ అమెరికాలమధ్య కుదిరిన సంధిపై 1987 డిసెంబరు 8 న వైట్ హౌస్‌లో సంతకాలుచేసిన అనంతరం సోవియట్, అమెరికా ప్రజలకు సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి మిహాయిల్ గోర్బచేవ్ యీ విజ్ఞప్తి చేశారు:

నేను నాతోటి దేశస్థులకు, సోవియట్ యూనియన్ పౌరులకు విజ్ఞప్తి చేస్తున్నాను. అమెరికన్ ప్రజలకు విజ్ఞప్తి చేస్తున్నాను.

ఒక సంధిపై అధ్యక్షుడు రీగన్, నేనూ యిప్పుడే సంతకాలు చేశాం. మొత్తంగా రెండు రకాల అణ్వాయుధాలను అత్యంత కఠినమైన అజమాయిషీలో నిర్మూలించాలని నిర్దేశిస్తున్న సంధి యిది. యిలాంటి సంధి కుదరడం చరిత్రలో యిదే మొదటిసారి. సోవియట్, అమెరికాల మధ్యశ్రేణి, స్వల్పశ్రేణి మిసీలీల సంపూర్ణ నిర్మూలనగురించిన యీ సంధి యుద్ధాలు లేని ప్రపంచంకోసం మానవుడు అనాదిగా చెందుతున్న తపన చరిత్రలో ఒక ప్రధానమైన మైలురాయిగా వుండగలదని నేను గట్టిగా విశ్వసిస్తున్నాను.

ఈ సందర్భంగా చరిత్రనుగురించి కొద్దిసేపు ప్రస్తావించడానికి అనుమతించండి. ప్రపంచయుద్ధం వుధృతంగా జరుగుతున్న సమయంలో 1917 లో అవతరించిన సోవియట్ రిపబ్లిక్ తీసుకున్న మొట్టమొదటి చర్య శాంతి డిక్రీ. దాని రచయిత, మా రాజ్య నిర్మాత అయిన లెనిన్ యిలా అన్నారు: "న్యాయమైన, దృఢమైన ప్రాతిపదికపై శాంతికి దారితీసే యే ప్రతిపాదననైనా పరిశీలించడానికి మేము సిద్ధంగా వున్నాం." అప్పటినుండి సోవియట్ విదేశాంగ విధానానికి యిది పునాదిరాయిగా వుంది.

ఆయన మరో భావనకూడా మాకు గుర్తుంది—నిరాయుధీకరణ, ఆయుధరహిత, హింసారహిత ప్రపంచం. యిది మా ఆదర్శం. యీనాడు అణుయుద్ధ ప్రమాదం కొనసాగడం దురదృష్టకరం. అది యిప్పటికీ భయంకరంగానే వుంది. స్వయం వినాశన ప్రమాదాన్ని వదిలించుకునే శక్తి మానవునికి వుందని మా నమ్మకం. ప్రస్తుతమున్న ప్రమాద స్వభావంపట్ల, మానవాళి మనుగడనే సవాల్‌చేస్తున్న యీ ప్రమాద స్వభావం పట్ల ప్రపంచంలోగల సుదృఢమైన స్పృహ మాకు ప్రోత్సాహకరంగా వుంది.

జీవించేహక్కు మానవాళి పవిత్రహక్కు. యీ హక్కునుగురించిన చేతన ప్రపంచంలో నూతన విస్తృతిపొందుతున్నది. సర్వదా మన మనసుల్లో, ముఖ్యంగా తమ

ప్రజల ఆదేశం ప్రకారం అధికారంపొందిన రాజకీయనాయకుల, ప్రభుత్వ నాయకుల మనసుల్లో తప్పనిసరిగా యిది వుండాలి. ప్రజ అనేది అమూర్త భావనకాదు. యిది విడివిడి వ్యక్తుల సముదాయం. యిందులో ప్రతి ఒక్కరికి జీవించేహక్కు, సంతోషం పొందే హక్కువుంది.

వాషింగ్టన్‌లో యిప్పుడే సంతకాలుజరిగిన సంధి అంతర్జాతీయ పరిణామంలో ఒక ప్రధాన ఘట్టం. వాస్తవంలో అంగీకరించిన వాటికన్నా మించి దీని ప్రాధాన్యత, ప్రభావం వుంటాయి. యీ ప్రధాన ఘట్టానికి మేము చేరుకున్న మార్గం జటిలమైనది. యిందుకు సుదీర్ఘ, తీవ్రవాదనలు, చర్చలు జరిగాయి. దీర్ఘకాలంగా వున్న వుద్రేకాలను, జీర్ణించిన మూసపోతలను అధిగమించాల్సివచ్చింది. సాధించినది ఆరంభాన్నే. అది అణ్వస్త్ర విసర్జనకు ప్రారంభం మాత్రమే. సుదీర్ఘ ప్రయాణంకూడా మొదటి అంజతో ప్రారంభమౌతుందనేది మనకు తెలుసు.

ఈ మొదటిమెట్టునుండి ముందుకు సాగడానికి యివి అవసరం: మరింత ముమ్మర మేధాకృషి: చిత్తశుద్ధితోకూడిన ప్రయత్నం: యీనాడు విర్వివాదమైనవిగా భ్రమింపచేసే కొన్ని భద్రతా భావనల విసర్జన: ఆయుధపోటీకి ఆజ్యంపోసే వాటన్నిటి విసర్జన.

అణుయుద్ధంలో విజేతలంటూ యెవరూ వుండరనీ, ఆ యుద్ధం యెన్నటికీ చేయ రాదనీ 1985 నవంబరులో జెనీవాలో అధ్యక్షుడు రీగన్, నేనూ అంగీకరించాం. సోవియట్ యూనియన్‌గానీ, అమెరికాగానీ అణ్వాయుధాల్లో ఆధిక్యతను సాధించకూడదని చెప్పాం. వుమ్మడి కృషికోసం ఒక వేదిక దిశగా మేము ముందంజ వేయడానికి యిది వీలు కల్పించింది.

జెనీవా సమావేశం తర్వాత రక్యావిక్ సమావేశం జరిగింది. అణ్వస్త్ర విసర్జన క్రమానికి సంబంధించిన మా భావనలో అక్కడ మౌలికమైన ముందంజ వేశాం. యీ సంధిని సాధ్యంచేసింది, అణ్వాయుధ తలపాటుకు సంబంధించిన యితర అంశాలను తగినంతగా పరిశీలించడానికి వీలుకల్పించినదీ యీ ముందంజే.

ఇది సాధించిన గౌరవాన్ని మా అమెరికా భాగస్వాములకే మేము యిస్తున్నాం. మరిన్ని సవాళ్ళతోకూడిన సమాన, అంతర్జాతీయ భద్రతా సమస్యల పరిష్కారానికి సహాయపడే అనుభవాన్ని కలిసికట్టుగానే మన వుభయపక్షాలు సంపాదించగలవు.

ఎ. బి. ఎం సంధిని చెక్కుచెదరని స్థితిలోవుంచి వ్యూహాత్మకదాడి ఆయుధాలను మౌలికంగా తగ్గించేందుకు, రసాయనిక ఆయుధాల విర్మూలనకు, సాంప్రదాయిక ఆయుధాల తగ్గింపునకు వుద్దేశించిన ఒప్పందాలను సాధ్యమైనంత త్వరలో కుదుర్చుకోవడం అన్నిటికన్నా ముఖ్యం. వీటిలో ప్రతిఒక్క సమస్యపై సోవియట్ యూనియన్ విర్దిష్ట ప్రతిపాదనలు చేసింది. వాటిపై ఒప్పందాలు చేరువయ్యాయని మేము నమ్ముతున్నాం.

ప్రస్తుతమున్న వ్యూహాత్మక అణ్వాయుధాలన్నిటిలో దాదాపు సగంవరకు తగ్గించుకునే ఒప్పందాన్ని వచ్చే సంవత్సరం అమెరికా అధ్యక్షుని సోవియట్ పర్యటన సందర్భంగా కుదుర్చుకోగలమని మేము నమ్ముతున్నాం. యూరప్‌లో సాంప్రదాయిక దళాలను, ఆయుధాలను గణనీయంగా తగ్గించుకునే విషయంలో అంగీకారం కుదిరే అవకాశముంది. వీటి పెంపుదల, మెరుగుదల ఆందోళన కల్గించడం సహజమే.

ఇదంతా సాధించినట్లయితే సురక్షిత ప్రపంచం దిశగా పురోగమనం తిరుగు లేనిదిగా రూపొందిందని మనం విశ్వాసంతో చెప్పవీలుంటుంది. సామూహిక విధ్వంసక ఆయుధాల ధ్వంసం, అభివృద్ధికోసం నిరాయుధీకరణ—యీ సూత్రమే 20 వ శతాబ్దం ముగుస్తున్న సమయంలో మానవాళి యెదుర్కొనున్న యితర సమస్యలన్నిటికీ యేకైక సమర్థమైన పరిష్కారం. పరిసరాల సమస్యలు, నూతన సాంకేతిక విప్లవ పర్యవసానాలు, శక్తి సమస్యలు, దుర్భరదారిద్ర్యం, క్షుద్బాధ, వ్యాధులు, భారీ విదేశీరుణాలు, అనేక దేశాల, దేశాల ప్రజల వైవిధ్య పూరిత ప్రయోజనాల, అవసరాల సంతులనంలో వైఫల్యం—యివీ ఆ సమస్యలు. వీటిని పరిష్కరించడానికి ముఖ్యంగా జాతీయ భద్రతా, ప్రపంచ భద్రతా సమస్యలపట్ల తాజా వైఖరులు తప్పనిసరి.

మధ్యశ్రేణి, స్వల్పశ్రేణి మిసిలీల సంధిపై సంతకాలు జరగడంతోనే కొందరు రాజకీయవేత్తలు, ప్రాతికేయులు "ఎవరు గెలిచారు" అని వూహాగానాలు చేస్తున్నారు. యీ వైఖరిని నేను తిరస్కరిస్తున్నాను. ఇది పూర్తిగా పాత ఆలోచనా పద్ధతిని పట్టుకు వేళ్ళాడడం. ఇంగితజ్ఞానం గెలిచింది. విచక్షణాజ్ఞానం గెలిచింది. అంతే. మహత్తర విజయం యింకా సాధించాల్సివుందన్న మాట వాస్తవమే. కాని రాజకీయంగా, మానసికంగా యిది చాలా ముఖ్యమైనది. యిది ప్రపంచమంతటాగల వందల మిలియన్ల ప్రజల మనోభావాలకు అనుగుణమైనది.

అణుమహోపద్రవ ప్రమాదం తొలగిపోవాలని ప్రపంచంలో వుండాలని ప్రజలు కోరుకుంటున్నారు. అమెరికా, సోవియట్ రోదసి నౌకలు "నక్షత్ర యుద్ధాల"కోసంకాక సంయుక్త అంతరిక్ష యాత్రలకోసం, ఒకదాని దరికి మరొకటిచేరి అనుసంధానం కావాలని ప్రజలు కోరుకుంటున్నారు. తమకు వ్యతిరేకంగానే ప్రయోగించవీలున్న ఆయుధాలకోసం రోజుకు మిలియన్ల డాలర్లు ఖర్చు చేయాల్సిన అవసరంలేని ప్రపంచంలో వుండాలని ప్రజలు కోరుకుంటున్నారు. జీవించేహక్కు, స్వేచ్ఛహక్కు, సంతోషాన్నిపొందే హక్కు—అభివృద్ధిచెందిన యే సమాజమైనా ఒడిదుడుకులు లేకుండా సాగాలంటే ఆచరణలో హామీ వుండితీరాల్సిన యితర మానవహక్కుల విషయం వేరే చెప్పాల్సిన పనిలేదు—ప్రతిఒక్కరు అనుభవించగలిగే ప్రపంచం ఏర్పడాలనీ, యితరులపై పేదరికాన్ని, యిబ్బందులను నెట్టి కొద్దిమంది సౌభాగ్యాలతో తులతూగని ప్రపంచం ఏర్పడాలనీ ప్రజలు కోరుకుంటున్నారు. సైనిక భద్రతనేగాక ఆర్థిక భద్రతనుకూడా ప్రజలు కోరుకుంటున్నారు.

ప్రజాస్వామ్యం, స్వేచ్ఛ, అందరి సమానత, బయటిజోక్యం లేకుండా ప్రతిఒక్క దేశం తన సొంత సామాజిక ఎంపికను చేసుకునే హక్కుగల ప్రపంచం ఏర్పడాలని ప్రజలు కోరుకుంటున్నారు. ఒకరి గురించిన వాస్తవాన్ని మరొకరు తెలుసుకోవాలని, తుదకు జాతుల, నరబృందాల, భాషల, సంస్కృతుల మహత్తర సార్వజనీన బాంధవ్య అనుభూతిని పొందాలని ప్రజలు కోరుకుంటున్నారు. అలాంటి ప్రపంచాన్ని సృష్టించగలమా? అవునని సోవియట్ యూనియన్‌లోని మా దృఢవిశ్వాసం.

అవును, యిది సాధ్యమే: అయితే అంతర్జాతీయ సంబంధాలను సమూలంగా పునర్నిర్మించాలి. అలాంటి ప్రపంచం దిశగా సాగాలంటే సృజనాత్మకసాహసం, నూతన ఆలోచన, యితరదేశాలను సక్రమంగా అంచనావేయడం, వాటి ప్రయోజనాలపట్ల గౌరవ భావం అలాగే తమ ఆర్థిక శక్తి స్తోమతలను, ప్రయోజనాలను అంచనా వేసుకోవడం అవసరం. సాధించినదాన్ని అంచనావేసే క్రమాన్ని, నూతన కార్యాచరణ పథకాన్ని అభివృద్ధిచేసే క్రమాన్ని సోవియట్ యూనియన్‌లోని మేము ప్రారంభించాం. దాన్ని అమలు పెడుతున్నాం. దీన్నే మేము పెరిస్త్రోయికా అంటున్నాం,

దీన్ని మేము యేమాత్రం సంకోచించకుండా చేపట్టాం. మనకాలావసరం యిదేనని గుర్తించి అలాచేశాం. మా సమాజస్థాయిని పెంచడానికి, దాని అభివృద్ధిని త్వరిత పర్చడానికి, దాన్ని మరింత ప్రజాస్వామ్యీకరించడానికి, గోప్యతలేనిదిగా చేయడానికి, దాని శక్తి స్తోమతలన్నిటినీ వినియోగించుకోడానికి మా ప్రజల జీవితాన్ని పాదార్థికంగా, ఆత్మికంగా మెరుగుపర్చడానికి పెరిస్త్రోయికాను చేపట్టాం. మా దేశ భవిష్యత్తుపట్ల మా విశ్వాసం, భద్రమైన, నాగరికమైన ప్రపంచాన్ని నిర్మించవచ్చనే మా దృఢనిశ్చయం— యివి అంగాంగికంగా పరస్పర సంబంధంగలవి. అంతర్జాతీయ వ్యవహారాల్లో బాధ్యతా భావంతో, గంభీరభావంతో మేము వ్యవహరిస్తున్నామనీ. అలాగే వ్యవహరించగలమనీ సోవియట్ నాయకత్వం తరపున, యావన్మంది ప్రజల తరపున నేను ప్రకటిస్తున్నాను. మా ప్రయోజనాలేమిటో మాకుతెలుసు; అయితే యితరుల ప్రయోజనాలకోసం మేము వాటిని సర్దుబాటుజేసుకో ప్రయత్నిస్తాం. సమానులంగా మా వంతు దూరం మేము గడిచివచ్చి కలుసుకుకోడానికి సిద్ధంగావున్నాం.

అధ్యక్షులూ, నేనూ మూడురోజులపాటు చేయాల్సిన ముమ్మర, ముఖ్యకృషి వుంది. మా చర్చలు యిప్పటికే ప్రారంభమయ్యాయి. ఫలితాలు, గణనీయమైన ఫలితాలు లభ్యంకావడానికి మా వంతు కృషి మేము చేస్తాం.

ధన్యవాదాలు.

(టాస్, 1987 డిసెంబరు 8)

# అమెరికన్ పౌర ప్రతినిధులతో మిహయీల్ గొర్బచేవ్ సమావేశం

వాషింగ్టన్‌లోని సోవియట్ రాయబార కార్యాలయంలో 1987 డిసెంబరు 8వ అమెరికన్ పౌర ప్రతినిధులను మిహయీల్ గొర్బచేవ్ కలుసుకున్నారు. వారిలో ప్రముఖ రాజకీయవేత్తలూ, వ్యాపారులూ, సాంస్కృతిక, కళారంగాలకు చెందిన వారూ వున్నారు.

వారి నుద్దేశించి మిహయీల్ గొర్బచేవ్ యీ ప్రసంగం చేశారు.

"ఈ సమావేశంలో పాల్గొనడం నాకు యెంతో ఆనందదాయకంగా వుంది. యీ మందిరంలోవున్న మీ అందరికీ హృదయ పూర్వక స్వాగతం. యీ సమావేశంలో పాల్గొన్నవారు తమకు యెంతపని వున్నప్పటికీ, మా ఆహ్వానాన్ని పురస్కరించుకుని, కొంతసేపు తమ వ్యాపారాన్ని, పనులను, పక్కనబెట్టి వచ్చారు. దీన్ని నేను యెంతో విలువైన విషయంగా భావిస్తున్నాను.

"మనం పరస్పరం ఒకరివైపు మరొకరం ఏమాత్రం ముందుకు కదిలినా అది ఎంతో విలువైనదే అవుతుంది. మీరు అంతటి స్ఫూర్తితో ముందుకు వచ్చినందుకు ధన్యవాదాలు.

"అమెరికన్లనుండి 80,000 లేఖలు అందాయని ఎన్.బి.సికి ఇచ్చిన యింటర్వ్యూలో పేర్కొన్నాను. యీ రాయబార కార్యాలయానికి అందిన లేఖలువేరేవున్నాయి. ఇంకా చెప్పాలంటే మాతోటి దేశస్థులనుండి నెలకు సుమారు 70,000 లేఖలు, అప్పుడప్పుడు 120,000 లేఖలు అందుతాయి. యీ విధంగా నాకు యెంతో టపా వస్తుంది.

"ఎమిలీ హాల్డర్స్ (17) అనే బాలిక రాసినదిదీ: 'మా అమెరికన్లకు రష్యన్లపై నమ్మకంలేదు. చాలామంది రష్యన్లకు అమెరికన్లపై విశ్వాసంలేదు. మేము రష్యన్లను నమ్మకపోవడానికి అనేక కారణాలున్నాయి. అలాగే మమ్మల్ని నమ్మకపోవడానికి రష్యన్లకు అనేక కారణాలు, హేతువులు వున్నాయి. దీనంతటిలో యేదో లోపం వుంది. ఏదో కొరవడిందని నేననుకొంటున్నాను.'

"కేవలం 17 యేళ్ళున్న ఒక వ్యక్తి నా ముందుంచిన ప్రశ్న యిది. ఆ లేఖలో యింకా యిలా వుంది: 'మన మనుగడపట్ల వుమ్మడి బాధ్యతాభావం మనకు వుండితీరాలి. అందువల్ల మనందరి జీవితాలు దానిపైనే ఆధారపడి వున్నాయీ అనే భావంతో ఒక బాధ్యతాయుత ప్రపంచాన్ని నిర్మించేందుకు మనం ప్రయత్నించితీరాలి. ఒకే మానవకుటుంబానికిచెందిన మనం ఒక మానవాళిగా సహకరించుకోకపోవడం నేర్చుకోకపోతే, మనం సృష్టింతుకున్నదాన్నే మనం నాశనంచేసుకుంటామనేది ఖాయం. మనం సహకరించుకోవడం నేర్చు

కుంటే యెంతటి అద్భుతమైన భవిష్యత్తు ఆవిష్కృతమౌతుందో, యెంతటి అవకాశాలు ఆవిష్కృతమౌతున్నాయో కాస్తఆలోచించండి.'

"చూడండి, అభివృద్ధిలోకి వస్తున్న ఒక యువ తత్వవేత్త యెంత వుత్తమమైన ఆశా భావంతో మాట్లాడుతున్నదో. అందువల్ల మన స్థానంలో యువజనుల తరమొకటి మంచిదే వస్తుందని నేననుకుంటున్నాను.

"మరో లేఖ నన్నూ, అధ్యక్షులు రీగన్‌నూ వుద్దేశించి రాసినది. అందులో యీ ప్రశ్నను లేవనెత్తడం జరిగింది: 'అధ్యక్ష మహాశయా, ప్రధాన కార్యదర్శిగారూ, మీ జీవితాలను మీరు గడుపుకున్నారు. మీరునమా వేశమౌతున్నారు. ప్రాణికోటి జీవితాలు, మానవ జీవితాలకు సంబంధించిన సమస్యలను మీరు చర్చించనున్నారు. దయచేసి మేముకూడా జీవించేటట్లూ, భావితరాలను కూడా పరిరక్షించుకొనేటట్లూ చూడండి.'

"యేదో గంభీరమైన పరిస్థితి సమీపిస్తున్నట్టు యిప్పుడు నాకు అనుభూతమౌతున్నది, యేదో అత్యంత ప్రగాఢమైనది, అమెరికాలోని, సోవియట్ యూనియన్‌లోని విస్తృత ప్రజావర్గాలకు పరివ్యాప్తమైనదేదో సమీపిస్తున్నట్టు కనిపిస్తున్నది—మన సంబంధాలను, మన ప్రజల మధ్యసంబంధాలను, మన దేశాల మధ్య సంబంధాలను యిప్పుడున్న స్థితిలోనే వదిలివేయరాదనే యెరుక అది.

"మానవుల మస్తిష్కాల్లో యెప్పుడు యీ విధమైన కదలిక యేర్పడినా అది మేధావులతో ప్రారంభమౌతుంది—అంటే మేధావుల మనసుల్లో చిగురిస్తుందని నా అభిప్రాయం. చెప్పాలంటే వారు సమాజానికి వుత్ప్రేరకాలు; సమాజంలో నూతన క్రమాలను పురికొల్పేది వారే.

"అదేసమయంలో నాకునేనే ఒక ప్రశ్న వేసుకుంటున్నాను. మీకుకూడా అదే ప్రశ్న వేస్తున్నాను: మనం ప్రజలకన్నా వెనుకబడి పోవడంలేదా? రాజకీయవర్గాల, మేధావి వర్గాల ప్రతినిధులమైన మనం ప్రజలు యిప్పటికే గ్రహించినంత కూడా గ్రహించలేకపోతున్నాముకామా?

"మన ప్రజల మనోభావాలు, స్పందనల కన్నా మనం వెనుకబడిలేమా అనేవిషయాన్ని మనం ఆలోచించితీరాలి. ఎందుకంటే మన రెండు దేశాలు, మన రెండు దేశాల ప్రజలు సన్నిహితంగావడాన్ని యీ మనోభావాలు కాంక్షిస్తున్నాయన్నది నిస్సందేహం.

"అకడమీషియన్ వెలిఖోవ్ చొరవ తీసుకుని వేసవి సెలవుల్లో స్కూలు పిల్లల బృందాల పరస్పర పర్యటనలను నిర్వహించారు. అమెరికన్ పిల్లల బృందమొకటి సోవియట్ యూనియన్‌కు వచ్చింది. వాళ్ళు మాస్కో సమీపంలో పెరెస్లావ్ల్-జలెస్కికిలో వున్నారు. వారు కొన్ని అద్భుతమైన లేఖలు రాశారు, వాటిని ఉపచేయించారు.

"అమెరికాకు వెళ్ళిన తర్వాత వారు ఒక పత్రికనుప్రచురించారు. 'రష్యన్లు వస్తున్నారు' అనే వుపశీర్షిక అందులోవుంది. ఎలాంటి రష్యన్ 'దండయాత్ర' గురించి చెపుతున్నారో దాని వివరణయిచ్చారు. దాని పర్యవసానాలెమిటో చెప్పారు.

"ఇది నిజంగా నన్ను కదిలించింది. మన పిల్లలు, 12, 13, 14 యేళ్లపిల్లలు, అందులో మహా అయితే కొందరు 17 యేళ్ళ పిల్లలు

తాము యేదోచేయాల్సివుందని యెంత ప్రగాఢంగా, యెంతలోతుగా అవగాహన చేసుకున్నారో చూడండి. వారు నిజంగా మనపై యెంతో భారీ బాధ్యతలను వుంచారు.

"చరిత్రలో మనం ఒక కీలకదశను చేరుకున్నామని నేననుకుంటున్నాను. ముఖ్యంగా రాజకీయ వేత్తలమైన మనం ప్రత్యేక బాధ్యతను నిర్వహించాల్సివుంది. మన రెండు దేశాలమధ్య సయోధ్య యేర్పడాలన్న, రెండు దేశాల సంబంధాలు మెరుగుపడాలన్న మన ప్రజల మనోభావాలను పూర్తిగా కార్యరూపంలో అమలుచేయాల్సిన బాధ్యత అది.

"మాస్కోలో జరిగిన సమావేశంలో వేన్స్, డాక్టర్ కిసింజర్, శ్రీమతి కిర్క్ పాట్రిక్, పీటర్సన్, తదితరులతో సహా ప్రసిద్ధవ్యక్తులు గల అమెరికన్ బృందాన్ని నేను కలసుకున్నాను. రాజకీయ వేత్తల, శాస్త్రజ్ఞుల, కళాకారుల కృషి కలబోయకుండా యీ రోజుల్లో ఒక వాస్తవిక విధానాన్ని వమ్మదగ్గ విధంగా నిర్మించ సాధ్యంకాదని అప్పుడు మేము అనుకున్నాం.

"ఎంతోమంది మాజీ మంత్రులు, రాయబారులు యిక్కడ వున్న విషయం మీకు తెలుసు. ఇతర ప్రజల ప్రయోజనాలను పట్టించుకుంటేనే, ప్రయోజనాల సమతూకం వుంటేనే యెవరైనా తమ ప్రయోజనాలను కాపాడుకోగలరని, యెంతో ప్రయోజనకరంగా కాపాడుకోగలరని ఆ తర్వాత మాత్రమే వారు నేర్చుకున్నారు.

"సోవియట్ యూనియన్‌కు దాని ప్రయోజనాలు దానికున్నాయి; అమెరికాకు దాని ప్రయోజనాలు దానికున్నాయి. అలాగే భారత దేశానికి లేదా కంపూచియాకు లేదా బంగ్లాదేశ్‌కు వాటి ప్రయోజనాలు వాటికి వుండవని యెవరంటారు....వాటి ప్రయోజనాలు వాటికి వున్నాయి. నూతన సంబంధాలను నిర్మించడానికి కచ్చితంగా యీ అవగాహన ప్రాతిపదికగా వుండాలి. ఇదెంతో ముఖ్యమని అనుకుంటున్నాను.

"నూతన వాస్తవికతలు వున్నాయనీ, అవి తమ నూతన ఆవశ్యకతలను నిర్దేశిస్తున్నాయనీ నా అభిప్రాయం. వాటిని మనం యీ కాలపు సవాళ్లు అని చెప్పవచ్చు.

"మనమంతా మనకాలపు బిడ్డలం. అది మన సంపద, మనఖజానా. అయితే ఆ సంపదను మనం సక్రమంగా వినియోగించుకోవాలి. దాన్ని దుమ్ముచుట్టి పారెయ్యకూడదు. మనం యింతకు ముందు యెలా వ్యవహరించాం, యేపరిస్థితుల్లో అలావ్యవహరించాం, గతంలో ప్రపంచం యెలా వుండిందీ,10, 20 లేదా 30 యేళ్ల క్రితంగానే యీనాటి ప్రపంచంలోకూడా వ్యవహరించ గలుగుతామా అనే విషయాలు విశ్లేషించుకోవాలి, గుణపాఠాలు తీసుకోవాలి. అప్పుడే మనకది సంపద అవుతుంది.

"ఇక్కడ నేను అనేక సిద్ధాంతాలను బలపర్చేవారిని చూస్తున్నాను. 'యుద్ధకూటపు టంచున గడసాము చేయడం', 'నిరోధించడం' 'వెనక్కి చుట్టివేయడం' వంటి అనేక ప్రతిపాదిత సిద్ధాంతాల సమర్థకులున్నారు.... అయితే యిదంతా గతానికి సంబంధించిన విషయమైపోయింది. మేమూ, అమెరికాలో వున్న మీరూ దీన్ని అర్థంచేసుకోవాలి. యీ విషయాన్ని ఆకళింపుచేసుకోవాలి. లేకుంటే ప్రపంచం మరో మార్గానికి మారడం, నూతన

మార్గాన్ని చేపట్టి. అంతర్జాతీయ సంబంధాలను, సహకారాన్ని మెరుగుపర్చే మార్గానికి మారడం చాలా కష్టమౌతుంది.

"మన చుట్టూవున్న వారందరికీ దీని అవసరం యెంతలా అనుభూతమౌతున్నదీ మీకు తెలుసు. మన తలుపులను, సోవియట్ తలుపులను, అమెరికా తలుపులను తట్టుతున్న అవసరాలివి. వాటిని మనం పెడచెవిన పెట్టకూడదు.

"నూతన వాస్తవికతలు అలా వున్నాయి. వాటిని మనం గ్రహించినట్టు కనిపిస్తున్నది; అయితే ప్రతివిషయాన్ని యిప్పటికే క్షుణ్ణంగా అర్థంచేసుకోలేదేమో. కానీ మనం వాటిని తెలుసుకోడానికి, మన విశ్లేషణకు, యీనాటి ప్రపంచదృక్పథానికి ఆ గ్రాహ్యతను ప్రాతిపదికగా చేసుకోడానికి కృషిచేశాం. మనం గతంలో ఒకే ఒక్క వాస్తవాన్ని, మనం వేరుఅనే వాస్తవాన్ని మాత్రమే నొక్కిచెప్పాం; దాన్ని యీనాడూ చెపుతున్నాం. యీ విషయం మనం అవగాహన చేసుకోవాలి, అంతేతప్ప దాన్ని అతిగా నాటకీయం చేయరాదు. అయితే యీ రోజున మనం నొక్కిచెప్పాల్సిన విషయం ఒకటుంది: మనమంతా ఒకే నాగరికతలో భాగంగా వున్నాం: మనం పరస్పరం పెనవేసుకుని వున్నాం— అది విజ్ఞానశాస్త్రం, సాంకేతిజ్ఞతల ద్వారా, పరిసరాల ద్వారా, నానాటికీ పెరుగుతున్న సవాళ్ళ ద్వారా. మనం ఆలోచనల్లో, ఆచరణల్లో ఐక్యంగా వుండాలని యీ సవాళ్ళు నిర్దేశిస్తున్నాయి. యీ గ్రాహ్యతను దేశదేశాల ప్రజలకు సమకూర్చడం మేధావుల విధికాదా? అలా చేయడం మేధావులందరి విధి అని నేననుకుంటున్నాను. ప్రతిదేశ ఆంతరంగిక, విదేశీ విధానాల వికసీకరణలో శాస్త్రీయదృష్టికి సంబంధించిన అంశం ఒకటి వుండడం, శాస్త్రరంగాల్లో వున్నవారు రాజకీయాలకు తమ నైతిక దోహదం చేయడం అభిలషణీయమని యీ రోజు అధ్యక్షునికి చెప్పాను. మనం యెంతో నష్టపోయాం. రాజకీయాలు తరచు నీతిబాహ్యంగా వుండడమే యిందుకు కారణం. వీటిని పరిహరించడానికి మనం పరస్పర పర్యటనల ఆచరణనేగాక సహకారాన్నికూడా నెరపుకోవాలి: సార్వత్రిక మానవ విలువల దృక్కోణం నుండి పరిస్థితిని కలిసి కట్టుగా తెలుసుకోడానికి సమావేశాలు జరుపుకోవాలి. మనం విభిన్నంగా వున్నంతమాత్రాన కలవెలబడిపోవాల్సిన కారణాలేమీ కనబడడంలేదు. ఒక కుటుంబాన్నే తీసుకోండి, అందులో భిన్న రకాల మనుషులు కలిసిజీవిస్తారు. అంతర్జాతీయ కుటుంబాన్ని తీసుకోండి, అందులోని వారంతా ఒకే విధంగా వుంటారా? మనమంతా భిన్నమైనవాళ్ళం, కాని, మనమంతా ఒకే ఒక నాగరికతకు చెందిన వాళ్ళం. ప్రతి ఒక్కటీ అంతస్సంబంధం గలదై వుంటుంది. మనం భిన్నంగా వున్నప్పటికీ మనం ఒకే ఒక ప్రపంచంలో నివసిస్తున్నాం. సోవియట్ యూనియన్ అమెరికాలకు చెందిన మనం చేయగలిగే మేధాదోహదమేమిటో మనమంతా ఆలోచిద్దాం. ముఖ్యంగా నూతన వాస్తవికతలను అవగాహనచేసుకునే దృక్కోణంనుండి చేయగల దోహదమేమిటో, సంబంధాలను, ముఖ్యంగా మన వుభయదేశాల సంబంధాలను పునర్ నిర్మించుకోడానికి యెలా దోహదం చేయగలమో ఆలోచిద్దాం.

"ఈ సందర్భంగా యీనాటి పరిస్థితి గురించి చిత్తశుద్ధితో నా అభిప్రాయాన్ని తెలియజేయ దలుస్తున్నాను. మనం యెక్కడున్నామో, మన వుమ్మడి బాధ్యత యేమిటో నా ఆలోచనలను వెల్లడించదలచుకున్నాను.

"మధ్యశ్రేణి, స్వల్పశ్రేణి మిసిలీల గురించిన సంధిని రూపొందిస్తున్న క్రమంలో పొడసూపిన పరస్పర అవగాహనా అంశాల పట్ల, సహకారాంశాలపట్ల శాత్రవ వైఖరి నవలంబిస్తూన్నవారిని నే నర్థం చేసుకోలేక పోతున్నాను. ఒక మానవునిగా నేను వారిని అర్థం చేసుకోలేకపోతున్నాను. అయితే యిది ప్రయోజనాలకు సంబంధించిందని దీన్ని వివరించవచ్చు. ప్రతి ఒక్కటీ ప్రయోజనాల దృష్టితోనే వివరించవచ్చు. కాని, విభిన్న ప్రయోజనాలుకూడా వున్నాయికదా. ప్రజా బాహుళ్యాల ప్రయోజనాలున్నాయి;అమెరికా, సోవియట్ ప్రజల ప్రయోజనాలు యిందులో భాగం. యివి పరమోన్నత ప్రయోజనాలు. కచ్చితంగా యీ ప్రయోజనాలను వ్యక్తం చేయడమే రాజకీయవేత్తల కర్తవ్యం. అంతే తప్ప యేదో ఒక సమాజంలోని కొన్ని బృందాల, పౌరల సంకుచిత, స్వార్థపర ప్రయోజనాలను కాదు వ్యక్తంచేయాల్సింది.

"మేము చెబుతున్నదే పరమసత్యమని బల్లగుద్దిచెప్పడంలేదు. అందుకు మాదోహదం చేయడానికి సిద్ధంగా వున్నాం. ప్రపంచాన్ని అర్థం చేసుకోడానికీ, నూతన సంబంధాలను నిర్మించుకోడానికి సంబంధించిన క్రమంలో చేరిపోయేందుకు తగిన మేధా వనరులు మాకున్నాయి. యీ విషయంలో మన రెండు దేశాలకూ అపార అవకాశాలున్నాయని విశ్వసిస్తున్నాను.

"ఇక నేను చెప్పదలచుకున్న రెండవ విషయం. కేవలం మీ సమాచారంకోసమే యీ విషయం చెబుతున్నాను. అది సోవియట్ యూనియన్‌లోని ప్రస్తుత పునర్నిర్మాణ దశ.

"మేము పెరిస్త్రోయికాను మా అవసరం కొద్దీ చేపట్టాం. యింతకుముందులాగా వుండటం యేమాత్రం మాకు వీలుకాదు. ఆర్థికంగా మేము స్తబ్దతలో పడి లేస్తూనే ముందుకుసాగి వుండేవారమే. అలా జరిగినప్పటికీ కొంత పెరుగుదల వుండివుండేది. జాతీయాదాయాన్ని రెండు లేదా మూడు శాతం పెంచగలిగి వుండేవారం. అయితే అసలు విషయం యిదికాదు. మా మొత్తం సమాజాన్ని తాజా దృక్పథంతో పరిశీలించడానికి ప్రయత్నించాం. మేము యీ ప్రధాన నిర్ణయానికి వచ్చాం: మానవాంశరీత్యా, ప్రణాళికాబద్ధ ఆర్థికవ్యవస్థ ద్వారా నిర్వహణరీత్యా సోషలిస్టు వ్యవస్థ శక్తిసామర్థ్యాలను సంపూర్ణంగా వినియోగించుకోవడంలేదు. అందువల్ల సమాజాన్ని అర్థం చేసుకోవడానికి, మేము యెలాంటి సమాజంలో నివసిస్తున్నామో తెలుసుకోడానికి మేము దాన్ని పరిశీలించాం. యిందుకోసం మాకు గ్లాస్‌నోస్త్, ప్రజాస్వామ్యీకరణ అవసరమైంది. యివి సంక్లిష్టమైన, అత్యంత క్లిష్ణమైన క్రమాలు అనేది నిజమే. మా సమాజాన్ని ఛిన్నాభిన్నంగా కుదిపివేయడం వాటి లక్ష్యంకాదు. మేము వాస్తవంలో దాన్ని ప్రగాఢంగా అవగాహన చేసుకోదలిచాం. వస్తుగత విశ్లేషణ ప్రాతిపదికపై ఒక భావనను రూపొందించుకోదలిచాం. తద్వారా యెంతో సంక్లిష్టమైన యీ కాలంగుండా మెలకువతో సాగదలిచాం.

మేము ప్రారంభించినది యిదే. యీ అన్వేషణ సులభమైనదేమీ కాదు. మా చారిత్రక గతాన్ని అంచనావేయడం అన్ని సందర్భాల్లో సులభమేమీకాదు. యిందుకు మేం వాస్తవాన్ని వున్నదున్నట్టుగా నిర్మొహమాటంగా చెప్పాల్సివుంటుంది.

"మేం అన్ని విషయాలు చెప్పడం యింకా జరగలేదు. అన్నిటినీ యింకా సిద్ధం చర్చలేదు. కాని ఒక విషయం తాలూకు అంతును మేము తెలుసుకున్నాం. అది అత్యంత ముఖ్యవిషయం. అది పెరిస్త్రోయికా విధానానికి పునాదిగా రూపొందింది. మేము నివసిస్తున్న సమాజం గురించి ఒక అభిప్రాయాన్ని గత రెండున్నరయేళ్ళగా మేము రూపొందించుకున్నాం. భవిష్యత్తుపై, మేము చేపట్టాల్సిన మార్గంపై దృష్టిని సారించడానికి ప్రయత్నించాం. నిక్కచ్చిగా యీ మార్గాలమీదే సాగుతున్నాం. ఈ క్రమం యేమాత్రం సరళమైనదికాదు. ఇక్కడ దాచాల్సినదేమీలేదు. నొవెమిర్ పత్రిక సంపాదకుడు కామ్రేడ్ జలీగిన్ యిక్కడే వున్నారు. తన పత్రిక కృషిని ఆధారంగా చేసుకుని మా సమాజం తాలూకు అన్ని రంగాల్లో—రాజకీయ, ఆర్థిక, ఆత్మిక, నైతిక, సామాజిక రంగాల్లో—మనోభావాలు యెంత వుధృతంగా వున్నాయో ఆయన చెప్పగలరు. ఎంచుకున్న పథాననే మేము సాగుతాం. మరో ప్రత్యామ్నాయమేదీలేదు. ఏమైనా వుంటే అది స్తబ్దత, కదలకుండా కదం తొక్కడం తప్ప మరొకటిలేదు. ఇందుకు మా ప్రజలు యేమాత్రం అంగీకరించరు. కాగా యీ మార్గంలో ముందుకుసాగుతూ యథాతథవాదులకు వాళ్ళ స్థానమేదో వాళ్ళకు చూపుతాం; అదే సమయంలో దశలను, లంఘనలద్వారా దాటవేయకుండానిరోధిస్తాం. దుస్సాహసికతను నిరోధిస్తాం. గత యేడాదిన్నర, రెండేళ్ళకాలంలో యెన్నో సమావేశాలు జరిగాయి. అవి అవసరమైనాయి. ఎందుకంటే విప్లవాలు సదా యీ విధంగానే ప్రారంభమౌతాయి. మొత్తం సమాజం కదలికలోకి వచ్చింది. ఈనాడు పెరిస్త్రోయికా రెండవదశలో ప్రత్యేకించి, గంభీరమైన, ప్రగాఢమైన, బాధ్యతాయుతమైన కృషి అవసరం నానాటికీ పెరుగుతోంది. జీవితంతో యీ భావనను అనుసంధించడం ప్రారంభించనపుడు మిలియన్లాది ప్రజలు దీనికి లోనౌతారు. రానున్న రెండు మూడు సంవత్సరాలు అత్యంత కష్టభూయిష్టంగా వుంటాయి. ప్రతీదిమారాల్సివుంది—రాజకీయ సంస్థలు, ఆర్థిక పరిస్థితి. ఈ కృషికి మేము తూగలేమనీ, యెందుకంటే మేము దాన్ని మా సోషలిస్టు విలువల ప్రాతిపదికపై పరిష్కరించడానికి ప్రయత్నిస్తామనీ మీలోకొందరు యిప్పటికే లేఖలు రాశారు. వేచిచూద్దాం. ఈ కృషికి మేము తూగగలమని నా నిశ్చితాభిప్రాయం. తత్సంబంధమైన యంత్రాంగంతో, నూతన ఆర్థిక యంత్రాంగాలతో, మెరుగైన కేంద్రీకృత పద్ధతితో, మేనేజర్ల యెన్నికల పద్ధతితో ప్రజల ప్రయోజనాలనూ, విడివిడి వ్యక్తుల ప్రయోజనాలనూ మేము అనుసంధిస్తాం.

"వుత్పత్తి ఖర్చుల మదింపు ప్రాతిపదికపై యెప్పుడైతే ఒక వ్యక్తి పనికి చెల్లించే ప్రతిఫలం అతని ఆర్థిక నిర్వహణ ఫలితాలపై

ఆధారపడివుంటుందో అప్పుడు అతను తన పరిశ్రమాది సంస్థ సారథిగా సోమరి, అసమర్థుడైన మేనేజర్ వుండడం సహించబోడు. అన్నీ బాగా తెలిసిన తెలివైన మేనేజర్, పనిని చక్కగా చేయగల, రేపటి పరిస్థితిని దర్శించగల మేనేజరు యిప్పుడు అతనికి అవసరం. అందువల్లనే యెన్నికలు అవసరమైనాయి. అందువల్లనే మేము ఆర్థికవ్యవస్థ స్థాయికి ప్రజాస్వామ్యీకరణను పరివ్యాప్తం చేస్తున్నాం. యిక ప్రణాళికాబద్ధ ఆర్థికవ్యవస్థకు సంబంధించి నిర్మాణస్వరూప మార్పులను యెక్కువ నొప్పి కలగకుండా అమలు జరపడానికి యిది మాకు అవకాశమిస్తుంది. మా వ్యవస్థ శక్తి స్తోమతల్లో 50 శాతంకూడా మేము వినియోగించుకోవడం లేదనుకుంటున్నాను. సోషలిజమంటే యేమిటో, అది నిజంగా యివ్వగలిగినదేమిటో యిప్పుడే మేము అవగాహన చేసుకుంటున్నాం. మేము తిరిగి లెనిన్‌ను సంప్రతిస్తున్నాం. దేశ భవిష్యత్తుగురించి ఆయన తన చివరి సంవత్సరాల్లో యెంతో ఆలోచించారు. ఒక వ్యవస్థగా సోషలిజం వికసించకుండా అవరోధించేదేదో జరుగుతోందని ఆయన పసిగట్టారు. ఆయన ఆలోచనలను అర్థం చేసుకోడానికి మేం ప్రయత్నిస్తున్నాం. అయితే ఆయన ఆలోచనలను యాంత్రికంగా యీనాటి జీవితానికి వర్తింపజేయడానికి మేం ప్రయత్నించడం లేదని వేరే చెప్పనక్కర్లేదు: ఆయన కాలంతో పోలిస్తే సమాజమూ, దేశమూ, ప్రజలూ యెంతో మారిపోయారు. సోషలిజం శక్తిస్తోమతలను, దాని ఆర్థిక, ప్రజాస్వామ్య శక్తిస్తోమతలను, దాని రాజకీయ, ఆత్మిక, నైతిక శక్తిస్తోమతలను వెలికి తీసేందుకు మేం బ్రహ్మాండమైన కృషి చేస్తున్నాం.

"మరోవిషయం గుర్తుంచుకోవాలి. జనాభాలో 90 శాతం మంది విప్లవం తర్వాత పుట్టినవారే. వారికి మరో ప్రభుత్వం, మరో వ్యవస్థ అంటే యేమిటో తెలియదు. మేము గ్రహించిన మేరకు యీ వ్యవస్థ మూలాధారాల, విలువల ప్రాతిపదికపై మా సమాజాన్ని మేము పునర్నిర్మిస్తాం. ఇది మాకు సంబంధించిన విషయం. ఇది అమెరికన్లకు యెందుకు ఆందోళన కల్గిస్తున్నాదో నాకు అర్థం కావడం లేదు. దేశంలోని ఆంతరంగిక క్రమాల గురించిన మా నూతన ఆలోచనాధోరణి, వాటిపట్ల మా వైఖరి—యివి మొత్తం ప్రపంచం గురించిన, యీ ప్రపంచ సంబంధాలగురించిన మా అభిప్రాయాలపై ప్రభావం నెరపడం సహజమే. అంతర్జాతీయ సంబంధాల్లో కూడా పెరిస్త్రోయికా అవసరమని మా అభిప్రాయం. అయితే దీన్ని 'సి. పి. ఎస్. యు నిర్ణయంద్వారా' రుద్దలేము. మొత్తం మానవాళి, దానిలోని భాగస్వాములు అందరూ సమ్మతిస్తేనే అమలుజరపాలి. చర్చలకు, అభిప్రాయాలను పోల్చిచూసుకోడానికి, మార్పిడిచేసుకోవడానికి మేము సిద్ధమే. ప్రతి ఒక్క భాగస్వామి విలువను, యెంపికను మేము గౌరవిస్తాం.

'ఒక్క ముక్కలో చెప్పాలంటే, మా మార్గాన్ని, పెరిస్త్రోయికా మార్గాన్ని అది యెంత జటిలమైనదైనాసరే మేము దృఢంగా అనుసరిస్తాం. తర్వాత అదే సులభతరమైపోతుంది.

"ఇక అమెరికాతో సంబంధాల గురించి. మన ఆర్థిక, వ్యాపార సంబంధాలు అలాంటి పరిస్థితుల్లో వుండడం మనం యింకా యెలా సహించగలుగుతున్నామో నాకు అర్థంకావడం లేదు. వాస్తవంలో మీతో మాకు సంబంధాలు లేకుండా పోయాయి.

"నిజమే, మనలో ఒకరితో మరొకరికి సంబంధంలేకుండా వుండగలుగుతామనికూడా యిది రుజువు చేస్తోంది. అయితే మనం పరస్పరం రుజువు పర్చుకోవాలనుకుంటున్న అంశం యిదేనా? కానేకాదు. మనలో ఒకరి పట్ల ఒకరికిగల ఆసక్తి అపారమైనదని నా అభిప్రాయం. మన విజ్ఞాన శాస్త్రవేత్తలనే తీసుకోండి. వారు పరస్పరం కలుసుకుని, అభిప్రాయాలను మార్పిడి చేసుకోవడంలో గల ఆసక్తిని గురించి వారిని అడగండి. యిది వారికి చాలాముఖ్యం. నాకు యిది తెలుసు, యిది లేకుండా వారికి గడుపదు. రెండు పెద్ద దేశాల శాస్త్రజ్ఞులమధ్య సంబంధాలు లేక పోవడం, తమ భావాలను పరస్పరం సుసంపన్నం చేసుకోడానికి వీల్లేకపోవడం అనేది సాధారణ పరిస్థితి అనిపించుకోదు. యితర రంగాలకు కూడా యిదే వర్తిస్తుంది. ఉదాహరణకు మీ వ్యాపారస్థులనే తీసుకోండి.

"మీరూ, మేమూ ప్రతిఒక్క విషయాన్ని గురించి ఆలోచించే సమయం, యెక్కడున్నామో, యే దశలను మనం చేరుకున్నామో నిర్ధారించుకొనే సమయం, ప్రతిఒక్క దాన్ని విశ్లేషించే సమయం ఆసన్నమైంది. యీ ప్రపంచంలో మనం యెలా మనాలో తుదకు నిర్ధారించుకునేందుకు మరో పది, యిరవై, ముప్పయి లేదా వంద సమావేశాలు అవసరం కావచ్చు. యిది మన వుభయదేశాల ప్రజలకు, సమస్త ప్రపంచ ప్రజలకు సంబంధించిన సమస్య. సహకరించుకునే మార్గాన్ని, పరస్పరం సన్నిహితమయ్యే మార్గాన్ని, భవిష్యత్తులో కూడా మిత్రులుగా వుండే మార్గాన్ని అమెరికా, సోవియట్ యూనియన్ కనిగొనితీరాలి. మనం తొందరపడకూడదు, వాస్తవాలతో నిమిత్తంలేని అతిశయోక్తులకు పూనుకోకూడదు. మనం బాధ్యతా యుత వైఖరిని కలిగివుండాలి. మనకు భ్రమలు అవసరంలేదు. యెందుకంటె స్పష్టమైన వాస్తవికతలు మన ముందున్నాయి. అదే సమయంలో మనం కృషిని ఆరంభించడం అవసరం. ఎందుకంటే ప్రతిఒక్కటీ మొదటి అంజతో ప్రారంభమౌతుంది.

"యీ పర్యటనా, మన సంబంధాల్లో గత కొద్ది సంవత్సరాలుగా పొడసూపుతున్న విషయాలూ, ప్రజల మనోభావాల్లో పుంజుకుంటున్న వాటి శక్తీ యీ దిశలో సాగుతున్నాయంటే అర్థం అవరోధం తొలగిపోతున్నట్టే. వ్యక్తిగతంగా నేను ఆశావాదిని."

(టాస్, 1987 డిసెంబరు 9)

# వైట్‌హౌస్ విందులో గోర్బచేవ్ ప్రసంగం

సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి మిహాయిల్ గోర్బచేవ్ గౌరవార్థం అమెరికా అధ్యక్షుడు రోనాల్డ్ రీగన్ డిసెంబరు ఎనిమిదో తేదీన వైట్‌హౌస్‌లో ఒక విందు చేశారు. ఆ విందులో రీగన్ ప్రసంగించిన అనంతరం, మిహాయిల్ గోర్బచేవ్ యిలా ప్రసంగించారు :

గౌరవనీయులయిన అధ్యక్షా,

గౌరవనీయులు శ్రీమతి రీగన్‌గారూ,

సోదర సోదరీమణులారా, కామ్రేడ్స్,

కిందటేడాది సాహసికురాలయిన ఒక అమెరికన్ యువతి—లిన్‌కాక్స్—మన రెండు దేశాలమధ్య విస్తరించుకునివున్న జలవిధిని కేవలం రెండు గంటల్లోనే ఈద గలిగారు. లిన్‌కాక్స్ సోవియట్ తీరంమీద కాలూనిన సందర్భంగా మా దేశస్థులూ, అమెరికన్ ప్రజలూ కలిసినప్పుడు ఆ సాంగత్యం యెంత స్నేహపూర్వకంగా వుంటుందో వెల్లడయింది. ఈ అపూర్వ సన్నివేశాన్ని టెలివిజన్‌లో మేం చూశాం. మన రెండు దేశాల ప్రజలూ ఒకరికొకరు యెంత సన్నిహితులో లిన్‌కాక్స్ తన సాహసకృత్యం ద్వారా నిరూపించింది.

మన దేశాల్లోని సామాజిక వ్యవస్థలు పరస్పరం భిన్నమైనవి. మన జీవన విధానాలుకూడా విభిన్నమయినవే. అనేక అంశాలపై మన మధ్య విభేదాలున్నాయి. ఇవి చాలాకాలంపాటు కొనసాగుతాయనేదికూడా స్పష్టం.

అయినప్పటికీ, రాజకీయ, సైద్ధాంతిక విభేదాలను తక్కువ చెయ్యకుండానే, ఒకరికొకరు సన్నిహితం కావడానికి దారితీసే మార్గాలను మనం అన్వేషిస్తున్నాం. యెందుకంటే ఈ అన్వేషణ మాకూ, మీకూ, మొత్తం మానవాళికంతటికీ యెంతో కీలకమైనది.

మేం అందుకే యిక్కడికొచ్చాం.

1986 సంవత్సరారంభంలో అమెరికన్ టెలివిజన్ కార్యక్రమంలో పాల్గొంటూ మరింత మెరుగయిన భవిష్యత్తు సాధ్యమవుతుందనే ఆశాభావాన్ని నేను ప్రకటించాను. అధ్యక్షా! అప్పటికి మనం వరసగా జెనీవాలో సంభాషణలు జరిపాం.

దాన్ని ప్రాతిపదికగా చేసుకునే అమెరికా ప్రజలకు నూతన సంవత్సర శుభాకాంక్షలు అందజేస్తూ "మన అనంతృప్త హేమంతం అంతం అవుతుంది" అని చెప్పగలిగాను.

రెక్యావిక్ శిఖరాగ్రసమావేశం అనంతరం జరిగిన ముమ్మర కృషివల్ల వాషింగ్టన్ శిఖరాగ్రసమావేశం సాధ్యమైంది; హేమంతం అంతం అవుతోందని యీనాడు మనం చెప్పుకోవచ్చు.

ఈ భవనానికి ఆవల విశాలప్రపంచం విస్తరించుకునివుంది. ఆ ప్రపంచానికీ, మన దేశాల ప్రజలకూ, మన బంధు దేశాలవారికీ, స్నేహితులకూ, సమకాలీనులకూ మనం బాధ్యత వహిస్తున్నాం.

"పెరిస్త్రోయికా" (పునర్నిర్మాణం)అన్న రష్యన్ పదాన్ని యీనాడు ప్రపంచమంతటా సాగుతున్న పరిణామక్రమానికి—అణుయుగం, రోదసీశకాల వాస్తవాలపట్ల నూతన దృక్పథం యేర్పర్చుకుంటున్న క్రమానికి—కూడా అన్వయించవచ్చు. ఈనాటి ప్రపంచం ముందున్న సమస్యలను పాత వైఖరులద్వారా పరిష్కరించడం అసాధ్యమని అందరికీ తేటతెల్లమైపోయింది.

ఈనాడు అణ్వస్త్ర రహిత ప్రపంచ నిర్మాణం లక్ష్యంగా యెంచుకున్నాం. ఆ లక్ష్యం చేరుకోడానికి వున్న మార్గం కంటకమయమైనదీ, శిలామయమైనదీ. అయితే నూతన ఆలోచన వూతంతో ముందుకుపోగలం. ఈ రంగంలోకూడా—మన మనస్తత్వాలలోనూ, ఆచరణలోనూ—మార్పులు చాలా అవసరమని కనిపిస్తోనేవుంది.

కొత్త కొత్త దేశాలను, ప్రదేశాలనూ కనిపెట్టిన మహత్తర యుగం తాలూకు కృషి యేదో ఒకే ప్రాంతానికో, ఖండానికో పరిమితంకాలేదు. అలాగే అణ్వస్త్ర రహిత ప్రపంచ నిర్మాణమార్గంకోసం సాగుతున్న మన అన్వేషణ మధ్యశ్రేణి అణు మిసిలీల నిర్మూలనా సంధిలాంటివి ఒకటో రెండో సాటించడానికి పరిమితం కాకూడదు.

అణ్వస్త్రాలలోకెల్లా ప్రధానమయినవీ, నిర్ణయాత్మకమయినవీ అయిన వ్యూహాత్మకదాడి ఆయుధాలను తగ్గించి, ఆ తర్వాత సంపూర్ణంగా నిర్మూలించే లక్ష్యంతో తక్షణమే మన కృషిని కొనసాగించాలని ఆశిస్తున్నాను.

మనం ఇరవై ఒకటో శతాబ్దానికి చేరువవుతున్నాం. మనలో ప్రతిఒక్కరూ వారి వారి శక్తిసామర్థ్యాల మేరకు తాత్కాలికతకూ, శాశ్వతత్వానికీ మధ్య లంకెగా వినియోగపడిన వాళ్ళే.

ప్రముఖ సోవియట్ కవి అఫనాసిఫెట్ "మనిషి శాశ్వతం కాకపోయినా మానవాళి శాశ్వతమే" అన్నాడు.

చిరంజీవి అయిన మానవాళి ప్రయోజనార్థం మనం యీనాడు ఒక ప్రధాన చర్య చేపట్టాం. అందుకే, అన్నిటికన్నా ముందుగా ఆ విజయానికే జేజేలు చెబుతున్నాను.

ఈ పరిణామాలు మన రెండు దేశాల ప్రజలకూ అత్యంత ప్రీతిపాత్రమయినవి. ఈ ఒప్పందంలో అమెరికన్, సోవియట్ ప్రజల అభీష్టం వ్యక్తమయింది. అందుకు రెండు దేశాల ప్రజలకూ అభినందనలు చెబుతున్నాను.

ఈ విజయం కేవలం మన కృషివల్లనే సాధ్యంకాలేదని నొక్కి చెప్పదల్చుకున్నాను. మన రెండు దేశాల బంధుదేశాల, వివిధ దేశాల, ప్రజావుద్యమాల ప్రతినిధుల కృషికూడా యీ చరిత్రాత్మక విజయం సాధించడంలో తోడ్పడింది. ఆ విధంగా వారు తమవంతు కర్తవ్యాన్ని నిర్వహించారు.

అలాగే యీ సంధి ముసాయిదా రూపొందించడంలో ప్రత్యక్షంగా పాల్గొన్న వారికి కూడా అర్హ సత్కారం అందజేయడం భావ్యంగా వుంటుంది.

అధ్యక్షా! మీరూ, శ్రీమతి రీగన్‌గారూ ఆరోగ్యంగా సుఖంగా వుండాలని కోరుకుంటున్నాను. ఈ విందులో పాల్గొంటున్న వారందరికీ సుఖసంతోషాలు ఒనకూడాలనీ, మన రెండు దేశాల ప్రజలకూ శాంతి సౌభాగ్యాలు సమకూరాలనీ మనసారా కోరుకుంటున్నాను. (టాస్, 1987 డిసెంబరు 8)

# అమెరికా విదేశాంగశాఖ యేర్పాటుచేసిన విందులో మిహాయిల్ గొర్బచేవ్ ప్రసంగం

అమెరికా విదేశాంగశాఖ 1987 డిసెంబరు 9న తన గౌరవార్థం చేసిన విందులో మిహాయిల్ గొర్బచేవ్ చేసిన ప్రసంగ పూర్తి పాఠమిది:

గౌరవనీయులైన విదేశాంగ మంత్రిగారూ,

శ్రీమతి షుల్జ్‌గారూ,

సోదర సోదరీమణులారా,

అమెరికా విదేశాంగ మంత్రిత్వశాఖ అందజేసిన, యింతటి సాధికారవంత అందజేసిన ఆహ్వానానికి కృతజ్ఞతలు తెలుపుతున్నాను. అంతర్జాతీయ రాజకీయాల్లో చాలావరకు యిక్కడ పనిచేసేవారిపైనే ఆధారపడివుంటుంది. నిన్న మనం తిలకించిన ఘటన, మేము పాల్గొన్న ఆ ఘటన యెట్టి పరిస్థితుల్లోకూడా యిక్కడ పనిచేసేవారి భాగస్వామ్యం లేనిదే సాధ్యమయ్యేది కాదు.

మొత్తం అణ్వాయుధాల తరగతికి తరగతినే, కచ్చితంగా చెప్పాలంటే రెండు తరగతుల ఆయుధాలను సంపూర్ణంగా నిర్మూలించేందుకు వుద్దేశించిన సంధిపై నిన్న మీ దేశ అధ్యక్షులూ, నేనూ సంతకాలు చేశాము. దీని ఫలితంగా ప్రపంచానికి దాదాపు 2.000 ప్రాణాంతక అణ్వాయుధాల పీడ విరుగడౌతుంది. యిదేమంత పెద్దసంఖ్య కాకపోయినప్పటికీ, యీ సంధి ప్రాముఖ్యత దానిలోని నిర్దిష్ట అంశాల పరిమితులను మించి వెళ్ళుతుంది.

అణ్వాయుధాలు లేని ప్రపంచ నిర్మాణ కార్యక్రమం అమలుకు ఆరంభంగా దీన్ని మేము పరిగణిస్తున్నాం. ఈ కార్యక్రమాన్ని నేను దాదాపు రెండు సంవత్సరాలక్రితం 1986 జనవరి 15న సోవియట్ నాయకత్వం తరఫునా, సోవియట్ ప్రజల తరఫునా ప్రకటించాను.

ఆ కార్యక్రమం వాస్తవికమైనదేనని యిప్పటికీ భావిస్తున్నారా అని అప్పటినుండి నన్ను యెన్నోసార్లు అడగడం జరిగింది. అవును, తప్పనిసరిగా అలాగే భావిస్తున్నానని నేను సమాధానం యిచ్చాను. యీ లక్ష్యానికి మార్గం చాలా కష్టంతో కూడినదని మధ్య శ్రేణి, స్వల్పశ్రేణి మిసిలీల సంధిపై జరిగిన సంతకాలవల్ల రుజువైంది. అయితే యిది సరియైన మార్గమనీ, ఈ లక్ష్యం ఆచరణ సాధ్యమైనదనీ కూడా యీ ఘటన రుజువుచేసింది.

వందల మిలియన్ల ప్రజల సంకల్పం యీ దిశలో సాగుతోంది. 20వ శతాబ్దం ముగియవస్తున్న యీ సమయంలో నాగరికత అనేది ఒక విభజనరేఖవద్దకు చేరుకుంటోంది: అయితే యీ విభజన అనేది వ్యవస్థలమధ్య, సైద్ధాంతిక భావాలమధ్య కన్నాకూడా విజ్ఞత, మానవాళి స్వీయపరిరక్షణ సహజాతం ఒకవైపు, బాధ్యతారాహిత్యం, జాతీయ దురహంకారం, దురభిప్రాయం ఒక్కమాటలో చెప్పాలంటే పాత ఆలోచనాధోరణి మరో

వైపుగా వున్న విభజన: యీ విషయాల్ని వందల మిలియన్ల ప్రజలు అవగతం చేసుకుంటున్నారు.

యెడతెగని యుద్ధాలుచేసి అలసిపోయాం యిక చాలు, యీ యుద్ధాలను యిక విషేధించాలి అన్న గ్రహింపునకు మానవాళి వస్తూంది.

రెండు ప్రపంచయుద్ధాలు, శక్తిని హరింపజేసే ప్రచ్ఛన్నయుద్ధాలు, వీటితోపాటు మిలియన్లాది ప్రాణాలను బలిగొన్న, బలిగొంటున్న స్థానిక సంఘర్షణలు—యివన్నీ మానవాళి చెల్లించుకున్న అంతులేని మూల్యం. దుస్సాహసానికీ, అహంకారానికీ; యితరుల ప్రయోజనాలను, హక్కులను ఖాతరుచేయని తిరస్కారానికీ; వాస్తవికతలను యెదుర్కొనడం యిష్టంలేని అందుకు శక్తిలేని తత్వానికీ; సొంత యెంపికచేసుకునేందుకు, ప్రపంచంలో తమ స్థానం నిలబెట్టుకునేందుకు దేశదేశాల ప్రజలకుగల హక్కును పరిగణనలోకి తీసుకోడం యిష్టంలేని, అందుకు శక్తిలేని తత్వానికీ మానవాళి యింతటి మూల్యాన్ని చెల్లించుకోవాల్సిన పనిలేదు.

అన్నికాలల్లోని మానవతావాదుల వుదాత్త ఆదర్శాలు, శాంతి, స్వేచ్ఛ, ఆదర్శాలు ప్రతిఒక్క మానవ జీవితానికిగల విలువనుగురించిన ఎరుక—యివి ఆచరణాత్మక విధానానికి ప్రాతిపదికగా వుండాలని దీనర్థం.

ప్రపంచ పరిణామంలోని ప్రతిఒక్క కొత్త అంశపట్ల ఆరోగ్యకరమైన, బాధ్యతా యుతమైన వైఖరి వున్నట్లయితే సమస్యలను మరింతలోతుగా అర్థంచేసుకోడానికి అది మనకు తోడ్పడుతుంది; వాటి పరిష్కారానికి అదనపు అవకాశాలను మనకు కల్పిస్తుంది.

ఈ అవకాశాలు జారిపోకుండా చూడుకోవడం ముఖ్యం. మరింత భద్రమైన ప్రపంచాన్ని, సైనికవాద వుచ్చులు, సైనికవాద మనస్తత్వం లేని ప్రపంచాన్ని, మరింత ప్రజాతంత్ర యుతమైన ప్రపంచాన్ని నిర్మించేందుకు ఆ అవకాశాలను గరిష్టంగా వినియోగించుకోవడం అవసరం.

ఈ చర్య—అంటే కుదిరిన సంధి—యిందుకోసం జరిగిన సన్నాహాలు నిజంగా ప్రబోధాత్మకమైనదని చెప్పడం అతిశయోక్తి కాదు. కఠినమైనవే అయినప్పటికీ సామాన్యమైన సత్యాల ప్రాముఖ్యతను గుర్తించేట్లు చేసి మనరెండు దేశాలను, ప్రపంచ రాజకీయాలను అవి సుసంపన్నం చేశాయి. వాటిలో కొన్నిటిని పేర్కొనడం సముచితంగావుంటుంది.

మొదటిది: యీనాటి అంతర్జాతీయ పరిణామంలో సోవియట్ అమెరికా సంబంధాల పాత్రను, ప్రాముఖ్యతను మనం పరస్పరం కలుసుకునేందుకు ముందుకు వచ్చిన క్రమంలో మరింత బాగా అర్థంచేసుకోగలిగాం. అదేసమయంలో మన ప్రజలపట్లనేగాక, ప్రపంచ సమాజంపట్ల కూడా మనకుగల మహత్తర బాధ్యతను గుర్తెరిగాం.

రెండవది. మనకృషికి మన బంధుదేశాలు యిచ్చినతోడ్పాటు యెంత ముఖ్యమైనదో మనం తెలుసుకోగలిగాం. అంతేకాదు, మన బంధుదేశాల ఆలోచనల్లో, సలహాల్లో, వాటి నిజమైన, క్రియాశీలమైన భాగస్వామ్యంలో, మన చర్యలను తమ చర్యలతో సమన్వయ పర్చడంలో యెంతటి అమోఘమైన శక్తివున్నదో తెలుసుకోగలిగాం.

ఒక పక్షపు వుద్దేశాలు, ప్రతిపాదనలు పథకాలను గురించి అవతలి పక్షపు బంధుదేశాలు అవగాహనపర్చుకోవడం యెంతముఖ్యమో మనకు ఆచరణలో రుజువైంది. అలాగే అనేక వర్ధమానదేశాలు అలీనదేశాలు అవి పెద్దవైనా, చిన్నవైనా, వాటినుంచి సానుభూతి, సంఘీభావం, మన ప్రయత్నాలు సఫలంకావాలన్న కేవల ఆకాంక్ష సైతం విస్పందేహంగా ముఖ్యమైనవేనని ఆచరణలో మనం రూఢిపర్చుకున్నాం.

శాంతి అనేది యీనాడు ఒక రాజ్యం లేదా రాజ్యాలబృందం, అవి యెంతటి శక్తివంతమైనవి అయినాసరే వాటి గుత్తసొత్తుకాదని యిదంతా తిరుగులేనివిధంగా ధ్రువీకరించింది. ఇది సామాన్యమైనదే అయినప్పటికీ చాలా ముఖ్యమైన సత్యం. శాంతి అనేది అనేక రాజ్యాలు శ్రద్ధ కనపరుస్తున్న, తమ గమ్యంగా పెట్టుకున్న అంశం. ఇది అన్ని రాజ్యాలు శ్రద్ధవహించే విషయంగా నానాటికీ మరింత హెచ్చుగా రూపొందు తోంది. అనేక రాజ్యాల వుమ్మడి కృషిజరిగే యే విషయంలోనైనా పారస్పర్యత అనేది తప్పనిసరి, రాజీలు పడకతప్పదు.

బలప్రదర్శనా స్థానాలనుండి నిలబెట్టచూపే శాంతి సహజంగానే బలహీనంగా వుంటుంది. ఆ పద్ధతినిగురించి యేమిచెప్పినాసరే యిది మాత్రం నిజం. స్వభావరీత్యానే దానికి ప్రాతిపదికగా వుండేవి యివి: తలపాటు, అది బహింగరంగ తలపాటు లేదా లోపాయకారి తలపాటు కావచ్చు; ఘర్షణల ప్రజ్వలన నిరంతర ప్రమాదం; బలాన్ని వుపయోగించాలనే వుబలాటం.

నిజంగా యిలాంటి బలహీనమైన శాంతితో సంతృప్తి పడాల్సిందిగా శతాబ్దాలుగా మానవాళిని నిర్బంధించడం జరిగింది. కానీ దీన్ని మేము యిక యేమాత్రం సహించజాలము.

ఈ సంధివల్ల సోవియట్ యూనియన్ యెంతో వదులుకోవలసివచ్చిందని కొందరు భావిస్తుండగా అమెరికా పక్షమే చాలా హెచ్చు రాయతీలిచ్చిందని మరికొందరు భావిస్తున్నారు.

ఇందులో యే అభిప్రాయమూ సరికాదని నా అభిప్రాయం. ప్రతిఒక్క పక్షమూ కచ్చితంగా అవసరమైన మేరకే ఒప్పుకున్నాయి. ఆ నిర్దిష్ట రంగంలో తమ ప్రయోజనాల సంతులనం కోసం అలా చేశాయి.

మనం సంబంధాల, ప్రత్యక్ష కమ్యూనికేషన్ల వాతావరణాన్ని సృష్టించుకున్నాం. ఒకరినొకరం మరింత అర్థంచేసుకొనేందుకు ప్రయత్నించాం. యిది లేనిదే సంధిని సాధించడం యెంతో కష్టమయ్యేది. శాంతిని పరిరక్షించడం అన్నిటికన్నా ముఖ్యమని యీ కృషిక్రమంలో మేము ప్రగాఢంగా గ్రహించాం. మీకుకూడా అదేవిధమైన గ్రహింపు యేర్పడిందని అనుకుంటున్నాను. మనమంతా విభిన్న పద్ధతుల్లో వుండాలన్నా, మనం యెంచుకున్న పద్ధతుల్లో మన దేశాల్లో జీవించాలన్నా, వివాదాలను పరస్పరం చర్చించుకొనేందుకు, పరస్పరం అభిప్రాయాలను నొక్కి చెప్పేందుకు అవకాశాలను

అట్టిపెట్టుకోవాలన్నా అన్నిటికన్నాముందు శాంతి పరిరక్షణ అవసరం అన్న ప్రగాఢ అవగాహన మాకేర్పడింది.

అంతర్జాతీయ సంబంధాల్లో మరింత న్యాయమైన, మరింత మానవీయమైన వ్యవస్థ దిశలో యీనాడు మౌలికంగా ఒక కొత్త, ముఖ్యమైన అంజవేశాం. ఆఅంజ చిన్నదే కావచ్చు కాని వేశాం. తర్వాతి అంజలుకూడా జాప్యంలేకుండా వేయాలని యెవరైనా ఆశిస్తారు. అంతేకాదు యిప్పటికే అమలుజరిపిన కృషి అనుభవం ఆధారంగా యీ మంచి పనిని కొనసాగించడం సులభమే.

విజ్ఞానం పిడివాదంగాకాక ఆలోచనా విధానంగా పరివర్తన చెందుతున్న దశలో మనమంతా వున్నాం. శాంతిని పునరుద్ధరించడమే రాజకీయాల అంతిమ లక్ష్యంగా రూపొందించే పనిని మనంచేపట్టాం. 20వ శతాబ్దంలో రెండు ప్రపంచ యుద్ధాల అనంతరం జరిగిన విధంగా యుద్ధాన్ని యితర పద్ధతులలో సాగించడాన్ని యిక యేమాత్రం కొనసాగించరాదు.

రాజకీయాలు మారినకొద్దీ దౌత్యనీతి లక్ష్యంకూడా మారుతుంది. జలనిధి అంతటి అభిప్రాయభేదాలున్నప్పటికీ అందులో సమ్మతిబీజాలను అన్వేషించడం, సాధ్యతలను వాస్తవికతలుగా మార్చడం—వీటిని దౌత్యనీతి సాధించాల్సివుంది.

మన రెండుదేశాల దౌత్యవ్యవస్థలు యిటీవలికాలంలో యెంతో కృషిచేయాల్సి వచ్చింది. సంధిపై సంతకాలు అనే నిజమైన చరిత్రాత్మక ఘటనను గమనంలో పెట్టుకుని యీమాట అంటున్నాను. అంతేకాదు తమ ప్రజలకోసం, అంతర్జాతీయ సమాజంకోసం తమ ఆలోచనలను, కృషిని, సహనాన్ని, పట్టుదలను, విజ్ఞానాన్ని, బాధ్యతా భావాన్ని అంకితం చేసిన యెందరికో యీ సందర్భంలో కృతజ్ఞతలు చెప్పితీరాలి. యిందుకు ముఖ్యంగా కామ్రేడ్ ఎడ్వార్డ్ షెవర్డ్నాడ్జేను, జార్జిషుల్ట్జ్‌గారిని అభినందిస్తున్నాను.

విదేశాల్లో పనిచేస్తున్న దౌత్యవేత్తలను కూడా ప్రశంసిస్తున్నాను. వారు కేవలం సంప్రతింపులను జరపడంమాత్రమే కాదు. యేదిసాధ్యమో, యేదిఅసాధ్యమో, యేది ఫలితాల నివ్వగలదో, యేది ఆదశలో ఆచరణ యోగ్యంకాదో ఆయా ఆతిథేయ దేశాల రాజధానుల్లో తమ కృషిద్వారా అక్కడిప్రజలు అవగాహనపర్చుకోడానికి వారు తోడ్పడ్డారు.

ఇటీవల ఒక అమెరికన్ పత్రిక ప్రచురించిన వ్యాసంలో వ్యక్తమైనఅభిప్రాయం నాకు నచ్చింది. దౌత్యనీతి దేశరక్షణకు అగ్రదళమనీ, శాంతికోసం పోరాటంలో అగ్రశ్రేణి దళమనీ అది వర్ణించింది.

విదేశాంగ విధానమనేది వృత్తికారుల రంగంగా యిక యేమాత్రంలేదు. ప్రజలను మోసగించే ఒప్పందాలు, ఖరారునామాలు, ప్రజలకీలక ప్రయోజనాలకు విరుద్ధంగా వారిని ఉద్రేక పూరితకార్యాచరణలకు, త్యాగాలకుపూనుచేసే విధంగా ఒప్పందాలు, ఖరారు నామాలు కుదుర్చుకోవడం అనేవి గతకాలపు విషయాలయ్యాయి. యెలాంటి కుతంత్రాలైనా, అసత్యాలైనా యేదో ఒక విధంగా బయటపడిపోతూనేవుంటాయి.

వర్తమానకాలానికి యిది విశిష్టలక్షణంగా వుంది: అంతర్రాజ్య సంబంధాలలో వాస్తవ ప్రజాతంత్రీకరణ వుండాలన్న గంభీరమైనభావన యిందులో నాకు ద్యోతక మౌతోంది. యితర దేశాల్లో తమ రాజ్యాలకు ప్రాతినిధ్యం వహించడానికి అధికారం పొందిన వారివి, యింతటి శక్తివంతమైన మానవ ఆకర్షణరంగంలో శ్రద్ధవహించాల్సిన, నిర్దిష్టమైన కృషిచేయాల్సిన వారిని తాము తీసుకునే చర్యలకు సర్వదా జవాబుదారీచేయాలి: ఆ చర్యలు తీసుకోడానికి కారణాలేమిటో వారు వివరించేట్టు చేయాలి.

అంతేకాదు వారు సంస్కృతీ సంబంధాల రంగంలోని అతిసున్నితమైన శ్రేణిలో వున్నారు. ఒక దేశ ప్రజలు మరో దేశ ప్రజలను అర్థంచేసుకోవడం చాలావరకు వీరి పైనే ఆధారపడివుంది. ఇది యిప్పుడు రాజకీయాల్లోకూడా యెంతో ముఖ్యమైనది.

ఈ మందిరంలో ప్రసిద్ధ అమెరికా ప్రతినిధులు, సోవియట్ ప్రతినిధులు వుండడం అనేది కేవలం అధికార లాంఛనాలప్రకారం, మర్యాదకోసం కనబర్చే గౌరవంకాదు. మన రెండు దేశాలమధ్య పరస్పర సదవగాహనపూరితమైన రాజకీయ పంథాకు సాధికార తోడ్పాటు అనే వాస్తవానికి యిది రుజువు.

వాస్తవంగా అణ్వాస్త్రవిసర్జనను ప్రారంభించడానికి సంబంధించిన ఒప్పందం కోసం సుదీర్ఘమైన, కష్టభూయిష్టమైన మార్గంలో సాగడానికి యీ తోడ్పాటు మనల్ని ప్రేరేపించింది. మనం ప్రారంభించినచోటనే నిలిచిపోవాలని అనుకోవడంలేదు గనుక మన అణ్వాయుధాగారాల్లోని భారీ, అత్యంత ప్రమాదకరమైన భాగాన్ని నిర్మూలించే నిమిత్తం సంయుక్త కృషిని కొనసాగించే సమయంలో, భవిష్యత్తులోకూడా యీ తోడ్పాటు అవసరం.

మన దేశాలమధ్య సంబంధాలకు అలాంటి గుప్తవనరులున్నాయని యీ సంద ర్భంగా నేను చెప్పదలుస్తున్నాను. అవి శాస్త్రవేత్తల, సాంస్కృతీరంగ కార్యకర్తల మధ్య సంబంధాలు. యితర దేశాలపట్ల వైఖరిని, జాతీయ యెరుకను చాలావరకు రూపు దిద్దేది కచ్చితంగా వీరే. కచ్చితంగా యీ కారణాననే వుమ్మడి అంశాన్ని వారు త్వరగా కనుగొనగలుగుతారు. రాజకీయాలకు అవసరమైన పూర్వ రంగాన్ని సృష్టించగలుగు తారు, మన ప్రజలమధ్య, మన రాజ్యాలమధ్య సంబంధాల్లో వుభయదేశాల మేధావుల పాత్ర బృహత్తరమైనది, ముఖ్యమైనది.

సామాన్య మానవ అనుసంధాన భాషలో, రష్యన్‌లో, ఇంగ్లీషులో చెప్పాలంటే యిక్కడ మనం సాధించినది ఆశాపునరుద్ధరణ. బలప్రయోగం అనేది చంచలమైన, అస్థిరమైన అభివర్గానికి చెందినది. కాగా హృదయపూర్వక కృషితో సాధించిన సత్యం స్థిరమైనది. యెందుకంటే యిది మానవీయమైనది.

మనం నిన్నటికన్నా యీనాడు సత్యానికి మరింత దగ్గరగా వున్నాం.

మీకు అభినందనలు.

(టాస్, 1987 డిసెంబరు 9)

# అమెరికా కాంగ్రెస్ సభ్యులతో మిహాయిల్ గొర్బచేవ్ సమావేశం

అమెరికా కాంగ్రెస్ (ప్రతినిధులసభ) నాయకులతో వాషింగ్టన్‌లో 1987 డిసెంబరు 9 వ సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ ప్రధాన కార్యదర్శి మిహాయిల్ గొర్బచేవ్ సమావేశమయ్యారు. యీ సమావేశంలో జేమ్స్‌రైట్, థామస్ ఫోలె, రాబర్ట్ మైఖేల్, టొనికొయెల్‌హో, బ్రెంట్‌లాట్, రాబర్టుబిర్డ్, రాబర్టుడోల్, అలాన్‌క్రాన్స్‌టన్, అలాన్ సింప్సన్ పాల్గొన్నారు.

ఈ సమావేశంలో సోవియట్ పక్షంనుండి సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ పొలిట్ బ్యురో సభ్యులు, సోవియట్ విదేశాంగ మంత్రి ఎడ్వార్డ్ షెవర్డ్‌నాడ్జే, పార్టీ పొలిట్ బ్యూరో సభ్యులు, కేంద్ర కమిటీ కార్యదర్శి అలెక్సాండ్ర్ యాకొవ్‌లెవ్, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ కార్యదర్శి అనతోలి దొబ్రీనిన్, సోవియట్ మంత్రిమండలి డిప్యూటీ ఛైర్మన్ వ్లాదిమిర్ కమన్‌త్సేవ్, యితర అధికార్లు పాల్గొన్నారు.

కాంగ్రెస్‌సభ్యుల నుద్దేశించి మిహాయిల్ గొర్బచేవ్ ప్రసంగిస్తూ యిలా అన్నారు:

"ఈ మందిరంలో మిమ్మల్ని కలుసుకోవడం నాకు సంతోషకరంగావుంది. మేము మాస్కోలో వున్నపుడే, యీ సందర్శన కార్యక్రమాన్ని పరిశీలిస్తున్నపుడే అమెరికా కాంగ్రెస్ నాయకులతో సంబంధాలు, సమావేశాలు యీ కార్యక్రమంలో ముఖ్యాంశంగా వుండాలని అభిప్రాయపడ్డాం. వాస్తవంలో అమెరికాలోని రాజకీయక్రమంలో కాంగ్రెస్ ఒక ముఖ్యాంశంగా వుంది. అందువల్ల మేం అలా అభిప్రాయపడటంసహజమే. సోవియట్ యూనియన్‌లో సుప్రీం సోవియట్ భాగస్వామ్యం లేకుండా యేదీ జరగదు. అలాగే అమెరికాలో కాంగ్రెస్ భాగస్వామ్యంలేకుండా యేదీ జరగదు.

"ఉమ్మడి కృషిద్వారా, సముచితమైన సర్దుబాట్లద్వారా నిన్న మనం ఒక ముఖ్యఘట్టానికి చేరుకున్నాం—అది మన మధ్య సంబంధాల్లోనే గాక, మొత్తంమీద అంతర్జాతీయ సంబంధాల చరిత్రలో అపూర్వ ఘటన. ఒక పెద్ద అంజవేశాం. అలాంటి అంజ వేసినందుకు మనల్ని మనం పరస్పరం అభినందించుకోవచ్చునని అనుకుంటున్నాను. సంధిపై సంతకాలు జరిగిన వెంటనే ప్రపంచమంతటా ఏర్పడిన ప్రతిస్పందన గురించిన సమాచారం నాకందింది. యీ ఘటన ప్రపంచంలో గొప్ప ఆసక్తిని రేకెత్తించిందని తెలుసుకున్నాను. నిన్నటి ఘటనను ప్రాతిపదికగా చేసుకొని యెంతో ముఖ్యమైన ఒక అంశంపై కలిసికట్టుగా ఆలోచించాలని నేను మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాను. యిదీ ఆ అంశం: మనదైన యీ ప్రపంచంలో మనం కలిసికట్టుగా యెలా వుండబోతున్నాం? ఉదాహరణకు మన సంబంధాలను మెరుగుపర్చుకోవాలని సోవియట్ ప్రజల్లోని విస్తృతవర్గాల్లో యెంతో ఆసక్తివుంది. అమెరికా ప్రజల్లోకూడా అదే విధమైన ఆసక్తివున్నదని నేను అనుకుంటున్నాను. ప్రజల్లోని యీ మనోభావాలను

కాంగ్రెస్, సుప్రీం సోవియట్, అమెరికా ప్రభుత్వం, సోవియట్ ప్రభుత్వంలాంటి రాజకీయ సంస్థలు నిజంగా గుర్తించకపోతే యీ క్రమానికి అవసరమైన పూతం లభించదు.

"వాషింగ్టన్ పర్యటనకు బయల్దేరేముందు నేను విదేశాలకుచెందిన కొందరు నాయకులతో, ప్రత్యేకించి ఆస్ట్రేలియా ప్రధానితో, జాంబియా అధ్యక్షునితో సమావేశాలు జరిపాను. వారు ప్రపంచంలోని యెదురుబొదురు మూలలనుంచి వచ్చారు. వారు నాకు యీ విధంగా చెప్పడంతో చర్చలు ప్రారంభమయ్యాయి: మీరు అమెరికాను సందర్శించమన్నారు. మీ సంబంధాలు మెరుగుపడడం ఆరంభమయేందుకు మీరు సాధ్యమైనదంతా తప్పక చేయండి అని వారు చెప్పారు. అందువల్ల మనందరిపై అపారమైన బాధ్యతవుంది. యిది మన ప్రజలకు బాధ్యత వహించడం మాత్రమేకాదు. మన సంబంధాలు మెరుగవ్వాలని ప్రపంచమంతటాగలప్రజలుకోరుకుంటున్నారు. రాజకీయ స్థాయిలో మన సంబంధాల పురోగమనం ప్రారంభదశలో వుంది. సోవియట్ యూనియన్‌ను యిప్పుడుయెక్కువ సంఖ్యలో సెనేటర్లు, కాంగ్రెస్ సభ్యులు సందర్శిస్తున్నారు, అలాంటి పర్యటనలకు మేము సర్వదా యితోధిక ప్రాముఖ్యత నిస్తున్నాం. పార్లమెంటేరియన్ల మధ్య చర్చలు మరింత గంభీరస్థాయిలో, మరింత విస్తృత స్థాయిలో జరగాలని మేం వాంఛిస్తున్న విషయం మీకు స్వయంగా అనుభూతమై వుంటుందని నా నమ్మకం. యిదీ నేను చెప్పదలచిన మొదటి విషయం.

"ఇక రెండవ విషయం యిది. నిరాయుధీకరణ క్రమం ముమ్మందు జరగనున్నది. యేవిధంగా చూసినా అదేమీ సులభమైన క్రమం కాదు. ఈ భారం సాధ్యమైనంతగా తగ్గేట్టు ప్రయత్నించాలి, కృషి చేయాలి అని మేము కోరుకుంటున్నాం. సోవియట్ యూనియన్, అమెరికాలపై ఆయుధ పోటీ భారం తగ్గించేందుకు యిది అవసరం. యీమాట నేను చెప్పినపుడు పలువురు, అంటే దూరదృష్టి లేనివారు గొర్బచేవ్‌కు పరిస్థితులు అనుకూలంగా లేనట్టున్నాయనీ, అందుకే సోవియట్ యూనియన్‌పై ఆయుధ పోటీ భారాన్ని తగ్గించుకోడానికే చర్చల కోసం అమెరికాకు వచ్చారనీ వూహాగానాలు చేయవచ్చు.

"విషయం అది కాదని నేను చెప్పదలుస్తున్నాను. సమస్యను సరిగా అర్థం చేసుకోవాలనేదే అసలు విషయం. రాజకీయ చర్చలను, యితర సంబంధాలను ఆయుధ పోటీ యెంతో సంక్లిష్టం చేస్తోంది. మన రెండు దేశాల్లో ఆర్థిక క్రమాలకు హాని కల్గిస్తున్నది. ఆయుధ పోటీవల్ల మనం సమకూర్చుకున్న ఆయుధాల గుట్టలకు గుట్టలనే మనం చూస్తున్నాం. వాటి శిఖరాలపై మనం కూర్చున్నాం. అవి హఠాత్తుగా పేలితే, అదుపు తప్పితే జరిగేదేమిటో కాస్త ఆలోచించండి. ఆ విషయం మనందరికీ అవగాహన అయివున్నట్టయితే మనం ఒకరినొకరం సమీపించుకోడానికి ప్రయత్నించి తీరాలి. సంభాషణక్రమం సంక్లిష్టమైన విధంగానే సాగుతున్నప్పటికీ దానిద్వారా వాస్తవికమైన ఆలోచన స్వయంగా యిటు అమెరికా, అటు సోవియట్ యూనియన్ పౌర, రాజకీయ వర్గాల్లో ప్రవే

సాగించడం యేవిధంగా చేయగలమూ అన్న దానికి యిది వుదాహరణ.''

ముఖ్యమైన, హృదయపూర్వకమైన చర్చలు జరిపినందుకు యీ సమావేశంలో ప్రసంగించిన కాంగ్రెస్ సభ్యులు మిహాయిల్ గొర్బచేవ్‌కు కృతజ్ఞతలు తెలిపారు. యీ సమావేశంలో సోవియట్-అమెరికా సంబంధాలకు, అంతర్జాతీయ పరిస్థితికి సంబంధించిన చాలా ముఖ్యమైన అంశాలను పూర్తి బాహాటత సరళిలో చర్చించారు. విన్న సంతకాలు జరిగిన సంధితోసహా వాషింగ్టన్‌లో జరుగుతున్నదంతా రెండు మహత్తర దేశాలమధ్య పరస్పర సదవగాహన, మరింత ఫలవంతమైన సంబంధాల మార్గంలో ఒక మంచి ఆరంభ చర్య అని ప్రతినిధుల సభ స్పీకర్ జేమ్స్‌రైట్ అన్నారు. కాంగ్రెస్ సభ్యులతో నేడు చాలా విర్మొహమాటంగా గొర్బచేవ్ వ్యవహరించారని జేమ్స్‌రైట్ ప్రశంసించారు. సోవియట్ యూనియన్‌లో గొర్బచేవ్ చేస్తున్నకృషిపట్లా, సాధించదలచిన ఆదర్శాలపట్లా అమెరికా కాంగ్రెస్ సభ్యులకు ప్రశంసాభావం వుందని స్పీకర్ అన్నారు. యింత విర్మొహమాటంగా జరిగిన చర్చల్లో పాల్గొనే అవకాశాన్ని తన సహచరులందరూ వినియోగించుకోలేకపోవడ మొక్కటే తనకు విచారంగా వుందన్నారు. అమెరికా ప్రజలలాగే సోవియట్ ప్రజలు చిత్తశుద్ధితో శాంతిని వాంఛిస్తున్నారనే పూర్తి విశ్వాసం తనకున్నదనీ, యీ లక్ష్యసాధనకు ప్రతిఒక్కరూ చేయగలిగినదంతా చేయడం వారి విధి అనీ ఆయన అన్నారు.

వచ్చే సంవత్సరం మార్చిలో ఐ. ఎన్. ఎఫ్ సంధిపై చర్చను తాను ప్రారంభించ దలచినట్టు సెనేట్‌లోని మెజారిటీపక్ష నాయకుడు రాబర్టుబిర్డ్ అన్నారు. యీ సంధి ధ్రువీకరణక్రమం ఏప్రిల్‌లో పూర్తిఅవుతుందనే ఆశాభావాన్ని వ్యక్తంచేశారు. సాంప్రదాయిక ఆయుధాల గురించిన చర్చలు మందకొడిగా సాగుతున్నందుకు ఆయన ఆందోళన వ్యక్తం చేశారు.

సోవియట్-అమెరికా వాణిజ్యంపై పక్షపాతంతో కూడుకున్న అంశలను తొలగించాలని సెనేట్‌లోని మైనారిటీ పక్షనాయకుడు రాబర్టుడోల్ కోరారు. జాక్సన్-వానిక్ సవరణను రద్దుచేయాలని గతరెండు సంవత్సరాలుగా కోరుతున్న విషయాన్ని ఆయన గుర్తుచేశారు. ఉభయ దేశాలమధ్య ఆర్థిక సంబంధాల అభివృద్ధిని కుంటుపర్చే సవరణ యిది.

సోవియట్ యూనియన్‌లోని నూతన ఆలోచనా ధోరణిని సెనేట్‌లోని డెమొక్రాటిక్ మెజారిటీపక్ష వుపనాయకుడు అలాన్ క్రాన్‌స్టన్ హర్షించారు. వ్యూహాత్మక అణ్వాయుధాల తగ్గింపును గురించిన ఒక ఒప్పందాన్ని ఉభయదేశాల నాయకులు రూపొందించగలరనే ఆశాభావాన్ని ఆయన వ్యక్తంచేశారు.

(టాస్, 1987 డిసెంబరు 9)

# అమెరికాలోని బహుళ ప్రసార సాధనాల ముఖ్యసంస్థల అధిపతులతో మిహాయిల్ గొర్బచేవ్ సంభాషణలు

అమెరికాలోని బహుళ ప్రసార సాధనాల ముఖ్య సంస్థల అధిపతుల సమావేశంలో 1987 డిసెంబరు 9న మిహాయిల్ గొర్బచేవ్ ప్రసంగించారు. ఈ సమావేశం వాషింగ్టన్‌లోని సోవియట్ రాయబార కార్యాలయ ఆవరణలో జరిగింది.

ఈ సమావేశంలో యీ కింది వారు పాల్గొన్నారు: రాబర్ట్ ఎల్. బెర్న్‌స్టీన్ (రాండం హౌస్ సంస్థ యజమాని): కార్నెలియా బెస్సిక్ (హార్పెర్ అండ్ రో పబ్లిషర్స్ సంస్థ డైరెక్టర్): టాయిస్ డి. బొకార్డి (అసోసియేటెడ్ ప్రెస్ జనరల్ డైరెక్టర్): డేవిడ్‌కోహెన్ (కోల్లిన్స్ పబ్లిషర్స్ అధ్యక్షుడు): స్టానటన్ ఆర్. కుక్ (చికాగో ట్రిబ్యూన్ ప్రచురణ కర్త) మాక్స్ ఫ్రాంకెల్ (న్యూయార్క్-టైమ్స్ సంపాదకుడు): కాథెరిన్‌గ్రాహం (వాషింగ్టన్ పోస్టు సంస్థ బోర్డు అధ్యక్షుడు): విలియం జి. హైలాండ్ (ఫారిన్ అఫైర్స్ సంపాదకుడు): టామ్‌జాన్సన్ (లాస్ ఏంజల్స్‌టైమ్స్ ప్రచురణ కర్త): జె. మెక్‌మానుస్ (టైం పత్రికాసంస్థ మేనేజర్): గార్డాన్ మానింగ్ (ఎన్. బి. సి. న్యూస్ సంస్థ ఉపాధ్యక్షుడు): థామస్. సి. మర్ఫీ ఎ. బి. సి. సంస్థ డైరెక్టర్ల బోర్డు అధ్యక్షుడు): డబ్ల్యు. ఓటిస్ (అసోసియేషన్ ఆఫ్ అమెరికన్ పబ్లిషర్స్ అధ్యక్షుడు): జి. పీల్ (సైంటిఫిక్ అమెరికన్ సంస్థ బోర్డు అధ్యక్షుడు): డబ్ల్యు. ఫిలిప్స్ (వాల్‌స్ట్రీట్ జర్నల్ బోర్డు అధ్యక్షుడు, సంపాదకుడు): జాన్ సి. క్విన్ (యు. ఎస్. ఎ టుడే సంపాదకుడు): రాబిన్‌రైట్ (ఎన్. బి. సి సంస్థ అధ్యక్షుడు): ఎం. వాజ్‌క్వెత్ రానా (యునైటెడ్ ప్రెస్ ఇంటర్నేషనల్ అధ్యక్షుడు): స్టువార్ రిచర్డ్‌సన్ (రిచర్డ్‌సన్ అండ్ స్టీర్‌మాన్ అధ్యక్షుడు): స్టీవెన్‌షెపర్డ్ (బిజినెస్ వీక్ సంపాదకుడు): రిచర్డ్‌స్మిత్ (న్యూస్ వీక్ సంపాదకుడు): బి. స్మిత్ (ఇంటర్నేషనల్ పబ్లిషర్స్ అధ్యక్షుడు): హోవర్ స్ట్రింగర (సి. బి. ఎస్ న్యూస్ అధ్యక్షుడు): మార్టిన్ ఎస్. టాష్ (ప్లీనం పబ్లిషింగ్ కార్పొరేషన్ అధ్యక్షుడు): లారెన్స్ ఎ. టిష్ (సి. బి. ఎస్ అధ్యక్షుడు): టెడ్ టర్నర్ (డబ్ల్యు. టి. బి. ఎస్. సి. ఎన్. ఎన్ అధ్యక్షుడు): ఎ. విటాల్క్ (డబుల్‌డే అండ్ కంపెనీ అధ్యక్షుడు), మార్టిమర్ బి. జుకెర్మాన్ (యు. ఎస్ న్యూస్ అండ్ వరల్డ్ రిపోర్ట్ ప్రచురణ కర్త: సంపాదకుడు).

తన పర్యటన సందర్భంగా నిర్వహించిన కార్యకలాపాల స్వభావాన్ని నొక్కి-చెబుతూ మిహాయిల్ గొర్బచేవ్ యిలా అన్నారు:

"మేం ఒక సంధిపై సంతకాలు చేశాం: అణ్వాయుధాల నిర్మూలనలో యిది యిదివరకెన్నడూ తీసుకోని ప్రథమ చర్య: ఇది స్వయంగానే ప్రధానమైన చర్య. విస్తృత పరిధిగల సమస్యలను గురించి అమెరికా అధ్యక్షుడూ, ఆయన సహచరులూ

నేనూ గంభీరమైన సంభాషణలు జరుపుతున్నాము. నిర్మాణాత్మకమైన సంభాషణ జరిపేం దుకు తగినంత అనుభవాన్ని మేం ప్రోదిచేసుకున్నాం.

"సోవియట్-అమెరికా సంబంధాలకు చెందినంతవరకూ మన రెండుదేశాలకూ, మహత్తరరాజ్యాలకూ అర్హమైన విధంగా మేం చేయాల్సినదంతా చేస్తున్నామా లేదా అన్న విషయాన్ని స్వయంగా తెలుసుకునేందుకు మన రెండు దేశాలలోని విస్తృత ప్రజా తరగతులు, అనేక వర్గాల ప్రతినిధులు యెంతో కుతూహలంగా యెదురుచూస్తున్న దశకు మేము చేరుకున్నాం.

"గత నలభై సంవత్సరాలకు పైబడిన కాలంలో మనం ఒకరు లేకుండా ఒకరం, వ్యాపార తదితర సంబంధాలులేకుండా వుండగలమని రుజువుపర్చుకున్నాం. అలాటి పరిస్థితిలో సైతం ఒకరి ఉనికి అనుభూతిని మరొకరం యెంతగానో పొందాం. ఒకరు లేకుండా మరొకరం మనుగడ సాగించగలమని రుజువుచేసుకోవడం మనకు అవసరమా? దానికి భిన్నమైన దానిని రాజకీయాలలో, మన కార్యాచరణలలో, సంభాషణలలో రుజువు చేసుకోవాల్సిన అవసరంలేదా? బహుళ ప్రసారసాధనాల ద్వారాను, యితర సాధనాల ద్వారానూ పరస్పరం అభిప్రాయాలు తెలుసుకునే మార్గాలకోసం అన్వేషించాల్సిన అవసరంలేదా?

"ప్రశ్న ఇది: ఆయుధపోటీవల్ల మనం మరింత ఆనందమయులమై పోయామా? అవును అని కొందరనవచ్చు. ఆయుధాల తయారీని వ్యాపారంగా చేసుకున్నాను కాబట్టి తనకు యిది ఆనందంగా వుందని అలాటివారు చెప్పవచ్చు. తన వార్తాపత్రికలేదా మేగజైన్ ఆయుధపోటీ, ప్రచ్ఛన్న యుద్ధాల సంచలన వార్తలతో బాగా డబ్బు సంపాదించుకుంటూంది గాబట్టి తనకు యిది ఆనంద దాయకంగా వుందని మరి కొందరు అనవచ్చు. కాని, ప్రజల భవిష్యత్తును లక్ష్యపెట్టని వారు, తమ దేశభవిష్యత్తును లెక్కచేయనివారు, యీనాటి వాస్తవాలను దృష్టిలో పెట్టుకు చూచినపుడు మన నాగరికత భవిష్యత్తును లక్ష్యపెట్టని వారు, తాము డబ్బుచేసుకుంటున్నంత కాలం అన్నిటికీ హానికల్గించడానికి సిద్ధపడే వారు యెందరున్నారు, ప్రస్తుత అభివృద్ధి స్థాయిని దృష్టిలో పెట్టుకుని చూచినపుడు అలాటి వారు మెజారిటీగా వుంటారని నేననుకోవడంలేదు. బాధ్యతా భావం, మానవాళి భవిష్యత్తును గురించిన శ్రద్ధ యీనాటి ప్రపంచంలో ప్రబలంగా వుందని నా నమ్మకం.

"ప్రజలు యిలా సూటిగా అడుగుతున్నారు: సాధారణ పరిస్థితుల్లో జీవించడం, పనిచేయడం మనం యెప్పుడు నేర్చుకుంటాం? మూసపోత పద్ధతులపైనే, గతకాలపు కార్యాచరణ పద్ధతులపైనే యెప్పటికీ మనం ఆధారపడజాలం. ఆ గందరగోళంలో కొట్టుకుపోతాం, ఉద్రిక్తతలను అధిగమించలేక పోతాం.

"ప్రపంచంలోని ప్రస్తుత పరిస్థితిని మనం విశ్లేషించాలి: వున్న విషయాలపట్ల వాస్తవిక వైఖరిని అవలంబించాలి. దీన్ని మనం చేసినట్టయితే అనేక రంగాలలో పరిష్కారాలను కనుగొనగల్గుతాం: అవి సంభాషణలలో, నిరాయుధీకరణలో ఆర్థిక వ్యవస్థలో".

సోవియట్, అమెరికా బహుళ ప్రసార సాధనాలమధ్య విశ్వాస సంవర్ధన, సహ

కారాభివృద్ధి చాలా ముఖ్యమని యీ సమావేశంలో మాట్లాడిన యితర వక్తలు నొక్కి చెప్పారు. సోవియట్ అమెరికా సంబంధాల భవితవ్యంపట్ల తమకుగల బాధ్యత యీ సమావేశంలో పాల్గొంటున్న ప్రసారసాధనాల సిబ్బందిలో అత్యధికులకు తెలుసునని టి.వి.ఎస్ అధ్యక్షుడు టెడ్‌టర్నర్ చెప్పారు. సోవియట్ ప్రాతినిధ్యులతో కలిసి పని చేయడంలో టర్నర్‌కు యెంతో అనుభవంవుంది. యీ సంబంధాలను యెంతో బాగా అభివృద్ధి పర్చవీలుందనే విశ్వాసాన్ని ఆయన వ్యక్తంచేశారు. మనం జీవిస్తున్నామని, మనం మానవులమని గర్వించడానికి తరుణమిదేనని ఆయన అన్నారు. జపాన్ ఆర్థిక వ్యవస్థతో పోల్చిచూస్తే యిది విదితమౌతుంది; ఆయుధపోటీవల్ల అమెరికా ఆర్థిక వ్యవస్థ నాశనం అయింది. యీ ఆయుధపోటీ సోవియట్ ఆర్థిక వ్యవస్థనుకూడా పెద్ద దెబ్బ తీసింది. అని టర్నర్ అన్నారు. ఆయన సోవియట్ యూనియన్‌లో అనేక పర్యాయాలు పర్యటించారు. సోవియట్ ప్రజలంటే ఆయనకు యిష్టం యేర్పడింది—"అమెరికన్ల లాగానే వారు యెంతో మంచివారు, దయగలవారు" అన్నారాయన. అస్తమానమూ మనం ఒకర్నొకరం విమర్శించుకోవచ్చు కాని యిది మనన్నెక్కడికి తీసుకపోతుంది? విశాల ప్రాతిపదికపై విషయాలను పరిశీలించాల్సివుంది. మనం ఒకరితో ఒకరం సహకరించుకోవాలి. ఒకర్నొకరం నమ్మాలి, అన్నారాయన. యిందుకోసం నేను ప్రయత్నిస్తున్నాను. ఆయుధాలుగాని భద్రతా సిబ్బందిగాని లేకుండా నేను సోవియట్ యూనియన్‌లో పర్యటించాను నాకెలాటి హానిజరగలేదు. నన్ను వారు స్నేహితునిగా సమాదరించారు. మన రెండు దేశాలమధ్య స్నేహవారధుల నిర్మించడంలో యిక్కడున్న వారిలో చాలామంది యెంతో చేయవీలుందని నేను నమ్ముతున్నాను. గత రెండు సంవత్సరాల కాలంలో అమెరికన్ టెలివిజన్ మిత్రసరళిలో సోవియట్ యూనియన్ గురించి చూపడం పెరిగిందని టర్నర్ పేర్కొన్నారు. యిది సానుకూల పరిణామమని ఆయన వర్ణించారు. యీ సరళి మరింత వేగం పుంజుకుంటున్నది, దీన్ని కొనసాగించాల్సి వుంది. అమెరికా గనక ఆయుధపోటీని వదులుకుంటే దాని ఆర్థిక వ్యవస్థకు లాభం చేకూరుతుంది - మరో మార్గమేమీలేదు అన్నారాయన. సోవియట్ అమెరికా సంబంధాలను మెరుగుపర్చేందుకు కృషిచేయాల్సిందిగా సమావేశంలో పాల్గొన్న ప్రసారసాధనాల ప్రతినిధులక్కు ఆయన విజ్ఞప్తిచేశారు.

మధ్యశ్రేణి, స్వల్పశ్రేణి మిసైలిలపై ఒప్పందాన్ని సాధించేందుకు అమెరికా సోవియట్ శాస్త్రజ్ఞులు చేకూర్చిన దోహదాన్ని ప్రచురణకర్త అయిన ఎస్. రిచర్డ్‌సన్ గుర్తుచేశారు. ముప్పయి సంవత్సరాలక్రితం పగ్‌వాష్‌లో శాస్త్రజ్ఞులు సమావేశమైన విషయం ప్రస్తావిస్తూ వారు తమతమ దేశాల ప్రతినిధులుగా మాత్రమేగాక, ఐన్‌స్టీన్, రస్సెల్ వారికి విజ్ఞప్తి చేసినట్టుగా, మానవ కుటుంబ సభ్యులుగా వారు ఆ సమావేశంలో పాల్గొన్నారని రిచర్డ్‌సన్ పేర్కొన్నారు. నాడు శాస్త్రజ్ఞులు చాలా క్లిష్టమైన సమస్యలను చర్చించారు. అణ్వాయుధ పోటీగురించి వారు చర్చించారు. ఈ ఆయుధాలు సహేతుకమైన రాజకీయ లక్ష్యానికి యేమాత్రం తోడ్పడబోవనే నిర్ధారణకు వారు వెనువెంటనే వచ్చారు.

మనకు అవసరమైన పరస్పర విశ్వాసానికి సాంకేతిక పునాదిని సమకూర్చే కృషిని నాడే వారు ప్రారంభించారు. నియంత్రణ సమస్యల పరిష్కార కృషిని నాడే ఆరంభించారు. ఈ క్లిష్ట సమస్యలపై ఒక అంగీకారానికి వారు రాగలిగారు. అనంతరం వారు స్వదేశాలకు చేరుకుని నిరాయుధీకరణకు చక్కని శాస్త్ర, సాంకేతిక పునాదివుందని తమతమ ప్రభుత్వాలకు నచ్చచెప్పే కృషిని ఆరంభించారు: అణ్వాయుధాల తరగతికి తరగతినే ధ్వంసంచేసేందుకు వీలుకల్పించే మొట్టమొదటి ఒప్పందాన్ని యెట్టకేలకు నేడు సాధించడం జరిగింది. శాస్త్రజ్ఞుల అభిప్రాయాలను యిటు మన దేశంలోనూ, అటు సోవియట్ యూనియన్‌లోనూ కూడా చెవిని బెట్టాల్సివుందని దీన్నిబట్టి తేలుతోంది.

ఈ అభిప్రాయంపై వ్యాఖ్యానిస్తూ మిహాయిల్ గొర్బచేవ్ యిలా అన్నారు: ఐన్‌స్టీన్ అభిప్రాయాలను, ఆయన సహచరుల అభిప్రాయాలను చెవినబెట్టకపోవడం మొత్తంపై తప్పని నా అభిప్రాయం. ప్రపంచం ఒక కొత్త శక్తిని సమకూర్చుకుంది. దీని వల్ల ఒక కొత్త వైఖరి అవసరం అని శాస్త్రజ్ఞులు ఆనాడు హెచ్చరించారు. దానిపట్ల ఆనాడు తగినంత బాధ్యతాయుతమైన వైఖరి నవలంబించడం జరగలేదు. శాస్త్రజ్ఞుల అభిప్రాయాలను గౌరవించకపోవడంవల్ల తలెత్తిన దుష్ఫలితాలు యిప్పుడు అనుభవానికివచ్చాయి. శాస్త్రజ్ఞుల అభిప్రాయాలు, వారి శక్తిస్తోమతలు మనకు అవసరం. "అణుయుద్ధ నిరోధానికి అంతర్జాతీయ వైద్యుల" వుద్యమం అభిప్రాయాన్ని ప్రపంచం యెంతో శ్రద్ధగా ఆలకించిన విషయం మనం స్పష్టంగా చూశాం. లౌన్, ఛాజోవ్‌లు యీ ఆలోచనను ముందుకు తెచ్చారు. ప్రపంచమంతటా దానికి యెంతటి సానుకూల ప్రతిస్పందన లభించిందో మనం చూశాం. ఎందువల్లనంటే విషయాలు తెలిసిన జ్ఞానులు, అణుయుద్ధం గనక ప్రజ్వరిల్లితే యేం జరుగుతుందో బాగా తెలిసిన వారు దాన్ని గురించి చెప్పడం ప్రారంభించారు. అది అపార ప్రభావాలను కలిగించింది.

ప్రస్తుతం భౌతికశాస్త్రానికి, గణితశాస్త్రానికి చెందిన మన శాస్త్రజ్ఞుల మధ్య సంబంధాలు నెలకొల్పడం జరుగుతోంది. మాకు యెంతో విలువైన సూచనను శాస్త్రజ్ఞులు చేశారు. మేము దాన్ని వినియోగించి మధ్యశ్రేణి, స్వల్పశ్రేణి మిసిలీల సంధి దిశలో పురోగమనానికి మార్గాలను కనుగొన్నాం. సోవియట్, అమెరికా శాస్త్రజ్ఞులతో ఒక కమిటీని నెలకొల్పాలని చర్చల సందర్భంగా మేం ప్రతిపాదించాం. వారు తమ అభిప్రాయాలను తమతమ దేశాల నాయకత్వాలకు సమర్పించినట్టయితే, మేం తీసుకున్న రాజకీయ నిర్ణయం యెంత విలువైందో దాన్నుంచి మాకు అర్థం అవుతుంది.

ముఖ్యప్రసారసాధనాల ప్రతినిధులు సోవియట్ యూనియన్‌లో జరుగుతున్న పునర్వ్యవస్థీకరణ, బాహాటతకృషిని తెలుసుకోవడానికి యెంతో ఆసక్తిచూపారు.

మా సమస్యలకు సంబంధించి అవేమిటో మేం స్పష్టంగా పేర్కొన్నాం. పునర్నవ పంధాను, రాజకీయ సంస్థల స్తోమతను, ప్రజాస్వామ్యాన్ని పెంచే పంథాను, ఆర్థిక మేనేజిమెంటు రూపాన్ని మెరుగుపర్చే పంథాను, ఆత్మికసుసంపన్నత పంథానుచేపట్టాం. మా ప్రణాళికలకు మేం పెరిస్త్రోయికా అని పేరుపెట్టుకున్నాం. యీ మొత్తం కృషిపట్ల ప్రజల ఆసక్తిని రేకెత్తించడం, పునర్నిర్మాణ వుద్యమంలో ప్రజలను నిజమైన భాగ

స్వాములుగా చేయడం మా ప్రధాన కర్తవ్యం. బహుళ ప్రసారసాధనాలు లేకుండా, బాహాటత లేకుండా యిది చేయజాలము. యీ కారణంచేతనే మేం బాహాటతను విస్తృత పరుస్తున్నాం. నిర్మాణాత్మక విమర్శను, బాధ్యతాభావాన్ని ప్రోత్సహిస్తున్నాం. సంచలనాత్మకవాదం యిక్కడ అవసరంలేదు. ఒక వ్యక్తి హృదయ తంత్రులను మీటగల భావనలు, తన దేశం మేలుకోసం కష్టించి పనిచేయాలన్న ఆకాంక్షను ఆవ్యక్తిలో వుత్తేజపర్చి వుమ్మడి కృషిలో తన స్థానమేమిటో అతడు తెలుసుకొనేలా చేయగల భావనలు మాకు అవసరం. ఆలాటిక్రమంలో భిన్నఅభిప్రాయాల ఘర్షణ వుంటుందన్నది స్పష్టమే. పత్రికలు వాటిని వాస్తవికంగా పౌరస్ఫూర్తితో ప్రతిబింబించాలి. అంతేతప్ప పత్రికల అమ్మకాలు పెంచుకోవడమే ప్రధాన లక్ష్యంగా పెట్టుకోకూడదు. సమాజానికి ఆందోళన కల్గిస్తున్న ప్రశ్నలకు సమాధానాలు ప్రసార సాధనాలద్వారా సమాజానికి అందాలి: అదీ ప్రధాన విషయం.

మా ప్రసారసాధనాలలో నిర్మాణాత్మక విమర్శను, ప్రజాతంత్ర సూత్రాలను మేం విస్తృత పరుస్తున్నాం. మా పథకాల తొలిదశలో మాకు అవి తోడ్పడ్డాయి. మా పథకాల తరువాత దశలోకూడా వాటి తోడ్పాటుపై మేం నమ్మకం పెట్టుకున్నాం. పత్రికలపైనా, వాటి శక్తివంతమైన కృషిపైనా మేం మా ఆశలుపెట్టుకున్నాం. అయితే నియంత్రణ, విమర్శ పరిధికి పత్రికలు సైతం అతీతంగా వుండజాలవు. పత్రికలు సైతం ప్రజలు చేసే విమర్శకు, వారి నియంత్రణకు లోబడి వుండాల్సిన రంగమే.

ఈ క్రమాలు సానుకూలంగా వుంటాయనీ, స్థిరంగా నిలుస్తాయనీ అనడానికి అత్యంత నమ్మదగ్గ గ్యారంటీ, అతి పెద్దగ్యారంటీ యిది: అతి గట్టి పౌర విమర్శనాత్మక పరిశీలనకు రాజకీయవేత్తలు లోనౌతున్నారు; శాస్త్రజ్ఞులు, సాంస్కృతికరంగ ప్రముఖులు అంతర్జాతీయ రాజకీయాలలో ముమ్మరంగా పాల్గొనడం జరుగుతున్నది. వర్తమాన ప్రపంచం నిర్దేశిస్తున్నవాటికి ప్రతిస్పందించడంలో విఫలమవుతున్న రాజకీయవేత్తలతో మన రెండు దేశాల ప్రజలు, యావత్ ప్రపంచంలోని ప్రజలు విసుగెత్తిపోయారన్నది స్పష్టమే. రాజకీయాలు, విజ్ఞానశాస్త్రం, సాంస్కృతిక రంగాల సమ్మేళన, ప్రజావుద్యమాలు శక్తివంతంగా పాలుపంచుకుంటున్న పరిస్థితి, అంతర్జాతీయ రాజకీయరంగంలో వాటి ప్రవేశం—యివి దేశాల ప్రజలను, యెవరూ గతంలోలాగా మభ్యపుచ్చ వీల్లేకుండా గ్యారంటీగా వుంటాయి. ఇప్పటివరకూ వున్నవిధంగా విషయాలు కొనసాగ వీల్లేదని అందరూ అవగాహనపర్చుకున్నారు. ఇందులోనే ప్రధాన గ్యారంటీ వుందని నేను భావిస్తున్నాను. కార్యాలయాలనుంచీ, అధికార ఆవాసాలనుంచీ రాజకీయాలు బయటికి వచ్చాయి. విస్తృతమైన అంతర్జాతీయ మైదానంలోకి రాజకీయాలు అడుగుబెట్టాయి: శాంతిని పరిరక్షించాలని కోరుకునే ప్రజలు యీ మైదానంలోకి నిజంగా ప్రవేశిస్తున్నారు.

సంభాషణల సందర్భంగా సంపాదకులు సోవియట్ యూనియన్‌లో మానవ హక్కులకు సంబంధించిన సమస్యలనుకూడా లేవనెత్తారు. అమెరికాలోని ప్రసార సాధనాలలో తరచు ప్రచురితమయే వాస్తవాలు అనదగనివాటిని వారు ప్రస్తావించారు.

యుగతా ప్రపంచానికి నీతులు బోధించే నైతిక హక్కును అమెరికాకు ఎవరిచ్చారు? నిన్న మీ అధ్యక్షునితో నేనిలా చెప్పాను: అధ్యక్ష మహాశయా, మీరు ప్రాసిక్యూటరూ కారు నేను ముద్దాయినీ కాను.

ఏ విషయమ్ పైనా మరే యితర విషయం పైనా విస్తృతమైన స్థాయిలో చర్చ జరగాలని మీరు కోరుకుంటే అలాగే జరుపుదాం. అది పత్రికల ద్వారా జరుపుదాం.

పాశ్చాత్య విలేకరులు తమ వార్తలను తమ అభిప్రాయాలను స్వేచ్ఛగా సంపూర్ణంగా చదివించుకోవడానికి మా పత్రికలు మొత్తం పేజీకు పేజీనే ప్రాధం మొదలెట్టాయి. అమెరికా అధ్యక్షునితో జరిపిన మొత్తం ఇంటర్వ్యూ పాఠాన్ని సోవియట్ నాయకత్వంపై నిందలతో సహా ఇజ్వెస్తియా పత్రిక ప్రచురించింది. విమర్శ అంటే మాకెలాంటి భయమూ లేదు అయితే మీరు చేసే విమర్శ ఒప్పించేవిధంగా తరచు వుండటంలేదు. మా ప్రజలను అగౌరవపర్చే విధంగా అది వుంటున్నది అందువల్ల ఆ విమర్శ మా గౌరవాన్ని పొందలేకపోతున్నది. సమాజంపట్ల అసంతృప్తి చెందిన ఉగ్రవాద బృందాల అభిప్రాయాలతోనే దానిని పోల్చ వీలున్నది.

వాయిస్ ఆఫ్ అమెరికా, బి.బి.సి. యితర కేంద్రాలు చేసే రష్యన్ భాషా ప్రసారాలలో కేవలం పుకార్లు సృష్టించుకుని అబద్ధసమాచారం ప్రచారం చేస్తున్న విషయాన్ని నిర్దిష్టంగా మిహాయిల్ గోర్బచేవ్ పేర్కొన్నారు. సోవియట్ యూనియన్‌లో పరిస్థితి బాగలేదని చూపటానికి పాశ్చాత్య ప్రచార సాధనాలు ప్రయత్నిస్తున్నాయి అంటే మేం ప్రారంభించిన పని మంచిదని పెరెస్త్రోయికా క్రమంలో మేం ప్రధాన కర్తవ్యాలనే నెరవేర్చడానికి కృషిచేస్తున్నామని దాని అర్థంగా తీసుకోవాలి. మా విధానంపట్ల ఆసక్తిని చంపటానికి అంతటి ముమ్మర ప్రయత్నాలు జరుగుతున్నాయి అంటే మా పెరెస్త్రోయికా ఇటు మాకూ అటు మొత్తం ప్రపంచానికీ యెంతో గంభీరమైన విషయమని అర్థం తీసుకోవాలి అన్నారు మిహాయిల్ గోర్బచేవ్

సోవియట్ యూనియన్, అమెరికాలలోని వివిధ ప్రచురణల సంపాదకుల పరస్పర పర్యటనలను యేర్పాటుచేయడానికి సంబంధించిన నిర్దిష్ట ప్రతిపాదనలను చర్చల సందర్భంగా చేయటం జరిగింది

మిహాయిల్ గోర్బచేవ్ యీ ఆలోచనను బలపర్చారు సంబంధాలు, మరింత సన్నిహితమైన పరస్పర అవగాహన అన్న భావనే స్వయంగా యెంతో ముఖ్యమైనదని ఆయన అన్నారు. ఈ విషయాలను గురించి యిక్కడవున్న సోవియట్ కామ్రేడ్స్ గంభీరంగా ఆలోచించి అందుకు అవసరమైన నిర్వాహణాపరమైన పద్ధతులను పరిశీలిస్తారని మిహాయిల్ గోర్బచేవ్ చెప్పారు.

(ప్రావ్దా 1987 డిసెంబరు 10)

# సోవియట్ రాయబార కార్యాలయంలో జరిగిన విందులో మిహాయిల్ గొర్బచేవ్ ప్రసంగం

అమెరికా అధ్యక్షుడు రొనాల్డ్ రీగన్ గౌరవార్థం 1987 డిసెంబరు 9 న సోవియట్ రాయబార కార్యాలయంలో యిచ్చిన విందులో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి మిహాయిల్ గొర్బచేవ్ చేసిన ప్రసంగ పాఠమిది:

గౌరవనీయ అధ్యక్ష మహాశయా,
గౌరవనీయ శ్రీమతి రీగన్‌గారూ,
సోదర సోదరీమణులారా,
కామ్రేడ్స్,

మా రెండవరోజు చర్చలు ముగిశాయి. ఈ చర్చలు నిర్మోహమాటమైన, వ్యవహార సరళి వాతావరణంలో సాగుతున్నాయి.

మా చర్చల్లో కేంద్రస్థానాన్ని సోవియట్, అమెరికాలకు, ప్రపంచ రాజకీయాలకు సంబంధించిన ప్రధాన సమస్యలు ఆక్రమించాయి.

అనేక తీవ్రసమస్యల విషయంలో మేము పురోగతి సాధించామనే అభిప్రాయం నాకు కలిగింది. ఇది ఆశావాదాన్ని ప్రేరేపిస్తున్నది. ఏదేమైనప్పటికీ భిన్నాభిప్రాయాలు యెంతోగానో వున్న రంగాలుకూడా వున్నాయి.

అధ్యక్ష మహాశయా, నేను యీ విషయం చెప్పాల్సివుంది: మేం యిక్కడ మీతో మాట్లాడుతున్న విషయం మొత్తం ప్రపంచానికి యెంతో ముఖ్యమైనదనీ, యిక్కడ జరుగుతున్న దానిపట్ల ప్రపంచం యెంతో ఆసక్తినీ, యెంతో శ్రద్ధనీ వహిస్తున్నదనే విషయం మాకు నిరంతరం అనుభూతమవుతున్నదనీ నేను భావిస్తున్నాను.

ఇది సహజమే. మనంచేసే నిర్ణయాలు, మనం సాధించే ఫలితాలు మొత్తం ప్రపంచ గమ్యానికి యెంతో కీలకమైనవిగా రూపొందవచ్చు. ఇదీ యీనాటి తక్షణ సమస్య. మనపై గల బాధ్యత అంతటి విస్తృతమైనది.

భవిష్యత్తుపై విశ్వాసం, తమ పిల్లలు, మనుమలు సంతోషకరమైన జీవితం గడుపుతారనే విశ్వాసం—యివి లేకపోయినట్లయితే జీవితంలో ఆనందమే లేకుండా పోతుంది. ఆధునిక నాగరికత ఫలితాలుగానీ, శాస్త్ర, సాంకేతిక విప్లవ విజయాలుగానీ ఆ లోటును పూడ్చలేవు.

మా రష్యన్ మహాకవి అలెగ్జాండర్ పుష్కిన్ యిలా అన్నారు: జీవించడంలోని ఆనందమే అత్యుత్తమ విశ్వవిద్యాలయం.

అలాంటి "విశ్వవిద్యాలయాన్ని" స్థాపించడానికి పూనుకోదలిచాం. దాని విద్యా ప్రజానీకలో దేశాలమధ్య శత్రుత్వం, అనుమానాలు, ఒక దేశ ప్రజలపట్ల మరో దేశ ప్రజల నిరాదరణ, దాని ప్రయోజనాలపట్ల నిర్లిప్తత, భయం, బల ప్రయోగం అనే "పాత్యాంశాలు" వుండవు.

ఈనాటి సంక్లిష్ట, బహు పార్శ్వాలుగల ప్రపంచంలో కలసిమెలసి యెలా జీవించాలో అలాంటి "విశ్వవిద్యాలయం" బోధిస్తుంది.

ఇక అణ్వస్త్రరహిత భవిష్యత్తును గురించి మా ఆలోచన: యిది అమెరికా ప్రజల ఆలోచనకు సన్నిహితంగావున్నట్టు మేం అవగతం చేసుకున్నాం.

1945 లో, మొదటి అణుబాంబును తయారుచేసినపుడు, ఆ అణుబాంబును రూపొందించడంలో పాల్గొన్న ప్రముఖ అమెరికన్ శాస్త్రజ్ఞులు ఆ భయంకర ఆయుధం వుత్పత్తిని, వినియోగాన్ని వ్యతిరేకించారు.

బాంబులకు, మిసిలీలకు "ఎలక్ట్రానిక్ మెదడు"ను అమర్చినప్పటికీ వాటికి ఆలోచనాశక్తి వుండదనేమాట వేరే చెప్పనక్కరలేదు. యీ యంత్రాంగానికి మనసు, చైతన్యం వుండదు. అందువల్ల పచ్చి వున్మాదికన్నా యిది ప్రమాదకరం.

యే అంశంపైగానీ—అవి సాంప్రదాయక ఆయుధాలు, ప్రాంతీయ ఘర్షణలు లేదా మానవహక్కులు యేవైనాసరే వాటిపై—అవగాహనకు రావడం, పురోభివృద్ధిని సాధించడం యీనాడు అసాధ్యమేమీకాదు. అయితే యిందుకు సహజంగానే కావాల్సింది చిత్తశుద్ధి, శ్రద్ధ.

ప్రపంచం అంతస్సంబంధమైనది, పరస్పరాధారితమైనది అని చెబుతున్నామంటే కారణం అణుమహోపద్రవం అందరిపైన పడుతుందన్నది మాత్రమేకాదు. సంపన్న దేశాలకూ, పేద దేశాలకు మధ్య అఖాతం అనేది ఏటేటికీ తీవ్రంగా పెరుగుతూన్నందువల్ల తలెత్తే ప్రమాదంకూడా మొత్తం ప్రపంచానికి వర్తిస్తుంది. యీ సమస్య పరిష్కారం కూడా వర్తమాన ప్రపంచాన్ని విధ్వంసననుండి కాపాడే బ్రహ్మాండమైన కర్తవ్యాల్లో ఒకటి.

నిరాయుధీకరణపై, శాంతిపై మదుపులు అనేవి అత్యంత విశ్వసనీయమైన, మంచి భవిష్యదవకాశాలుగల పెట్టుబడులు.

ఇక్కడికి వచ్చేముందే 'బిడ్జ్' అనే యువజన పత్రిక ప్రతిని చూశాను. యీ సంవత్సరం సోవియట్ యూనియన్‌ను సందర్శించిన అమెరికన్ బాలురు దాని ప్రచురణను ప్రారంభించారు. మాస్కో సమీపంలోగల పెరిస్లావ్ జలెస్కీ అనే రష్యన్ ప్రాచీన పట్టణం వద్ద మాస్కో పాఠశాల విద్యార్థులతో కలిసి వారు ఒక స్నేహశిబిరాన్ని నెలకొల్పారు.

వారి అభిమాన విషయాల్లో కంప్యూటర్స్, టెలికమ్యూనికేషన్స్, క్రీడలు, సంగీతం, రష్యన్, యింగ్లీషు భాషలు, ఆటలు, వినోదయాత్రలువున్నాయి. అన్నిటిలో

వారు సమర్థులే. యీ అమెరికన్ బాలురు యిప్పుడు తమ స్మృతులగురించి రాస్తున్నారు.

ఈ వార్తాపత్రికను మీలో యెవరైనా చూశారోలేదో నాకు తెలీదు. యీ పత్రిక అత్యంతశ్రద్ధకు అర్హమైనది. యిది ఒక ముఖ్యమైన పరిణామక్రమం. యిది మానవ సంబంధాలకు పాఠశాల. పెద్దలమైన మనం యీ పాఠశాలలో పిల్లలనుండి నేర్చుకోవాల్సివుంది.

దురభిప్రాయాలను, విసిగించే మూసపోతలను యెలా వదిలించుకోవాలో ఒక ఆదర్శాన్ని పిల్లలు మనకు చూపుతున్నారు.

అత్యంత మైత్రీపూర్వక, సన్నిహిత సంబంధాలను స్థాపించుకోవడం సులభ సాధ్యమేనని, సహజమేనని, ఇతర దేశపౌరులను విశ్వసించాలనీ, వుపయోగకరమైన దేదో ఒకటి సంయుక్తంగా సృష్టించాలనీ దీని సారం.

ఇది యెవరినైనా వునాత్తునిగా చేస్తుంది; వుభయపక్షాలను మరింత మానవీయంగా, మరింత వినమ్రులుగా చేస్తుంది; చెప్పాలంటే మరింత తెలివైనవారుగా చేస్తుంది.

మన దేశాలమధ్య, ప్రజలమధ్యగల సంబంధాల చరిత్ర వివిధ పుటల్లో సుసంపన్నమైవుంది. వీటిలో కొన్ని వుత్తేజం కల్గించేవి. కాగా మరికొన్ని విద్వేషభావాలను రెచ్చగొట్టేవీను. గత నలభైన వత్సరాల్లో వ్యవహారం యెంతో చెడిపోయింది.

అయినప్పటికీ సానుకూలమైన ప్రతిదానినీ, వుభయదేశాల ప్రజలకు లాభకరంగా వుపయోగించ వీలుందని నా దృఢాభిప్రాయం. అలా సానుకూలమైన విషయాలు హెచ్చుగానే వున్నాయి. సోవియట్ ప్రజలకు సంబంధించినంతవరకూ, వారు ఇతరులు చెప్పిన మంచి మాటలను దయాపూరిత వాక్యాలనూ యెంతో విలువైనవిగా భావించగలరు.

ముర్మాన్స్కుకు అమెరికన్ల సముద్ర యాత్రలనూ, మన వుభయదేశాల ప్రజల వుమ్మడి విజయం కోసం ఎల్బెలో మనం కలుసుకోవడంకోసం అనేక త్యాగాలుచేసి జరిపిన యాత్రనూ మేమెన్నటికీ మర్చిపోము.

అమెరికన్ యింజనీర్లు, కార్మికుల సహాయంతో ప్రథమ పంచవర్ష ప్రణాళిక కాలంలో నిర్మించిన ఫ్యాక్టరీలను, యీ శతాబ్ది వ్యాధులకు వ్యతిరేకంగా శాస్త్రవేత్తలు సంయుక్త కృషితో జరిపిన తీవ్రపోరాటాన్ని, సంయుక్త అంతరిక్ష యాత్రలనూ కూడా మేము గుర్తుంచుకున్నాం.

మన తలపాటు, శత్రుత్వాలకు కారణాల గురించి వేర్వేరు నిర్ధారణలున్నాయి. వాటిపై ఏకీభావంలేదు. యేదేమైనప్పటికీ తలపాటు, శత్రుత్వాలకన్నా శాంతి సహకారాలు యెంతో విజ్ఞతాయుతమైనవే.

అమెరికా ప్రజలకు, సోవియట్ ప్రజలకు శాంతి సిద్ధించుగాక!

భూమ్మీది యావన్మంది ప్రజలకు శాంతి సిద్ధించుగాక!

అధ్యక్ష మహాశయునికీ, ఆయన సతీమణికీ, మా అతిథులుగా వచ్చిన వారందరికీ ఆరోగ్య, సంతోషాలు ఒనగూడాలని కోరుకుంటున్నాను.

తిరిగి మాస్కోలో కలుసుకునేవరకు సెలవు.

(టాస్, 1987 డిసెంబరు 9)

# జార్జి షుల్జ్, షెవర్డ్‌నాడ్జెల సంయుక్త ప్రకటన

అమెరికా విదేశాంగమంత్రి జార్జి షుల్జ్, సోవియట్ విదేశాంగమంత్రి ఎడ్వర్డ్ షెవర్డ్‌నాడ్జెల సంయుక్త ప్రకటన పూర్తి పాఠాన్ని యీ దిగువనిస్తున్నాం. అమెరికా విదేశాంగశాఖ యీ ప్రకటనను విడుదలచేసింది.

అణ్వాస్త్ర పరీక్షలకుసంబంధించిన సమస్యలపై 1987 సెప్టెంబరు 17న వాషింగ్టన్‌లో ఆమోదించిన సంయుక్త ప్రకటనకు అనుగుణంగా ఒక సంయుక్త తనిఖీ ప్రయోగం నమూనాను రూపొందించే కృషిని అమెరికా, సోవియట్ యూనియన్‌లు సాగిస్తున్నాయి. ఈ ప్రయోగాన్ని సాధ్యమైనంత త్వరలో వుభయదేశాల పరీక్షాస్థలాలలో (సెమీపాలాటిన్‌స్క్, నెవాడాలలో) నిర్వహించడం జరుగుతుంది. 1974 నాటి అణ్వాస్త్ర పరీక్షా నిషేధ ప్రాథమిక ఒప్పందం 1976 నాటి శాంతి ప్రయోజనాలకోసం అణుపరీక్షల సంధి—వీటి పర్యవేక్షణను మెరుగుపర్చే చర్యలను రూపొందించడం యీ ప్రయోగ వుద్దేశం. తదనంతర కాలంలో కుదుర్చుకోబోయే అణుపరీక్షల పరిమితి ఒప్పందాల అమలుకు యీ తనిఖీ చర్యలను వీలున్నంత మేరకు వినియోగించడం జరుగుతుంది.

సంయుక్త తనిఖీ ప్రయోగం జరిపేందుకు వీలుగా వుభయ పక్షాలూ తమ తమ పరీక్షాస్థలాలలో జరిపే పేలుళ్ళలో ఒకటి లేదా రెండు పేలుళ్ళశక్తిని కొలిచేందుకు అవతలి పక్షానికి అవకాశం కల్గిస్తాయి. యీ పేలుళ్ళ శక్తి 100 కిలో టన్నులకు తక్కువలేకుండా 150 కిలో టన్నుల వరకూ వుంటుంది.

ఈ సంయుక్త తనిఖీ ప్రయోగం నిమిత్తం సంపూర్ణ పరస్పరత ప్రాతిపదికగా ప్రతి ఒక్క పక్షానికీ యీ కింది అవకాశం వుంటుంది: తనిఖీ ప్రయోజనార్థం, టెలిసిస్మిక్ పద్ధతులద్వారా అవతలిపక్షానికి చెందిన పరీక్షాస్థలాలో విస్ఫోటనా శక్తిని కొలిచే అవకాశం: సెటిలైట్ హోల్‌లోని హైడ్రోడైనమిక్ శక్తి గణన పద్ధతుల వినియోగావకాశం. విస్ఫోటనా శక్తి ప్రమాణనిర్ధారణ నిమిత్తం ఎంప్లేస్‌మెంట్ హోల్‌లో హైడ్రోడైనమిక్ పద్ధతిని వినియోగించడంద్వారా విస్ఫోటనా శక్తిని కొలవడం అనేది యీ పరీక్షలో భాగంగా వుంటుంది.

ఈసంయుక్త తనిఖీ ప్రయోగం నిర్వహించడంలో వుద్దేశం గణాంకశాస్త్రపరంగా గణనీయ ఫలితాలు సాధించడం కాదు. 1974 నాటి అణ్వాస్త్ర పరీక్షా నిషేధ ప్రాథమిక సంధినీ, 1976 నాటి శాంతి ప్రయోజనాలకోసం అణువిస్ఫోటనా సంధినీ తనిఖీచేసేందుకు అవతలిపక్షం ప్రతిపాదించే పద్ధతుల విషయంలో రెండు పక్షాల వారూ పరస్పరం ప్రత్యేకించి గణనలోకి తీసుకున్న అన్ని యితర ఆందోళనకర విషయాలనూ పరిష్కరించే వుద్దేశంతో యీ సంయుక్త తనిఖీ ప్రయోగాన్ని నిర్వహిస్తారు. సంయుక్త తనిఖీ ప్రయోగంలో వినియో

గించిన పర్యవేక్షణా పద్ధతుల సామర్థ్యాన్ని, వాటి ఆచరణాత్మకతనూ, జోక్యరాహిత్యాన్ని రుజువుచేయడంద్వారా పరస్పరం ఆందోళన కల్గిస్తున్న యీ సమస్యల పరిష్కారానికి తగినంత సమాచారాన్ని యీ సంయుక్త తనిఖీ ప్రయోగం అందించగలుగుతుందని వుభయ పక్షాలూ అంగీకరించాయి. 1974, 1976 నాటి సంధుల నిబంధనలను అవతలి పక్షం పాటి స్తున్నదీ, లేనిదీ తనిఖీచేందుకు, ప్రతి ఒక్క పక్షమూ వినియోగించవీలున్న తనిఖీ చర్యల విషయమై ఒక అంగీకారానికి వచ్చేందుకు యీ సంయుక్త తనిఖీ ప్రయోగం యీ విధంగా ప్రాతిపదికను సమకూరుస్తుంది. ఈ అంగీకృత తనిఖీ చర్యలలో దేనినైనా గాని, అన్నిటినీగాని భవిష్యత్తులో వర్తింప చేసేందుకు యిరుపక్షాలకూ అధికారం వుంటుందన్న అంగీకారం కుదిరింది.

సంయుక్త తనిఖీ ప్రయోగానికి సంబం ధించిన విశిష్ట సాంకేతిక, ఆర్గనైజేషనల్ ప్రమాణాలను రూపొందించి వాటిపై ఒక ఒప్పందానికి వచ్చేందుగాను తమ సంప్రదిం పులలో తాత్కాలిక కార్యనిర్వాహణ బృందా లను యేర్పాటు చేసుకోవాలని వుభయపక్షాలూ అంగీకరించాయి.

సంయుక్త తనిఖీ ప్రయోగాన్ని రూపొం దించే, దానిని నిర్వహించే కృషిలో నన్నా హాలకు తోడ్పడే నిమిత్తం రెండు దేశాలలోని అణుపరీక్షా స్థలాలకు పరస్పరం ప్రతినిధివర్గా లను పంపుకోవడానికి రెండు పక్షాలు అంగీక రించాయి. సోవియట్ యూనియన్‌లోని సెమీ పాలతిన్‌స్కీ పరీక్షా స్థలానికి, అమెరికాలోని నెవాడా పరీక్షా స్థలానికి యీ ప్రతినిధివర్గాల పర్యటనలు 1988 జనవరిలో జరుగుతాయి. జెనీవాలో తదుపరి సంభాషణల క్రమానికి యిది ప్రాథమిక కృషిగావుంటుంది.

(టాస్, 1987 డిసెంబరు 9)

# అమెరికన్ వ్యాపార వర్గాల ప్రతినిధులతో మిహాయిల్ గొర్బచేవ్ సమావేశం

వాషింగ్టన్‌లోని సోవియట్ రాయబార కార్యాలయంలో 1987 డిసెంబరు 10న అమెరికన్ వ్యాపార వర్గాల ప్రతినిధులను మిహాయిల్ గొర్బచేవ్ కలుసుకున్నారు. ఆ సమావేశంలో ఆయన చేసిన ప్రసంగ సంక్షిప్తపాఠాన్ని యీ కింద యిస్తున్నాం :

"అమెరికా అధ్యక్షునితో మా సంభాషణలు ముగిసాయి. సంభాషణలను సమాహరిస్తూ ఒక పత్రాన్ని రూపొందించడంతో యివి ముగిశాయి. ఆ పత్రంలో మన రెండు దేశాల మధ్య వ్యాపారానికి సంబంధించిన భాగం కూడా ఒకటి వుంది" అని 1987 డిసెంబరు 10న సోవియట్ రాయబార కార్యాలయంలో అమెరికన్ వ్యాపార వర్గాల ప్రతినిధులతో జరిగిన సమావేశంలో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ ప్రధాన కార్యదర్శి మిహాయిల్ గొర్బచేవ్ అన్నారు. "ఈ పత్రంలోని ఒక మంచి భాగమిది. యీ సంయుక్త ప్రకటనను ఆధారంగా చేసుకుని వ్యవహరించడానికి వ్యాపార వర్గాలకు యిది వీలు కల్పిస్తున్నది. సంయుక్త పరిశ్రమ యేర్పాటు లాంటి ఆర్థిక సంబంధాల నూతన రూపాలను పెంపొందించడాన్ని యిది హర్షిస్తోంది. యిప్పుడు అమెరికన్ వ్యాపారులు తమ సంబంధాలను, బాంధవ్యాలను విస్తరించుకోడానికి సహాయపడే ఒక రాజకీయ పత్రం వారికి లభించింది" అన్నారు గొర్బచేవ్.

"ఈ పర్యటనవల్ల ఒనగూడిన రాజకీయ ఫలితాలకు మేము సంతసిస్తున్నాం. ద్విపక్ష సంబంధాల సాధారణీకరణ : రాజకీయ సంభాషణలు; నిరాయుధీకరణ క్రమం, దీనికి సంబంధించిన సంధిపై సంతకాలు జరగడం వల్ల గొప్ప వూపు లభించిన యీ నిరాయుధీకరణ క్రమం; వ్యూహాత్మక ఆయుధాలపై ఒకరి అభిప్రాయాలను మరొకరు సవివరంగా తెలుసుకోవడంవల్ల నిర్మాణాత్మక వైఖరుల నుండి యీ క్రమానికి మరింత వూపు లభించే అవకాశం—యిదంతా ఆర్థిక సంబంధాలను యేవిధంగా అభివృద్ధి చేసుకోవాలనే ఆలోచనకు సానుకూల పరిస్థితిని సృష్టించగలదు" అని గొర్బచేవ్ అన్నారు.

"మనం పరస్పరం ప్రయోజనకరంగా వ్యవహరించగల మనుకుంటున్నాను. తమకు లాభకరం.గానే అమెరికన్ వ్యాపారులు సోవియట్ యూనియన్‌లో పనిచేయవీలుంది. యిలాంటి సహకారం కొంతమేరకు మన సమస్యల పరిష్కారాన్ని కూడా సులభతరం చేయగలదని మా విశ్వాసం. ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో ఒక భాగంగా మమ్మల్ని మేము పరిగణించుకుంటున్నాం. వివక్షతా పంథాను

అనుసరించడానికి ప్రయత్నించడం అలాంటి వైఖరులను మార్గదర్శకంగా పెట్టుకోవడం యేవిధంగా చూచినా ముఖ్యంగా విజ్ఞతదృష్ట్యా అది పొరపాటే అవుతుంది'' అని ఆయన అన్నారు

''సహకారం గురించిన రాజకీయ నిర్ణయాలను మేము ఆమోదించాం. యీ క్రమం పుంజుకుంటోంది. యీ నూతన రూపాలను, నూతన వైఖరులను వినియోగించుకోవడం ద్వారా సంయుక్త అన్వేషణలో మీరు యిప్పుడు మరింత శక్తివంతంగా చేరాలని నేను కోరుకుంటున్నాను. మనం ఒకరినొకరం తప్పించుకు దూరంగా పారిపోవడం వీలు కాదని చరిత్ర నిర్ధారించింది సోవియట్ యూనియన్ ఒక అవరోధంగా వుండకుండా దాన్ని వదిలించుకోవాలని మీరనుకుంటున్నారేమో, నాకు తెలియదు. అమెరికా ఒక అవరోధంగా వుండకుండా దాన్ని వదిలించుకోవాలని అనుకొనేవారు మా దేశంలో కూడా కొందరు వుండవచ్చు అయితే అలాంటివారి ఆలోచనలు అవాస్తవికమైనవని నా అభిప్రాయం. అమెరికా, సోవియట్ యూనియన్ — ఇవి యీనాటి అన్నిటికన్నా మించిన వాస్తవికతలు. పరిస్థితి యిది. అందువల్ల మనం మనుగడ సాగించాలి, సహజీవనం చేయాలి కేవలం మనుగడ సాగించడం, సహజీవనం చేయడమేగాక సహకరించుకుంటే మరీ మంచిది'' అని అన్నారు ఆయన.

''మన రాజకీయ సంబంధాలను మెరుగుపర్చుకునే మన దేశాలను సన్నిహితం చేసుకునే, సహకారాన్ని పెంపొందించుకునే పంథాను మనం అనుసరిస్తే యిందుకోసం మార్గాన్ని యెలా సుగమం చేయాలనే విషయం ఆలోచించి తీరాలి. యిందుకు రెండు వైపుల నుండీ కృషి చేయాలి ఉభయదేశాల మధ్యగల మార్గాన్ని పరస్పరం సుగమం చేయడానికి శక్తివంతమైన సోవియట్ బుల్డోజర్నూ, శక్తివంతమైన అమెరికన్ బుల్డోజర్నూ పనిలో పెట్టాలి'' అని గోర్బచేవ్ అన్నారు.

''మేము పెట్టుకున్న ఆశలకు యీ సందర్శన న్యాయం చేసింది ఉభయదేశాల ప్రజల్లో, మొత్తం ప్రపంచంలో యెంతో ఆసక్తిని రేకెత్తించింది మనం అంగీకరించిన అన్ని విషయాలు ప్రకటనల రూపంలోనే వుండిపోకుండా. అవి నిజమైన రాజకీయాల్లో, నిజమైన సంబంధాలలో నిజమైన జీవితంలో మూర్తీభవించేట్టు కృషికి పూనుకుందాం'' అని గోర్బచేవ్ అన్నారు.

([illegible], డిసెంబరు 10. 1987)

# మిహాయిల్ గొర్బచేవ్ పత్రికాగోష్ఠి

సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి మిహాయిల్ గొర్బచేవ్ డిసెంబరు 10 న వాషింగ్టన్‌లో ఒక పత్రికా సమావేశంలో పాల్గొన్నారు.

పత్రికా సమావేశంలో ఆయన చేసిన ప్రసంగ పాఠమిది:

సోదర సోదరీమణులారా,

కామ్రేడ్స్,

మా పర్యటన ముగిసినట్లు మేము భావిస్తున్నాం. బెర్లిన్‌లో మేము కొద్దిసేపు ఆగుతాం. నా వాషింగ్టన్ పర్యటన ఫలితాలను గురించి, అధ్యక్షులు రీగన్‌తోనూ, అమెరికాలోని ఇతర నాయకులతోనూ జరిపిన సంప్రతింపులను గురించి చర్చించేందుకు సమావేశం జరపాలని వార్సాసంధి దేశాల నాయకులూ, మేమూ అంగీకరించాం.

ఈ సందర్భన ఫలితాలపై ముఖ్యంగా మా అభిప్రాయాలను, అంచనాలను తెలుసుకోవడంపట్ల మీకు ఆసక్తివున్నట్లు నేను గ్రహించాను. యిలాటి ఆసక్తి వుండటం సహజమే. ఆ ఫలితాల గురించి మరింత తెలుసుకోవాలని మీరు భావిస్తున్నారని నేనను కుంటున్నాను. అందువల్ల దీనికి సంబంధించిన వుపోద్ఘాతానికి బహుశా మామూలుకన్నా ఎక్కువ సమయాన్ని నేనుతీసుకుంటానేమో.

గత రెండున్నర సంవత్సరాల్లో యిది నా మూడవ శిఖరాగ్ర సమావేశమని మొట్టమొదట నేనుచెప్పదలచుకున్నాను. ఈ వాస్తవమే స్వయంగా అనేక విషయాలను తెలుపుతోంది. అమెరికా ప్రభుత్వానికి, సోవియట్ నాయకత్వానికి మధ్య రాజకీయ సంభాషణకు గల గతిశక్తిని ఇది ముఖ్యంగా వెల్లడిస్తోంది.

అందువల్ల జెనీవా, రక్యావిక్ సమావేశాలు వ్యర్థం కాలేదని మేము చెప్పగలం. అదే విధంగా మాపక్షమూ, అమెరికాప్రభుత్వమూ తీసుకున్న యితర చర్యలుకూడా వ్యర్థం కాలేదు.

ఈ మూడవ సమావేశం కొన్ని విర్దిష్ట ఫలితాలను సాధించకపోతే ముఖ్యమైన ఘటనల స్థాయికి యీ సందర్శనను పెంచే అవకాశం మాకు లభించకపోయేది.

ఈ సందర్శనపై నా అంచనాను తెలిపేముందు యిది ప్రపంచ రాజకీయాల్లో ఒక ప్రధాన ఘటన అయిందనే వాస్తవాన్ని చెప్పడంతో ప్రారంభించ దలచాను. ఒక నూతనదశ ప్రారంభం అయిందని చెప్పేందుకు పైతం నేనుసిద్ధమే. సోవియట్-అమెరికా ద్వైపాక్షిక సంబంధాల దృష్ట్యా, ప్రపంచ పరిస్థితి దృష్ట్యా యిది ఒక ముఖ్యదశ.

ఈ సంప్రతింపుల సందర్భంగా యెంతో జరిగింది. దీన్ని గురించి చెప్పడానికి కచ్చితమైన పదాలకోసం ప్రయత్నిస్తాను. యెందుకంటే, అత్యుక్తులూ, మీరసోక్తులూ కాకుండా చర్చల స్వరూప స్వభావాలను వున్న దున్న

ట్టిగా చెప్పడానికి, రాజకీయ ఫలితాలను సక్రమంగా సమాహరించడానికి అలాంటి పదాలు అవసరం.

అయితే ఆ ఫలితాలేమిటి? వాటినిగురించి యీనాడు మీకేమి చెప్పగలం?

సోవియట్ యూనియన్, అమెరికాల నాయకుల మధ్య రాజకీయ సంభాషణల ప్రగాఢతను గురించి మొదట మనం చెప్పుకోవచ్చు. ఈరోజు అధ్యక్షుడూ, నేనూ వున్నత స్థాయిలో సోవియట్-అమెరికా సంయుక్త ప్రకటన నొకదాన్ని జారీచేశాం. మా రాజకీయ సంభాషణలోగల ఒక రకమైన గతిశక్తికి యిదే తార్కాణం.

మేము జరిపిన సంభాషణల పరిధినీ, సారాన్నీ యీ పత్రం తెలియజేస్తోంది. ఆ పత్రానికి గల ప్రాముఖ్యత యిందులోనే వుంది. ఈ పత్రాన్ని చదివితే యిటు పరస్పర అవగాహనా స్థాయినీ, అటు వివిధ సమస్యలపై అంగీకార స్థాయినీ మీరు అంచనా వేయగలుగుతారు. అదేసమయంలో తీవ్రమైన అభిప్రాయభేదాలు యిప్పటికీ వున్నాయన్న వాస్తవాన్ని యీ పత్రం ధ్రువీకరిస్తున్నట్టు కూడా మీకు అనుభూతం కాగలదని నా దృఢాభిప్రాయం.

ఈ పత్రంలోని సానుకూల పార్శ్వాలపై మా అంచనా యేమిటి?

మొదటిది: అమెరికా, సోవియట్ సంబంధాల్లో యిటీవల కొంత ప్రగతిని సాధించినట్లు అధ్యక్షులూ, నేనూ గమనించాం.

రెండవది: గత కొన్ని సంవత్సరాల్లోని ఘటనలను పరిశీలించి, యీనాడు సాధించినదంతా జెనీవా. రక్యావిక్ ప్రాతిపదికపై నేనని మేము మరోసారి అంగీకరించాం. వ్యూహాత్మక స్థిరత్వాన్ని మెరుగుపర్చడానికీ, సంఘర్షణల ప్రమాదాన్ని తగ్గించడానికి వుద్దేశించిన చర్యలను తీసుకోవడాన్ని యీ ఘటనలు సాధ్యంచేశాయి.

"జెనీవా సత్యనిష్ఠా ప్రకటనను మేము శక్తివంతంగా నొక్కిచెప్పిన విషయాన్ని మీ దృష్టికి తీసుకరాదలిచాను. వాషింగ్టన్ సమావేశంతో దీన్ని మరోసారి నొక్కిచెప్పడం అవసరమని మేము భావించాం. అణుయుద్ధం చేయకూడదనీ, అందులో విజేతలంటూ వుండరనీ మేము నొక్కిచెప్పాం. మన దేశాలమధ్య అణ్వస్త్ర, లేదా సాంప్రదాయక ఆయుధాల యుద్ధం యేదీ జరగకుండా నిరోధించడానికి పూర్తికృతనిశ్చయంతో వున్నామని నొక్కిచెప్పాం; సైనిక ఆధిక్యతను పొందేందుకు ప్రయత్నించరాదని నొక్కిచెప్పాం.

మొత్తం ప్రపంచ కుటుంబం ముందు రెండు మహత్తర దేశాలు నిరవధిక కాలానికి వర్తించేలా చేసిన ఒక విధమైన ప్రతినగా దీన్ని మేము పరిగణిస్తున్నాం.

మూడవది: సైనిక తలపాటును నివారించడానికీ, మానవాళి తృతీయ సహస్రాబ్దిలో ప్రవేశించేందుకు సురక్షితమైన ప్రపంచాన్ని నిర్మించడానికి వాస్తవిక మార్గాలను అన్వేషించే ప్రత్యేక బాధ్యత సోవియట్ యూనియన్‌పైనా, అమెరికా పైనావుందని నొక్కిచెప్పడం జరిగింది.

నాల్గవది: అభిప్రాయభేదాలు వున్నాయనీ, కొన్ని విషయాల్లో నిజంగా అవి తీవ్రంగానే వున్నాయనీ వాస్తవికంగా అంచనావేస్తూనే

అవి అధిగమించ వీలులేనివేమీ కావనీ మేము భావిస్తున్నాం. అంతేకాదు, యితోధిక చర్చలకు అవి మమ్మల్ని పురికొల్పుతున్నాయి.

మా సంయుక్త ప్రకటనలోని భావనా సంబంధమైన భాగాన్ని సమాహరిస్తూ మన రెండు రాజ్యాలు వున్నత స్థాయిలో గుర్తించిన యీ విషయాన్ని నేను చెప్పగలను: సుదీర్ఘంగా సాగించిన సంఘర్షణనుండి యిప్పుడు అవి బయటపడుతున్నాయి; దాన్ని విడిచిపెట్టి ముందుకుపోవడానికి అవి సిద్ధంగా వున్నాయి.

ఇది ఒక ముఖ్యమైన రాజకీయ ఫలితమని, ఒక ముఖ్యమైన రాజకీయ ప్రకటన అని మీరు అంగీకరిస్తారనుకుంటా. యిది సంయుక్త పత్రంలో వుంది. సోవియట్, అమెరికా సంబంధాల్లో నూతన దశకు పరివర్తన అనే సారాంశం యిందులో వుంది.

ఈ పర్యటన సందర్భంగా సంధిపై సంతకాలుచేసే పని పూర్తి అయింది. ప్రపంచ స్థాయిలో మధ్యశ్రేణి, స్వల్పశ్రేణి మిసిలీల నిర్మూలనకు వుద్దేశించిన యీ సంధిని రూపొందించడానికి మనకు అనేక సంవత్సరాలు పట్టింది. యీ ఒప్పందంపై అధ్యక్షుడూ, నేనూ సంతకంచేసిన విషయం మీకు తెలుసు.

అణ్వాయుధాలను నిర్మూలించడానికి దారితీసే మార్గంలో మొదటి అంజకుగల ప్రాముఖ్యతనుగురించి నేనిదివరకే చెప్పివున్నాను. ఆ పత్రంపై సంతకాలుజరగడంతో, వుభయ దేశాల ప్రజల తరపునా దానిపై సంతకం జరగడంతో యీ అంజవేయడం యిప్పుడు జరిగింది. అందువల్ల యిది ఒక ప్రధాన ఘటన, చరిత్రాత్మక ఘటన అయిందని మనం చెప్పగల స్థితిలో వున్నామని నేనంటాను. సంయుక్త నిర్మాణాత్మక కృషిద్వారా సాధించిన యీ మహత్తర విజయంగురించి మనం యెంతైనా చెప్పుకోవచ్చు.

ఈ పత్రానికిగల ప్రాధాన్యత బహుశ యిదేనేమో. యిది యెంతశాతం అనేవిషయం అప్రస్తుతం. రెండు తరగతుల మిసిలీలను నిర్మూలించేందుకు అంగీకరించడం ద్వారా అణ్వస్త్రవిసర్జన వాస్తవ క్రమంలో ఒక నూతన దశను ఆవిష్కరించాం: యిదీ అసలు విషయం.

ఇది మన వుమ్మడి విజయం, మనరెండు దేశాల విజయం అనినేనంటాను. అదేసమయంలో యిది మన బంధుదేశాల విజయం కూడా. సర్దుబాట్ల అన్వేషణకోసం, నూతన వైఖరుల అన్వేషణకోసం, ఈ క్లిష్టసమస్యల పరిష్కార పరిణామక్రమ అన్వేషణకోసం జరిగిన సుదీర్ఘప్రయాణం పొడుగునా అన్ని దశల్లోనూ మన బంధుదేశాలు పాల్గొన్నాయి. ప్రజావుద్యమాల, సామాజిక వుద్యమాల భాగస్వామ్యులను కూడా నేను పేర్కొనదలిచాను. వారి కార్యకలాపాలు మన దేశాల్లోని రాజకీయ వేత్తలను, రాజకీయ వర్గాలను ప్రేరేపించాయి; యీ రెండు రకాల అణు మిసిలీలను నిర్మూలించడానికి పరిష్కారాన్ని కనుగొని, సంధిని కుదుర్చుకోవాలని, యెన్ని యిబ్బందులు, అవరోధాలు వున్నప్పటికీ మన పురోగమనాన్ని నిలిపివేయ కూడదని వారు మనకు విజ్ఞప్తి చేశారు.

యిబ్బందులు, అవరోధాలు వున్నాయి. అవి నిజమైనవే, కల్పితమైనవికావు. యీ సమస్యల్లో చాలావరకు కొత్తవి, అసాధారణ

మైనవి. యిది ముఖ్యంగా తనిఖీకి వర్తిస్తుంది.

మొత్తం మీద చెప్పాలంటే యీ సంధి అన్నిదేశాల సంయుక్త కృషిఫలితం. అందువల్ల అణ్వస్త్రరహిత ప్రపంచం దిశగా సాగే మార్గంలో ప్రథమ అంజవేసినందుకు మనం దరమూ పరస్పరం హృదయ పూర్వకంగా అభినందించుకోవాలి. అది మనందరి వుమ్మడి విజయం.

రెండవది: వ్యూహాత్మకదాడి ఆయుధాలను వాస్తవంగా, సమూలంగా తగ్గించే సమస్యపై గత మూడురోజుల సంప్రతింపులను కేంద్రీకరించడం జరిగింది. ఆ సమస్యే మా సమయాన్ని ఎక్కువ తీసుకున్నది. వైట్ హౌస్ దక్షిణంవైపు వున్న పచ్చిక మైదానంలో యేర్పాటుచేసిన వీడ్కోలు సమావేశంలో పాల్గొనడానికి వచ్చినవారు మా కోసం నిరీక్షిస్తున్న సమయంలో మా చర్చల్లోని యీ భాగానికి చెందిన కొన్ని సమస్యలు పరిష్కృతమయ్యాయి. దీన్నిబట్టి మీరు అర్థం చేసుకున్నారనుకుంటా. వ్యూహాత్మక ఆయుధాల తగ్గింపే సోవియట్ - అమెరికన్ సంబంధాలకు కీలకం కదా. ప్రపంచ కుటుంబంలోని వారందరికీ సంబంధించిన ముఖ్య సమస్య యిది. యీ కీలక సమస్యపై సంప్రతింపుల క్రమాన్ని ప్రపంచం యెంతో శ్రద్ధతో పరిశీలిస్తూ వచ్చింది, పరిశీలిస్తున్నది. జర్నలిస్టులైన మీకు యీ విషయం తెలిసిందే.

వ్యూహాత్మకదాడి ఆయుధాలను సగానికి సగం తగ్గించడం గురించి మేము చర్చించాం. యిది సంక్లిష్టమైన సమస్య. యీ మార్గంలో కూడా ఐ.ఎన్.ఎఫ్ సంధిని రూపొందించిన అనుభవంతోసహా సంప్రతింపుల్లోని గత దశలో గడిచిన అనుభవం ఆధారంగా ఒక గొప్ప ముందంజ సాధించాలన్న నిర్ణయానికి వుభయపక్షాలూ వచ్చాయి. యిది యే మాత్రం జాప్యం లేకుండా సాధించాలి. కాగా ఆయుధపోటీని నిలువరించడానికీ, వ్యూహాత్మక శక్తి స్తోమతల హెచ్చింపును నిలువరించడానికీ, వాటిని నిర్మూలించే ఆశయాన్ని అమలుపర్చడానికి నిజమైన అవకాశం అందుబాటులో వుంది.

ప్రస్తుతం ప్రస్తావిస్తున్న యీ సమస్యలపై ఒప్పందానికిగల అవకాశ మేమిటి? అధ్యక్షునితో మేము సమావేశమైన వెంటనే యీ సమస్యపై అభిప్రాయాలను పరస్పరం తెలుపుకున్నాం. మొదటినుండీనే యీ అంశం మాచర్చల్లో కేంద్రస్థానం వహించింది. ఉభయ పక్షాల నిపుణులతో కూడిన ఒక బృందాన్ని యేర్పాటు చేయాలని అధ్యక్షులూ, నేనూ వెనువెంటనే ఆదేశాలు జారీచేశాం. ఉభయ పక్షాలూ యీ బృందాలను యేర్పాటు చేశాయి. మా వైపు బృందానికి సోవియట్ సాయుధ దళాల సిబ్బంది ప్రధానాధికారి మార్షల్ అక్రొమెయేవ్ నాయకత్వం వహిస్తున్నారు. అమెరికా పక్షం బృందానికి రాయబారి నీజె నాయకులు.

ఈ వుభయపక్షాల నిపుణుల బృందం మూడురోజులు దివారాత్రాలు కృషిచేసింది. జెనీవాలోని సోవియట్, అమెరికన్ ప్రతినిధి వర్గాలకోసం అంగీకృత ఆదేశాల ముసాయిదాను తయారుచేసే పనిని యీ బృందాలకు అప్పగించడం జరిగింది. ఎ. బి. ఎం సంధికి అనుగుణంగా, యీ సంధినుండి అంగీకృత కాలం వరకూ వుపసంహరించుకోకుండా

వుండే ప్రాతిపదికపై వ్యూహాత్మకదాడి ఆయుధాల తగ్గింపు, పరిమితుల గురించిన ఒప్పందాన్ని యీ ముసాయిదా ఆధారంగా జెనీవాలోని ప్రతినిధివర్గాలు రూపొందించాల్సి వుంది. 1988 ప్రథమార్థంలో అమెరికా అధ్యక్షుని మాస్కో సందర్శన నాటికి యీ సంధిపై సంతకాలు చేయడానికి వీలుగా దీన్ని సిద్ధంచేయాల్సివుంది.

ఫలితంగా మేము ముఖ్యమైన దాన్ని సాధించాం. యీ పదాన్ని నేను యెందుకు వాడుతున్నానంటే అదే సరియైన పదం. యీ పదాన్ని నేను బాగా ఆలోచించే వాడాను. యీ అంశంలో మేము గణనీయమైన ప్రగతిని సాధించాం. యీ అంశం సోవియట్ యూనియన్‌కూ, అమెరికాకూ, యితర దేశాలకూ ప్రధానమైనది.

సోవియట్ యూనియన్, అమెరికాల వ్యూహాత్మకదాడి ఆయుధాలను సగానికి సగం తగ్గించే అంగీకారం వాషింగ్టన్ సమావేశానికి పూర్వమే కుదిరిన విషయం గుర్తుచేయాల్సి వుంది. యిందుకు 1600 వ్యూహాత్మక వాహకాలపై 6,000 అణుశీర్షాల పరిమితిని నిర్దేశించడం జరిగింది. భారీమిసిలీల వుపస్థాయిలు, భారీబాంబర్లను లెక్కించడానికి నియమాలు తదితరాలను గురించి అంతకుముందు అంగీకారం కుదిరింది.

వాషింగ్టన్‌లో జరిగిన కృషి అనంతరం యీ అంగీకారాలకు అదనంగా యెంతో చేర్చడం జరిగింది. అది పూర్తిగా కొత్తదే. ఎట్టకేలకు దీర్ఘశ్రేణి సముద్ర స్థిత క్రూయిజ్ మిసిలీల మోహరింపును పరిమితం చేసే సమస్యకు మేము పరిష్కారం కనుగొన్నాం. అలాంటి మిసిలీలకు 6000 అణుశీర్షాల మేరకు గరిష్ఠ పరిమితి విధించడానికి, ఆ పరిమితులను మించివున్న వాటి విషయంలో తనిఖీకి పరస్పర ఆమోదయోగ్యమైన, సమర్థమైన పద్ధతులకోసం అన్వేషణ జరపడానికి అమెరికన్ పక్షం అంగీకరించింది.

తనిఖీకి సంబంధించి మేము తెలుపుకున్న అభిప్రాయాలు ఆసక్తికరమైనవి. వివిధ యుద్ధ నౌకలను—అవి సముద్ర వుపరితలంపై తిరిగేవి కావచ్చు, జలాంతర్గాములైనా కావచ్చు —ప్రత్యక్షంగా తనిఖీ చేయకుండానే వాటిపై అణ్వాయుధాలున్నదీ లేనిదీ కనుగొనగల జాతీయ సాధనాలను సృష్టించేందుకు యీ రంగంలో మా శాస్త్ర సాంకేతిజ్ఞతలు సాధించిన సానుకూల విజయాలను వినియోగించుకోవచ్చును.

అధ్యక్షుడూ, ఆయన సన్నిహితులూ యిందుకు అంగీకరిస్తున్నారో లేదో నాకు తెలీదుకాని యీ విషయంపై మనం అంగీకారానికివస్తే మేం సాధించిన విజయాలను పరస్పరం పంచుకోవచ్చునని మేం సూచించాం. ఈ సాధనాలద్వారా నావలపై ఆయుధాలున్న విషయాలను గుర్తించడమేకాక ఆ ఆయుధాలు యెంత శక్తివంతమైనవో కూడా కనుగొనవచ్చుననే విషయం మా భాగస్వాములు స్వయంగా తెలుసుకోగల్గుతారు. సముద్రస్థిత క్రూయిజ్ మిసిలీల మొత్తం సమస్యను పరిష్కరించడానికి యీ సమస్య, అంటే తనిఖీసమస్య అత్యంత క్లిష్టమైన అవరోధంగావుంది.

సందర్భవశాత్తు శాస్త్ర, సాంకేతిక విజయాల గురించి ఒక మాట. యీ సమస్యల

పరిష్కారంలో మన శాస్త్రజ్ఞులను కలుపుక రావడం చాలా ముఖ్యమని అధ్యక్షునితో నేను అన్నాను. యెందుకంటే వారు నిజంగా నిపుణ అంచనాలను యివ్వగలరు; వాస్తవిక మైన సిఫారసులను చేయగలరు. సోవియట్, అమెరికా శాస్త్రజ్ఞుల కమిటీని యేర్పాటు చేయాలని నేను సూచించాను. అమెరికా ప్రభుత్వానికి, సోవియట్ నాయకత్వానికి వారు తమ అభిప్రాయాలను, సిఫారసులను సమర్పించవీలుంటుంది.

ఇక సంప్రతింపుల ఫలితాలకు వద్దాం. తనిఖీ సమస్యలపై సవివరమైన విశదీకరణ జరిగింది. ఐ. ఎస్. ఎఫ్ సంధిని రూపొం దించడంలో ఫలప్రదమైన కృషివల్ల యీ రంగంలో పరస్పర అవగాహనకు వీలేర్పడింది.

పరిమితులను నిర్దేశించడం జరిగింది. మొత్తం 6000 అణు శీర్షాల పరిమితిలోనే ఐ. సి. బి. ఎం, ఎస్. ఎల్. బి ఎంలపై వుండాల్సిన అణుశీర్షాల మొత్తం సంఖ్య 4900. ఇది కొత్త విషయం, చాలా గణ నీయమైన విషయం అని మీకు తెలుస్తూనే వుంది.

వ్యూహాత్మకదాడి ఆయుధాల సంధి తయా రీని హృదయ పూర్వకంగా వుభయులం కోరుకుంటూనే, 1972 లో సంతకం చేసిన ఎ. బి. ఎం సంధిని వున్నదున్నట్టు సోవియట్, అమెరికా పక్షాలు పాటించే విధంగా ఒక ఒప్పందాన్ని రూపొందిం చాలని జెనివాలోని ప్రతినిధి వర్గాలను అధ్యక్షులూ, నేను ఆదేశించాం. అందులో ఎ. బి. ఎం సంధి కింద అనుమతించిన పరిశోధన, అభివృద్ధి. అవసరమైనపుడు పరీక్షలు జరుపునే క్రమాలు చేరివుంటాయి: పరస్పరం అంగీకరించిన కాలంవరకూ ఆ సంధినుండి వుపసహరించుకునే వీలుండదు. మా సంయుక్త ప్రకటనలో దీన్ని పేర్కొ న్నాము. వ్యూహాత్మక స్థిరత్వ సమస్యపై ముమ్మర చర్చను కొనసాగించాలని మేము అంగీకరించాం.

ఎ. బి. ఎం సంధినుంచి వుపసంహ రించుకోరాదని నిర్దేశించుకున్న అంగీకృత కాలవ్యవధిలోగా ఒక ఒప్పందానికిరావడంలో సోవియట్ యూనియన్ అమెరికా గనక విఫలమైనట్లయితే, ఆ కాలవ్యవధి ముగిసిన అనంతరం ప్రతిఒక్క పక్షానికి తన కార్యా చరణ పద్ధతిని నిర్ధారించుకునే హక్కు వుంటుందనికూడా నిర్వచించడం జరిగింది.

అత్యంత ముఖ్యమైన, అత్యంత జటిల మైన అణు అంతరిక్ష ఆయుధాల సమస్య విషయంలో మేము యెంతో ముందుకు సాగాం. కాపీ వ్యూహాత్మకదాడి ఆయుధాల తగ్గింపు సంధిని కొద్దినెలల్లోనే తయారు చేయాలంటే జెనీవాలోని మన ప్రతినిధి వర్గాలు యెంతో కృషిచేయాల్సివుంటుంది. ప్రతినిధి వర్గాలేకాదు, సోవియట్ యూని యన్, అమెరికా నాయకత్వాలుకూడా యెంతో కృషిచేయాల్సివుంటుంది.

నాల్గవది: మధ్యశ్రేణి, స్వల్పశ్రేణిమిసిలీల నిర్మూలనపై మేము యేకీభావానికి వచ్చి నపుడూ, వ్యూహాత్మకదాడి ఆయుధాల తగ్గింపు సమస్యను చర్చించినపుడూ సాంప్రదాయక ఆయుధాల, రసాయనిక ఆయుధాల సమస్యలు తారట్లాడుతూ వుండినాయి.

అవి చాలా తీవ్రమై ముందుపేటికి వచ్చాయి. పరిస్థితిని నాటకీయం చేయడం మా వుద్దేశంకాదు. ఆ అంశంపై వూహాగానానికి జరిగే ప్రయత్నాలను మేము ఖండిస్తాం. నా వ్యాఖ్య బాగా నాటుకోవాలని దీన్ని నేను నొక్కి చెప్పదలచుకున్నాను. బహుశా మీరు దీన్నిగురించి ఆలోచిస్తారను కుంటున్నాను

సాంప్రదాయక ఆయుధాల సమస్యలపై వెల్లడించే నిజమైన ఆందోళనలు కొన్ని వున్నాయి. మాకూ, పాశ్చాత్య యూరపియన్లకూ యీ ఆందోళనలు వున్నాయి. అందువల్లయీ రకాల ఆయుధాలపై యిప్పటి నుండే యెంతో శ్రద్ధను కేంద్రీకరించ దలిచాం. ఐ. ఎన్. ఎఫ్. సంధి రూప కల్పనలో గడించిన మంచి అనుభవం యిప్పుడు మాకు వుంది. ఆ సంధిని రూపొం దించడంలో యెదురైన ఎగుడుదిగుళ్ళు యిక్కడ వున్నవాళ్ళు చెప్పగలరు. ఫ్రాన్స్, బ్రిటన్ అణ్వాయుధ శక్తిస్తోమతల సమస్యను, స్వల్పశ్రేణి మిసిలీలకు సంబంధించిన సమస్యను, ఆసియాలో మొహరించిన మిసిలీల సమస్యను, యిలాంటి యితర సమస్యలను గురించి చెప్పగలరు.

ఏదేమైనప్పటికీ, సర్దుబాటుచేసుకోడానికి వుభయులలో గల సంసిద్ధత యీ సంధి కుదుర్చుకోడానికి వీలుకల్పించింది.

దీని నుండి ఒక చిన్న నిర్ధారణకు రావచ్చు: సాంప్రదాయక ఆయుధాలకు సంబంధించిన సమస్యలపట్ల మనం వ్యవహరించాల్సిన తీరుకూడా యిదే. తీవ్ర సమస్యలను పరిష్కరించడానికి, నిజంగా వున్న ఆందోళనలను తొలగించడానికి పద్ధతి యిదే ఉదాహరణకు వార్సాసంధి దేశాలకు ఆధిక్యత వుందని పాశ్చాత్యదేశాలు నొక్కి చెపుతున్నాయి, కాగా యీ విషయంలో నాటోకు, పశ్చిమ యూరపియన్లకు తమపై ఆధిక్యత వుందని తూర్పు యూరప్ దేశాల వారంటున్నారు.

ఒక విధంగా రెండు పక్షాలు చెప్పేదీ నిజమేనని నేనంటాను. ప్రస్తుతమున్న సమాచారాన్ని ఆధారం చేసుకుని వారావిధంగా వాదిస్తున్నారు. యీ సమాచారం ఒక వాస్తవాన్ని ధ్రువీకరిస్తోంది. నిజంగానే అసంతులనం, అసమతూకం రూపుగొని వున్నాయి: సాయుధ బలగాలను పెంపొందించుకోవడంలో చారిత్రక విశిష్టలక్షణాల ఫలితంగా యిది రూపుగొన్నది.

ఈ విషయమై సంప్రతింపులకు ఆదేశమిచ్చే నిమిత్తం వియన్నాలో ప్రస్తుతం జరుగుతున్న కృషిని త్వరగా పూర్తిచేయడం అవసరమని మేం భావిస్తున్నాం.

తక్షణసమస్యలకు పరిష్కారాలను అన్వేషించడానికి మనం సమావేశం కావాలి. పరస్పరం, యేకకాలంలో ఆయుధాల తగ్గింపు గురించి, అసమతూకాల, అసంతులనాల తొలగింపును గురించి మాట్లాడుకో గలిగు నే సంప్రతింపులు అర్థవంతంగా వుంటాయి. సమస్యలన్నిటినీ ఆ వైఖరితోనే మనం తప్పకుండా పరిష్కరించుకో గలుగుతాం.

ఉదాహరణకు మధ్య యూరప్‌లో వార్సా సంధి దేశాలకు ఆధిక్యత వుందని కొందరు అంటున్నారు. యిలా చెపుతున్నవారు సోవియట్ యూనియన్ సరిహద్దుల సమీపంలో,

దక్షిణాది యూరప్ పార్శ్వంలో నాటోకు గల గణనీయమైన ఆధిక్యతను గురించి యేకారణాలవల్లనో గప్‌చుప్‌గా దాట వేస్తున్నారు.

ఆయుధాలు, ముఖ్యంగా దాడి స్వభావం గల ఆయుధాలు పరిమితంగా వుండేట్టు నాటో, వార్సాసంధి దేశాలమధ్య ఒక నడవను సృష్టించే విషయాన్ని చర్చించడం అవసరమని మా అభిప్రాయం.

చాలినమేరకు ఆయుధాలు అనే సూత్రాన్ని గురించి కూడా ఆలోచించాలి. ముఖ్యంగా సైనిక సిద్ధాంతాలను కేవలం ఆత్మరక్షణ స్వభావంగలవిగా మార్పుచేసేందుకు వాటిని పోల్చిచూసుకోవాలి.

మా ప్రతిపాదనను అమెరికాపక్షం గంభీర చిత్తంతో పరిగణనలోకి తీసుకుందనీ, ఆసక్తిని వ్యక్తంచేసిందనీ నేను చెప్పాల్సి వుంది. ఈ సమస్యను ప్రత్యక్షంగా, నిర్దిష్టమైన పద్ధతుల్లో, మన సైనిక వ్యవస్థల స్థాయిల్లో, పండితుల, నిపుణుల భాగస్వామ్యంతో పరిశీలించడానికి మేం అంగీకరించాం.

క్లుప్తంగా చెప్పాలంటే సాంప్రదాయిక ఆయుధాలకు, సాయుధబలగాలకు సంబంధించి మనం ఒక నూతన రాజకీయ వూతమివ్వాలని యిక్కడ, వాషింగ్టన్‌లో అధ్యక్షునికి సూచించాను. అణ్వస్త్ర విసర్జన గురించి జెనీవా సంప్రతింపులు దాదాపు ప్రతిష్టంభనలో పడిపోయినపుడు రక్యావిక్‌లో యిచ్చిన వూతం లాంటిది సాంప్రదాయిక ఆయుధాల విషయంలో యిప్పుడు యివ్వాలని సూచించాను. నాడు ఆ వూతం సత్ఫలితాన్నిచ్చినందువల్లనే అణ్వాయుధాల నిర్మూలన గురించిన తొలి సంధి యిపుడు మనకు లభ్యమైంది.

సాంప్రదాయిక ఆయుధాలపట్ల యీనాడు అదే వైఖరిని మనం తీసుకోవచ్చు. మనం వ్యవహరించాల్సిన తీరు అదేనని నా అభిప్రాయం. మనం సంప్రతింపులకోసం సమావేశం కావాలి. సమావేశానికి మన ప్రతిపాదనలను సమర్పించాలి. బదలాయింపులన్నిటినీ పక్కన బెట్టాలి. యెవరు మోసగించ జూస్తున్నారో. యెవరు చిత్తశుద్ధితో కృషి చేస్తున్నారో దానివల్ల తప్పకుండా బయట పడుతుంది. మొహరించివున్నది, నిల్వలో వున్నదీ యెంత అనేదేకాక అవి యెక్కడ వున్నవీ అనే విషయం అమెరికన్లకూ, పశ్చిమ యూరపియన్లకూ, మాకూ, బంధుదేశాలకూ బాగా తెలుసు. చర్చల్లోని మా పాశ్చాత్య భాగస్వాములకూ, మాకూ యిది తెలియడం మంచి విషయమనే నేను నమ్ముతున్నాను.

మన ప్రతిపాదనలను సమావేశానికి సమర్పించాలి. తత్సంబంధమైన సమాచారాన్ని పరస్పరం మార్పిడిచేసుకోవాలి, ఆ సమాచారాన్ని పరిశీలించాలి; ఆయుధాల్లో, ఆయుధ బలగాల్లోగల అసంతులనాన్ని కనుగొనాలి. పరిష్కారాల అన్వేషణకు పూనుకోవాలి. యిదీ మా వైఖరి.

మాకు సంబంధించినంతవరకు సూటిగా చెపుతున్నాను. యేమాత్రం జాప్యంలేకుండా ఆకర్తవ్యనిర్వహణకు సర్దుబాటు చేసుకోవడానికి మేము సిద్ధంగావున్నాం. అది జరగాలని పట్టుపడుతాం. మా బంధుదేశాల అభిప్రాయం కూడా యిదే. అందువల్ల యీ అంశంపై మా వుమ్మడి అభిప్రాయాన్ని నేను వ్యక్తం చేస్తున్నాను.

అంతేకాదు, అత్యంత తీవ్రతగ్గింపులకు మేము సిద్ధంగావున్నాం.

ఈ విషయంలోకూడా మేము వాస్తవిక వాదులుగా వుండడానికే ప్రయత్నిస్తున్నాం. బహుశ, యిది కొన్ని దశలగుండా సాగాల్సిన క్రమం. ప్రతిఒక్క సమస్యనూ తక్షణమే పరిష్కరించలేము. అయితే సంప్రదింపులకు పూనుకోవడంద్వారా ఆ కృషిని ప్రారంభించాలి: తలపాటును బాగా తగ్గించే నిమిత్తం అసమతూకాలను, అసౌష్టవాలను నిర్మూలించే కృషిని ప్రారంభించాలి. అది గణనీయమైన విజయమౌతుంది. అది అద్యతన భావిలోనే లభిస్తుంది.

వేరుమాటల్లో చెప్పాలంటే సాంప్రదాయిక ఆయుధాల విషయంలో ప్రతిఒక్క పక్షపు ఆందోళనలను మనం జుణ్ణంగా పరిశీలించాలి.

అధ్యక్షునితో జరిపిన సంభాషణల్లో రసాయనిక ఆయుధాల గురించికూడా యిదే సరళిలో చర్చించాం. వాటి నిర్మూలనకూడా ముఖ్యమైన విషయమేనన్నది సుస్పష్టం. యీ సమస్య చాలాకాలంగా చర్చల్లో నలుగుతున్నది. ఉభయపక్షాల నిర్మాణాత్మక సహకారంవల్ల యీ సమస్యపై చర్చలు యిటీవలే కొంత పురోగమించాయి.

బ్రిటన్, జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్, కొన్ని యితర పశ్చిమ యూరపియన్ దేశాలు యీ సమస్య పరిష్కారానికి చేసిన దోహదాన్ని శ్రీమతి థాచర్‌తో జరిపిన చర్చల్లోనూ, యిక్కడ అమెరికా అధ్యక్షునితో జరిపిన చర్చల్లోనూ పేర్కొనడం సముచితమని నేను భావించాను. యిదికూడా మాకు పూతమిచ్చిందని నేను చెప్పదలుస్తున్నాను. సోవియట్ యూనియన్ నిర్మాణాత్మక పద్ధతిలో వ్యవహరించింది. ముఖ్యంగా రసాయనిక ఆయుధాల నిల్వల తనిఖీ, వాటి నిర్మూలన సమస్యలపై నిర్మాణాత్మకంగా వ్యవహరించింది. రసాయనిక ఆయుధాల వుత్పత్తిని మేము నిలిపివేసిన విషయాన్ని నేను మరోసారి మీకు గుర్తుచేయదలిచాను.

అమెరికా నుండి కూడా సానుకూల ప్రకటన ఒకటి వెలువడింది. కానీ యీ ఒప్పందాన్ని రూపొందించే దిశలో కదలిక క్రమం యిటీవల మందగించినట్లు విదితమైంది. యీ విషయాన్నే అధ్యక్షునితో, అమెరికా పక్షాన సంప్రతింపుల్లో పాల్గొన్న యితరులతో మేము ముక్కుసూటిగా, నిర్మొహమాటంగా చెప్పాం. అమెరికా తప్పిదంవల్లే యీ క్రమం మందగించిందని మా అభిప్రాయం. రసాయనిక ఆయుధాల సార్వత్రిక, సంపూర్ణ నిషేధం గురించి జెనీవాలో అంగీకరించిన లక్ష్యంనుండి అమెరికా వైదొలగ దలుస్తోందనీ, బైనరీ రకపు రసాయనిక ఆయుధాల విషయం యిందులో చేర్చకుండా పక్కన పెట్టాలని భావిస్తోందనీ మాకు అనుభూతమైంది. కొన్ని కాలీ జాగాలున్నప్పటికీ ఒప్పందంపై సంతకాలు చేయడానికి మేం సిద్ధపడినా, తనిఖీలనేవి కేవలం ప్రభుత్వ యాజమాన్యంలో వున్నవాటికే పరిమితం కావాలని అమెరికా వాదిస్తోంది. దీనర్థమేమిటి? సోవియట్ యూనియన్‌లో వున్న మొత్తం ఆయుధాలకు యిదివర్తిస్తుంది. కాని అమెరికా, పశ్చిమ యూరప్‌లోని ఆయుధాలలో దాదాపు దేనికీ వర్తించదు. యిది యెలాంటి న్యాయమైన వైఖరి? ఆందోళనలను పట్టించుకోవడం

అంటే యిదేనా? యెలాంటి భాగస్వామ్య మిది?

సోవియట్ యూనియన్ తనకు యెలాంటి యేకపక్ష అధిక్యతలను కోరుకోవడం లేదని అమెరికా ప్రభుత్వం, మొత్తం పశ్చిమ యూరపియన్ ప్రభుత్వాలు, సంప్రతింపుల్లో పాల్గొనేవారంతా అర్థం చేసుకోవాలి. నిరాయుధీకరణ క్రమంలో అన్ని దిశల్లో సాగడానికి అది సిద్ధంగావుంది. ప్రతి ఒక్క దశలో సమతూకం, సంతులనం వుండాలని కోరుతోంది. నిరాయుధీకరణ యిలా అమలు జరగాలని మేము పట్టుబడుతాం. యేపక్షానికైనా నమ్మకం లేకపోతే, తనను అవతలి పక్షం అధిగమించి పోతున్నదని అభిప్రాయమేర్పడితే అది నిరాయుధీకరణ క్రమాన్ని పీరుగారుస్తుంది, అధైర్యాన్ని, అవిశ్వతతను నాటుతుంది, సంప్రతింపుల వాతావరణాన్ని చిక్కుల పాల్జేస్తుంది.

దీన్ని అమెరికా పక్షం దృష్టికి తెచ్చాం. ఆ అసమతూకాలను సరిచేయవచ్చునని ప్రతిపాదించాం. యీ అభిప్రాయాన్ని మన సంయుక్త ప్రకటనలో నమోదుచేయవచ్చునని సూచించాం. రసాయనిక ఆయుధాలపై మా చర్చలు సంక్లిష్టతతో సాగినప్పటికీ, ఒక ఒప్పందాన్ని రూపొందించడానికి పక్షాలు మరింత క్రియాశీల, ముమ్మరచర్చలు జరపాలని యెట్టకేలకు మేము అంగీకారానికి రాగలిగాం.

యెంతో ముఖ్యమైన యీ సమస్య పరిష్కారానికి పూనుకోవాలని అధ్యక్షులూ నేనూ గట్టిగా నిర్ణయించుకున్నాం. రసాయనిక ఆయుధాలను వినియోగించకుండా, వ్యాప్తి చేయకుండా వుంచాలనే సమస్యపై చురుకుగా చర్చలను కొనసాగించాలని మా నిపుణులకు ఆదేశాలిచ్చాం.

ఇక మరోసమస్య, అది సర్వదా ముఖ్యమైనదిగానే వుంటూ వచ్చింది. ఐ.ఎన్.ఎఫ్ సంధిపై సంతకాలు జరిగిన తర్వాత, వ్యూహాత్మకదాడి ఆయుధాలను తగ్గించుకొనే విషయంలో సాధించిన పురోగతివల్ల యిప్పుడు అది మరీ తక్షణ సమస్య అయింది అది అణుపరీక్షల నిలిపివేతకు సంబంధించిన సమస్య. ఆ సమస్యపై అమెరికాతో మేము సంప్రతింపులను ప్రారంభించిన విషయం మీకు తెలుసు. ఈ మారిన పరిస్థితులలో యీ క్రమాన్ని గురించీ యీ సంభాషణలనుగురించీ, దాని సారాన్నిగురించీ తాజా దృక్పథాన్ని అవలంబించడం అనేది యెంతగానో అభిలషణీయమవుతుందనీ, మన రెండు దేశాలలోనూ, ప్రపంచమంతటానూ కూడా దీన్ని సక్రమంగా అవగాహన పర్చుకోవడం, తగిన విధంగా హర్షించడం జరుగుతుందనీ అధ్యక్షునికి మేం యీ సమస్య విషయంలో ప్రతిపాదించాం.

అణుపేలుళ్ళ పాటవశక్తినితగ్గించేందుకు, అణుపేలుళ్ళ సంఖ్యను తిరుగులేని విధంగా తగ్గించేందుకు అద్యతనభావిలోనే ఒక అంగీకారానికి రావడం అభిలషనీయమని మేము అన్నాం. మనం యెలాంటి జాప్యంలేకుండా ముందుకుసాగడానికి సాధ్యమైనంత త్వరలో తీసుకోవాల్సిన కనీస చర్య యిది.

అణుపరీక్షల విలుపుదల విషయమై సంభాషణలు జరుపుతూనే ప్రపంచ ప్రజల డిమాండ్లను పరిగణనలోకి తీసుకుని, వాటిని గౌరవించి అణుపరీక్షలపై పరస్పర మార

టోరియం నెలకొల్పడం యిప్పుడు సాధ్యమూ, సముచితమూ అని మేము భావిస్తున్నాం. యెంతో ముఖ్యమైన యీ సమస్యపై, ప్రపంచ మంతటా ఆందోళన కల్గిస్తున్న యీ సమస్యపై యింతవరకూ మా భాగస్వాములు మాతో ఒక అవగాహనకు రాకపోవడం దురదృష్టకరం.

మనం నిరాయుధీకరణ క్రమాన్ని ప్రారంభించామంటే అర్థం దానికి సంబంధించిన యే సమస్యనైనా పరిశీలించాల్సి వుంటుంది, ఆలోచించాల్సి వుంటుంది తదనుగుణంగా నడుచుకోవాల్సి వుంటుంది. సంభాషణలు జరుగుతుండగానే అణుపరీక్షలపై పరస్పర మారటోరియాన్ని ప్రవేశపెట్టుకుందామని అమెరికా ప్రభుత్వానికి మేం అందజేసిన చాలా ముఖ్యమైన ఆహ్వానాన్ని అమెరికా గంభీరంగా పరిశీలిస్తుందనే జాగ్రత్తగా మదింపువేస్తుందనే ఆశాభావాన్ని ఆ కారణంచేతనే మేమింకా కోల్పోలేదు. అమెరికా ప్రభుత్వం బహుశా యీ విషయంలో ప్రజల్ని సంప్రతించదలచుకున్నదేమో. అమెరికా ప్రజాస్వామ్య దేశమని చెబుతుంటారు: ఈ సమస్యపై ప్రజల్ని సంప్రతించడం సముచితమే. అనంతరం మా ప్రతిపాదనకు సానుకూలంగా ప్రతిస్పందించవచ్చు. మేమేమీ నిరాశ చెందడం లేదు.

ఇక సంప్రతింపులకు సంబంధించిన పైనిక పార్శ్వాలను గురించి యింకా నేను చెప్పదలుస్తున్నదేమిటి? తనిఖీ సమస్యపై ప్రధానమైన, అత్యంత ముఖ్యమైన ముందంజను సాధించామని నేను చెప్పదలుస్తున్నాను. ఈ ఐ. ఎన్. ఎఫ్ సంధి మునుపెన్నడూ లేనంత బాహాటతా, గ్లాస్నోస్త్ ప్రమాణాలను నెలకొల్పుతుందని నేను చెప్పగలను. పరస్పర తనిఖీ, అజమాయిషీల పరిధీ, ప్రగాఢతా అపూర్వమైనది. మేము పదేపదే ముందుంచిన వైఖరి ధ్రువపడింది. నిరాయుధీకరణను తనిఖీ చేసేటప్పుడు యిది సాధ్యమైనంత కచ్చితంగా, సాధ్యమైనంత ఫలదాయకమైన అజమాయిషీగా వుండాలని చాలా దృఢంగా దీన్ని మేము సమర్థిస్తాం. యెందుకంటే తనిఖీలగురించి కబుర్లు చెపుతూ ఆ కబుర్ల ముసుగులో ఆయుధ పోటీ కొనసాగితే అలాంటి తనిఖీకి అర్థమేముంటుంది? క్లుప్తంగా చెప్పాలంటే నిరాయుధీకరణకోసం తనిఖీ అయితే, ఆయుధాల నిర్మూలనకోసం తనిఖీ అయితే వాటి విషయంలో మేము యెలాంటి తనిఖీకి అయినా, అత్యంత కఠినమైన తనిఖీకి అయినా సుముఖమే. అయితే పారస్పర్యత సూత్రాన్ని పాటించితీరాలి. వ్యూహాత్మక దాడి ఆయుధాలకు సంబంధించిన సమస్యల పరిష్కారాన్ని మనం చేపడుతున్న యీ సమయంలో రసాయనిక ఆయుధాల నిర్మూలన సమస్యలను మనం చేపడుతున్న యీ సమయంలో, యిది మరింతటి ప్రాముఖ్యతను సంతరించుకుంది.

దీంతోపాటు, మనకు యిదివరకే అనుభవంవుంది, మనం మరింత విశ్వాసంతో వున్నాం. ఇతర సమస్యల మొత్తం పరిధికి సంబంధించికూడా అధ్యక్షునితో మేము అభిప్రాయాలను మార్పిడి చేసుకున్నాం: అవి ప్రాంతీయ, మానవీయ సమస్యలు. ప్రాంతీయ సమస్యల పరిశీలన యేమంత సులభంకాదు. మేము యిక్కడికి యెంతో

గంభీరమైన వుద్దేశాలతో వచ్చాం. అత్యంత తీవ్రసమస్యలపై నిజంగా అంగీకారంకోసం ప్రతిపాదనలతో వచ్చాం. ఈ కింది దృక్పథం ప్రాతిపదికగా, ప్రాంతీయ ఘర్షణల పరిష్కారానికి మనవుమ్మడివై ఖరివిగురించి పరిశీలించాల్సిన అవసరాన్ని దృష్టికి తెచ్చాం: ప్రస్తుత ప్రాంతీయ ఘర్షణలను రాజకీయ పద్ధతుల్లో పరిష్కరించడానికి ప్రపంచ కుటుంబం చేస్తున్న నిర్వివాదకృషిని మనం చూస్తున్నాం. ఇదంతా అనేక రాజకీయ వర్గాల, ప్రభుత్వాల వైఖరుల్లో, ప్రపంచ ప్రజానీకం కార్యాచరణల్లో సుస్పష్టంగా కనిపిస్తోంది. ఇదంతా పూర్తిగా నిజం.

ఇది సోవియట్ యూనియన్‌కు, అమెరికాకు ఒక అవకాశాన్నిస్తుంది. ప్రపంచ రాజకీయాల్లోని అత్యంత తీవ్ర సమస్యల పరిష్కారం అనేది యీ రెండుదేశాలపై యెంతగానో ఆధారపడి వున్నది. ఆ విధంగా పరిష్కరించేందుకు నిజంగా యెంతో కొంత కృషి చేయడానికి యిది ఒక అవకాశాన్నిస్తుంది.

ఈ విషయంలో మనం అలాంటి ప్రగతి సాధించామని నేను చెప్పలేను. అయినప్పటికీ అమెరికా ప్రభుత్వం ఒక విధంగా మరింత వాస్తవికతతో ప్రాంతీయ సమస్యలను అవగతం చేసుకోవడం ప్రారంభించిందని నేనూ, మా ప్రతినిధి వర్గ సభ్యులమూ భావిస్తున్నాం.

ఈ విషయంలో నిజంగా నూతన వైఖరులు అవసరం. అన్ని దేశాలకు తమ సొంత యెంపికను చేసుకునే హక్కువుంటుందని మేమూ, అమెరికన్లు, యితర దేశాలు బేషరతుగా గుర్తించడం అత్యంత ముఖ్యం. అది ముందుకు సాగడానికి ముఖ్యాంశం.

మానవహక్కుల సమస్యను, మానవీయ సమస్యను ప్రాంతీయ పరిష్కారాలనుండి వేరుగావుంచలేము. భద్రతా హక్కు, జీవించే హక్కు, తాము వుచితమైందని భావించిన రీతిలో జాతీయ సమస్యలను పరిష్కరించుకొనే హక్కు—వీటికన్నా వుత్తమమైనదేముంటుంది? ఒక దేశవిశ్వసనీయ భద్రత కన్నామించింది, ప్రజాతంత్ర రూపాలకు, అత్యంత అనుగుణమైనది వేరేయేది వుండగలదు?

క్లుప్తంగాచెప్పాలంటే యిదంతా పరస్పరంగా పెనవేసుకుని వుంటుంది. ఈ వైఖరుల నుంచీనే ఆఫ్గనిస్తాన్‌లోని పరిస్థితిని మేం అవగతం చేసుకున్నాం. ఆదేశంలో జరుగుతున్న రక్తపాతానికి స్వస్తిచెప్పడానికి, అది పునరావృతమయే అవకాశాలు లేకుండా చేయడానికి, ప్రపంచ సమాజప్రయోజనాలపై తీవ్ర పర్యవసానాలు కల్గించే పరిస్థితి రాజకీయ పరిష్కారక్రమంలో వుద్భవించకుండా నిరోధించడానికి వీలుకల్పించే పరిష్కారానికి మేము సుముఖం.

ఆఫ్గనిస్తాన్‌లో సోవియట్ అనుకూల ప్రభుత్వాన్ని మేంకోరుకోవడంలేదు,అందుకు ప్రయత్నించడంలేదు అని మేము నిర్మొహమాటంగా చెప్పాం. కానీ అక్కడ అమెరికా అనుకూల ప్రభుత్వంకోసం ప్రయత్నించడం లేదని అమెరికాపక్షం అదే విధంగా స్పష్టంగా ప్రకటించాలి. స్వేచ్ఛాయుత, అలీన, తటస్థ ఆఫ్గనిస్తాన్‌లో సామరస్యం ప్రాతిపదికపై: మొత్తం రాజకీయ వాస్తవికతలను, సహకారాన్ని పరిగణనలోకి తీసుకొనే ప్రాతి

పదికపై, వివిధ శక్తుల ఐక్య సంఘటన ప్రాతిపదికపై, వాటి జాతీయ సామరస్యం ప్రాతిపదికపై అక్కడ ప్రభుత్వంయేర్పడాలి. ఈ విషయంలో మన రెండు దేశాలు చేయగలిగింది యెంతో వుంది.

ఆఫ్గనిస్తాన్‌కు సంబంధించి మేము ప్రశ్నను యీ కింది విధంగా వుంచుతున్నాం: సైన్యాలను వుపసంహరించాలని రాజకీయ నిర్ణయం చేశాం. 12 నెలల కాలవ్యవధినికూడా మేము పేర్కొన్నాం. ఆ వ్యవధిని యింకా తగ్గించవచ్చు. కార్డొవెజ్ కమిషన్ ఆధ్వర్యాన పరిష్కారానికై వేచివున్న నాల్గవ అంశం అది. సైన్యాల వుపసంహరణ ప్రారంభమూ, దుష్మన్లకు ఆయుధాలు, డబ్బు సహాయం నిలిపివేతా ఒకే సమయంలోజరిగాలని మా దృఢాభిప్రాయం. దీనికి అంగీకరించినట్టు ప్రకటించిన మొదటిరోజునుంచే మాసైన్యాల వుపసంహరణ ప్రారంభమౌతుంది. ఆత్మ రక్షణకు తప్ప మా సైన్యాలు సైనిక చర్యల్లో పాల్గొనవు. శత్రుత్వాలు అంతరిస్తాయి. రాజకీయ పరిష్కారక్రమం ప్రారంభమౌతుంది. మా పలుకుబడి మేరకు యీ విషయంలో సహాయపడుతాం. కానీ ఆఫ్గనిస్తాన్ లోపలగల నిజమైన శక్తులూ, తత్సంబంధిత అన్ని పక్షాలూ—యివే ప్రధాన కృషిని చేయాల్సి వుంది.

ఇదంతా రాజకీయ పరిష్కారక్రమాన్ని సుగమంచేసే నిజమైన పత్రాన్ని సమకూర్చుతుందని అనిపిస్తోంది. ఈ దిశలో కృషి కొనసాగించాలని మేము అంగీకరించాం.

మధ్యఅమెరికా, మధ్యప్రాచ్యం, దక్షిణాది ఆఫ్రికాలలోని ప్రాంతీయఘర్షణలు,పర్షియన్ సింధుశాఖలోని పరిస్థితి వగైరాలపై వాషింగ్టన్ సంభాషణల్లో మేము చర్చించాం.

ఇక సోవియట్, అమెరికా ద్వైపాక్షిక సంబంధాల గురించి, సోవియట్ వైఖరి యిదీ: సోవియట్ యూనియన్, అమెరికాలు ప్రధాన ఆర్థిక, మేధా, సైనిక శక్తిసామర్థ్యాలుగల శక్తివంతమైన ప్రపంచ దేశాలు. అంతర్జాతీయ వ్యవహారాల్లో వాటి పలుకుబడి అపారం. వాటి పాత్రను నిర్ధారించేది యిదే, వాటి బాధ్యతను నిర్ధారించేది యిదే.

అనేక సంవత్సరాల తలపాటు, తీవ్ర పోటా పోటీలవల్ల హాని తప్ప యేవిధమైన వుపయోగమూ లేకపోయింది. ఒకరితో ఒకరికి ప్రమేయం లేకుండా, వాణిజ్యం లేకుండా, విస్తృతస్థాయి శాస్త్ర, సాంస్కృతిక సంబంధాలు లేకుండా, ప్రపంచ సమస్యల పరిష్కారంకోసం సహకరించుకోకుండా మనం మనుగడ సాగించగలమని తగినంతగా యిప్పటికే రుజువుచేసుకున్నాం. కానీ యీ ప్రశ్న వుదయిస్తోంది: మనం రుజువుచేసుకోవాల్సింది యిదేనా? యిది సిసీఫస్ వ్యర్థశ్రమను మనకు గుర్తుచేయడం లేదా? యీ రెండు మహత్తర దేశాలు, ప్రపంచంలోని రెండు మహత్తర రాజ్యాలు యుద్ధానంతర కాలమంతా తీవ్ర తలపాటువల్ల తలెత్తిన పరిస్థితిని గురించి ఆలోచించాల్సిన అవసరం లేదా? దీనంతటినీ ఆలోచించాల్సిన సమయమాసన్నమైంది. అందువల్ల అధ్యక్షునితోనూ, ఆయన సహచరులతోనూ నేను యిలా అన్నాను: ప్రజల మనోభావాలకన్నా రాజకీయవేత్తలు వెనుకబడివున్నట్టు కనిపిస్తున్నదికదా? మా సొంత దేశంలోని మనో

భావాలనుబట్టి మేము యిది తెలుసుకున్నాం. అమెరికన్ ప్రజల మనోభావాలనుబట్టి మేము యిది తెలుసుకున్నాం. మంచికి మార్పులు జరగాలని వారు కోరుకుంటున్నారని తెలుసుకున్నాం. వారు తమంత తామే వ్యవహరించడం మొదలుపెడుతున్నారు. వారు సంబంధాలు నెలకొల్పుకుంటున్నారు. యీ సంబంధాలకోసం వివిధ రూపాలను, పద్ధతులను అన్వేషిస్తున్నారు. మన దేశాల్లోని పిల్లలు మొదలుకొని జ్ఞానులవరకూ యీ క్రమంలో అద్భుతమైన మేధాశక్తిని ప్రదర్శిస్తున్నారు. తలపాటు తాలూకు చివరిపేజీని తిప్పివేసి మాతనదశను ప్రారంభించాల్సిన సమయమాసన్నమైందని ప్రతిఒక్కరూ అర్థం చేసుకున్నారు. ఇవి చాలా శక్తివంత ఆదేశాలు. అవి మన ప్రభుత్వాల విధానాల్లో ప్రతిబింబితంకావాలని నా అభిప్రాయం.

ఈ విషయంలో సోవియట్ నాయకత్వంలో రెండు అభిప్రాయాలు లేవని హామీయిస్తున్నాను. వున్న అభిప్రాయం ఒక్కటే. ఒక దృఢనిర్ణయం తీసుకోవడం జరిగింది. దాన్నిగురించి చెబుతున్నాను—అమెరికాతో సంబంధాలు నిర్ణయాత్మకంగా మెరుగుపర్చుకోవడానికి మేం అనుకూలం. మన దేశాల ప్రజలకు అది అవసరం. మొత్తం ప్రపంచానికి అది అవసరం.

మన రెండు దేశాలు తమ సంబంధాలను అభివృద్ధి చేసుకుంటున్న తీరును చూసి ప్రపంచం యిప్పటికీ అవహేళనతో నవ్వుతున్నదని అధ్యక్షునికి నేను గుర్తుచేశాను. దాన్నిగురించి యిప్పటికే యెంతో చెప్పడం జరిగింది. వుదాహరణకు యేసమస్యతోనైనా మనం వ్యవహరించే తీరు యెలా వుంటున్నదంటే మనం గుడ్డిగా పరిగెత్తి దాన్ని తలతో ఢీకొంటాం. ఇక్కడ మనం నిజంగా పొరపాటు మార్గంలో వెడుతున్నాము. మనం ఆగకపోయినట్టయితే అలా చాలా దూరం పోతాం.

సంభాషణల్లో జరిగినదంతా, యీరోజుల్లో నేనూ, అధ్యక్షులవారూ, ఇతర రాజకీయ నాయకులూ చెప్పినదంతా యేమని ధృవీకరిస్తున్నదంటే, కొద్దిపాటి చిన్న బృందాలు తప్ప విజ్ఞతాయుతమైన వైఖరికీ, అవగాహనకూ వ్యతిరేకులెవరూ లేరు. ఇది నా అభిప్రాయం.

బాధ్యతాయుతమైన యీ రాజకీయప్రకటనలకు అనుగుణంగా బాధ్యతాయుతమైన నిజమైనచర్యలనుగనక తీసుకున్నట్టయితే మంచి రోజులు వస్తాయని, మంచికాలం ముందు వుందని మనం ఆశించవచ్చు. మన రెండు దేశాలప్రజలుమాత్రమేగాక మొత్తంప్రపంచమంతా దాన్ని హర్షిస్తుందని నా నమ్మకం.

వాషింగ్టన్ పర్యటనకు బయల్దేరేముందు గతవారం నేను కొందరు విదేశీ రాజ నీతిజ్ఞులతో, ముఖ్యంగా ఆఫ్రికాకు చెందిన ప్రముఖ రాజకీయ నాయకుడు కౌండాతో, ఆస్ట్రేలియా ప్రధానమంత్రి హక్‌తో సమావేశాలు జరిపాను. అంతర్జాతీయ సంబంధాలు మెరుగౌతాయనిపాశ్చాత్యదేశాలలోనూ, ప్రపంచంలోని అన్ని ఖండాలలోనూ ప్రజలు ఆశిస్తున్నట్టు వారు నాకు గట్టిగా చెప్పారు. యీమాట అమెరికా అధ్యక్షునికి చెప్పాల్సిందిగా వారు నన్ను కోరారు.

మీరు మీ దోహదాన్ని కూడా యెందుకు

చేయకూడదు అని వారిద్దరినీ నేను అడిగాను. తమ వంతు దోహదాన్ని చేకూర్చడానికి తాము సిద్ధమేననీ, అయితే సోవియట్ యూనియన్ అమెరికా పరస్పరం అంగీకరానికి రావడం ప్రధానమైన విషయమనీ వారు పదే పదే చెప్పారు.

దీనంతటినీ మనం అవగాహన పర్చుకోవాలి, నిజమైన రాజకీయాలను యీ స్ఫూర్తితో నింపాలని నేను భావిస్తున్నాను. అందుకు తరుణం ఆసన్నమైంది.

పరిస్థితిని గురించి యీ విధమైన అవగాహనను ప్రాతిపదికగా చేసుకుని మేం ఆచరణ సాగిస్తామని మీకు హామీ యిస్తున్నాను.

అధ్యక్షునితో మొదటి సమావేశంలోనే ఆయనకు నేను యీ విషయం చెప్పాను. కాంగ్రెస్ నాయకులతో, అమెరికాలోని మేధావి వర్గాల ప్రతినిధులతో జరిగిన సమావేశాలలోనూ యీ విషయం చెప్పాను, ప్రసారసాధనాల అధిపతులతోనూ, వ్యాపారుల ప్రతినిధులతోనూ సమావేశాల్లో యీ విషయం చెప్పాను. నేను చేసిన ప్రసంగాలన్నిటిలోనూ యీ విషయం బాహాటంగా చెప్పాను.

మావాణిని వినిపించుకుంటారని నేను ఆశిస్తున్నాను. అమెరికా ప్రజలు మావాణిని విన్నారని నేను భావిస్తున్నాను. సామాన్య ప్రజల ప్రతిస్పందన సైతం యెలా మారుతున్నదీ నేను చూడగల్గుతున్నాను.

హటాత్తుగా మార్పు వచ్చింది. వాషింగ్టన్ రోడ్లమీదకు అమెరికన్లు వస్తున్నారు. వారు మంచి వుత్సాహంగా వున్నారు. వారు చేతులు వూపి అభినందిస్తున్నారు. యీరోజున నేనూ, ఉపాధ్యక్షులూ కారులో వస్తూ మార్గమధ్యాన ఒకచోట కారుదిగి కొంతమంది అమెరికన్లను సమీపించాం. వారిమనోభావాలునాకుఅనుభూతమయ్యాయి. వారితో నేనిలాఅన్నాను: ''మనం పరస్పరం యెలా సన్నిహితంకావాలి, మన సహకారాన్ని యెలా మెరుగుపర్చుకోవాలి అన్న విషయాలపై మేం మీ అధ్యక్షునితో మాట్లాడుతున్నాం. మీరు కూడా అందుకు అధ్యక్షునిపై వత్తిడి తెండి మా సోవియట్ ప్రజలు యేక కంఠంతో మాపై అందుకోసం వత్తిడితెస్తున్నారు''. అంచేత నేనిక్కడ రాజకీయ వ్యవహారాలు మాత్రమేకాదు, ప్రచారం కూడా చేస్తున్నాను. అయినప్పటికీ సానుకూలమైన ప్రచారం అనేది నిజమైన ప్రగతిశీల నిర్మాణాత్మక విధానం అని నా అభిప్రాయం.

పరస్పరం యెలా సన్నిహితం కావాలీ అన్న విషయాన్ని ఆలోచించడం మేం ప్రారంభించగానే మన ద్వైపాక్షిక సంబంధాల విషయంలో అనేక సమస్యలు చర్చకు వచ్చాయి; వాటిపై మా దృష్టి మరల్చాం. ఆ విషయం మీరు సంయుక్త ప్రకటనలో చూడవచ్చు. వాతావరణ పరిరక్షణ, ఓజోన్ పొర పరిరక్షణ, రోదసిని శాంతియుతంగా వుంచడం, అంగారక గ్రహానికి ప్రయాణం, వైద్యరంగం, థర్మోన్యూక్లియర్ రియాక్టర్ వాణిజ్యం తదితరాలకు సంబంధించి అనేక సమస్యలున్నాయి. అతిముఖ్యమైన సంయుక్త ప్రాజెక్టులు చేపట్టే విషయాన్ని పరిశీలించేందుకు యిది మనకు అవకాశాలను ఆవిష్కరించింది.

అందువల్ల యిక్కడ గడపిన రోజులు

గంభీరమైన చర్చలతో, అభిప్రాయాల అదాన ప్రదానాలతో నిండిపోయాయి. ఇక్కడ జరిగిన సంభాషణలు ముఖ్యమైనవి, ఫలితాలూ ముఖ్యమైనవే అనిచెప్పడానికి యీ చర్చల సారం నాకు అవకాశం యిస్తున్నదని నేను భావిస్తున్నాను. పట్టుదలతో మనం అడుగడుగు ముందుకు వేసినట్టయితే, అది యెంత కష్టమైనప్పటికీ అలాముందుకు సాగినట్టయితే —అలా సాగడం యెంతో కష్టభూయిష్టమైనదని నాకు స్పష్టంగా తెలుసు—యిదంతా ఫలితాలనిస్తుందని నా నమ్మకం. పరస్పర, ఆమోదయోగ్య పరిష్కారాలకోసం అన్వేషణలో, ఒకరి ప్రయోజనాలపట్ల మరొకరు తగు గౌరవం చూపుతూ మనం తప్పకుండా ముందుకు సాగుతాం. ఆ క్రమానికి గొప్ప ప్రేరణ యివ్వడం జరిగింది.

నా పర్యటనకుముందూ, నా పర్యటన సమయంలోనూ అమెరికన్లు వ్యక్తంచేసిన మనోభావాల గురించి మళ్ళీ హృదయపూర్వకంగా కొద్ది మాటలు చివరిలో చెప్పడం నా ధర్మంగా భావిస్తున్నాను. ఈ పత్రికాగోష్ఠి ఆరంభం కావడానికిముందు, యిప్పుడే అమెరికన్ యువజనుల బృందాన్నొకదాన్ని నేను కలుసుకున్నాను. మా రాజకీయ వేత్తలకన్నా యెంతో వేగంగా అమెరికా, సోవియట్ యూనియన్‌లకు చెందిన యువకులు అంగీకారానికి వచ్చినట్టు కనిపిస్తున్నదని నేను వారితో చెప్పాను. వారికి యెలాంటి విద్వేష మనోభావాలూలేవు. మనం ఒక అంగీకారానికి రావాలీ అంటే ముందు విద్వేష మనోభావాలను మనం వదిలించుకోవాల్సివుంది. పాత మూసపోతలను వదిలించుకోవాల్సి వుంది. మార్గంలో అడ్డంపడ్డ అవరోధాలను వదిలించుకోవాలి. వయసు ముదిరిన తరవాత వాటిని వదిలించుకోవడం అంత సులభమేమీ కాదు. అయితే వారు, యువకులు; యెలాటి అరమరికలూలేకుండా ఒకర్నొకరు చూసుకుంటారు. చాలా త్వరగా పరస్పరం అవగాహన చేసుకుంటారు. అదేమీ పై పై మెరమెచ్చుల విషయంకాదు. పిల్లలాటా కాదు. అంతా బాగానేవున్నట్టు చూసే దృష్టి కాదు. వారు గంభీరమైనవారు. పదిహేను, పదిహేడు సంవత్సరాల మధ్యవయసులో వారు చిన్నవయసైనప్పటికీ గంభీరంగా ఆలోచిస్తున్నారు. తమ వ్యక్తిగత సమస్యల విషయంలోనూ, తమకు సొంతంగా ఆసక్తివున్న విషయాలలోనూ మాత్రమేకాదు, యీ ప్రపంచంలో మనం యెలా జీవించాల్సివుందీ అనే విషయాన్ని వారు ఆలోచిస్తున్నారు. ఇది అద్భుతమైన పరిణామం. దాన్ని గురించి రాయాల్సి వుంది.

చురుకుగా అభిప్రాయాలు పరస్పరం తెలుపుకోవాలనే వుత్సాహం నా కెంతోగానో వున్నప్పటికీ నేను యింటర్వ్యూలు యివ్వడం అంత అరుదుగా యెందుకువుంటున్నదీ అనే విషయాన్ని సమాచార సాధనాల అధిపతులతో చర్చల సందర్భంగా నేను వివరించాను. మూడు నాలుగు అయిదు యింటర్వ్యూలలో పదేపదే ఒకేవిధమైన ప్రశ్నలు అడుగుతున్నారని తేలింది. మరి దేన్నిగురించి మాట్లాడాలి. గాలిలో సాముచేయాలా? మా చట్టాల్ని ధిక్కరించినందుకు మా దేశంలో జైలులో పెట్టినవారి సంఖ్య నాలుగువేలు కాదుగదా రెండువేలూ

కాదు, అయిదువందలూ కాదు కేవలం 22 మంది వ్యక్తుల్ని మాత్రమేనని రుజువు చేయ డానికి మళ్ళీమళ్ళీ నేను ప్రయత్నించాలా? రక్షణ విషయాల, కంప్యూటర్ సాంకేతిజ్ఞత కంట్రోలవ్యవస్థలను నిర్వహించిన కారణం చేత, ఒక్కమాటలో చెప్పాలంటే రాజ్యానికి చెందిన రహస్యాలతో సంబంధమున్న కారణంచేత మా దేశం విడిచిపోవడానికి మేం అనుమతి నిరాకరించిన వారి సంఖ్య 220 మాత్రమేనని రుజువుచేయడానికి మళ్ళీ మళ్ళీ నేను ప్రయత్నించాలా? మీరేమీ చెప్పినప్ప టికీ, యేమిరాసినప్పటికీ యెవరు యెక్కడి నుంచి యే విధంగా మాపై కేకలు పెడుతున్న ప్పటికీ ఆ రహస్యాలకు కాలం చెల్లేంత వరకు వారిని మా దేశం విడిచి వెళ్ళడానికి అనుమతించబోము. ప్రస్తుత ప్రపంచం పరిస్థితి యిది. దీన్ని మా దృష్టిలో వుంచుకోక తప్పదు కాని మన సంబంధా లలో ప్రతిదానినీ దీనికే కుదించడం జరుగు తోంది. ఇంటర్వ్యూలను కోరడం సత్యాన్ని కనుగొనేందుకూ, గంభీరంగా ఆలోచించే టట్టుగా ఒకర్నొకరు ప్రోద్బలించేందుకూకాక ఒక రాజకీయవేత్తను వీలైనంత త్వరలో యెండగట్టే వుద్దేశంతో, ఆ రాజకీయవేత్తను యిరకాటంలోపెట్టే వుద్దేశంతో యింటర్వ్యూ లను అడుగుతున్నారు. సంభాషణ అంటే యిదేనా? యింటర్వ్యూల వుద్దేశం యిదేనా? సమాచార ప్రసార సాధనాలవున్నది యిందు కేనా? మరింత మెరుగ్గా జీవించాలని ప్రజలు కోరుకుంటున్నారు. ఒకరిగురించి మరొకరు మరింత బాగా అవగాహన పర్చుకోవాలని ప్రజలు కోరుకుంటున్నారు. అభిప్రాయాలను పరస్పరం తెలియజేసుకోవాలని, మిత్రత్వం నెరపుకోవాలని కోరుకుంటున్నారు. అయితే ఇప్పుడు పత్రికలద్వారా ఎన్నో మాటలు రేపు తున్నారు. మరింత బాహాటతకోసం అభిలాష అనే పేరిట యిదంతా చేస్తున్నారు. మిమ్మల్ని నిందించడంకోసం నేనిలా చెప్పడం లేదు. రాజకీయ వేత్తలంతా మహా అద్భుతమైన వారనో, లేదా సమాచార ప్రసార సాధనా లలో ఇలాటి చెడ్డవారంతా పని చేస్తున్నారనో నేనడంలేదు....లేదు నా వుద్దేశం అది యెంత మాత్రంకాదు. ప్రసార సాధనాలకుకూడా పెరెస్త్రోయికా అవసరమనీ, అవి నూతన ఆలోచనా ధోరణిలో ప్రావీణ్యం పొందాలనీ మాత్రమే నేనంటున్నాను. దీనితో మీరు ఏకీభవించబోరా? మనం కలిసి ఆలోచిద్దాం. యెందుకంటే మనమంతా ఒకే పడవలో వున్నాం. మీకు అన్ని విషయాలూ స్పష్టంగా తెలుసునా? అదే నిజమైతే మీమీద అసూయ పడుతున్నాను. అయితే అదే సమయంలో, మీకన్నీ యిప్పటికే తెలిసి వున్నట్టయితే మీమీద జాలిపడుతున్నాను. దయచేసి దాన్ని గురించి కొంచెం ఆలోచించండి.

అమెరికన్ల ప్రతిస్పందన విషయాన్ని తిరిగి యీ అవకాశాన్ని వుపయోగించుకొని ప్రస్తావించ దలుస్తున్నాను. ఈ రోజుల్లో అమెరికన్లు వ్యక్తంచేసిన మనోభావాలను గురించి ప్రస్తావించదలుస్తున్నాను. నా పర్య టన ముగుస్తున్న యీ సమయంలో అమె రికన్లందరికీ, వారు యిచ్చిన అతిథ్యానికీ, వారి మనః పూర్వక ప్రవర్తనకు, వారి సౌహార్ద

తకుగాను యిక్కడే, యిప్పుడే వారికి ధన్య వాదాలు తెలుపుకుంటున్నాను. ఈ మాటలను సోవియట్ యూనియన్‌లో మా ప్రజలు ఆలకిస్తారని నాకు నమ్మకంగా తెలుసు. వారూ దీనిని హృదయ పూర్వకంగా మానవీయ ప్రతిస్పందనతో స్వీకరిస్తారు. వారు యీ మాటలు వినాలని నేను కోరుకుంటున్నాను.

నేను స్వదేశం వెళ్ళాక మీదేశంలోని మా పర్యటనానుభవాలను వారికి వివరిస్తాను.

నా ప్రస్తుత పర్యటన వాషింగ్టన్‌కు మాత్రమే పరిమితం అయింది. మళ్ళీ అవ కాశం లభించినపుడు నేను తిరిగి అమెరికాకు వచ్చి మీ ప్రజలతో సంభాషించాలని అభిలషి స్తున్నాను. యిది నా హృదయ పూర్వకమైన అభిలాష.

అమెరికన్ ప్రజలు మంచి విజయాలు సాధించాలని, వారి ఆశలు వాస్తవరూపం పొందాలని కోరుకుంటున్నాను. సోవియట్ ప్రజలకు సంబంధించినంతవరకు వారు శాంతి, సహకారానికి సంబంధించిన అన్ని విషయాలలో, అందరి వుమ్మడి ప్రగ తికి సంబంధించిన అన్ని విషయాలలో నమ్మదగ్గ భాగస్వాములుగా వుంటారని అమెరికన్లకు హామీ యివ్వదలుస్తున్నాను.

ధన్యవాదాలు.

* * *

విలేకరులు అడిగిన ప్రశ్నలకు మిహ యీల్ గొర్బచేవ్ జవాబిచ్చారు.

ప్ర: మీ పుస్తకం "పెరిస్త్రోయికా" లోను, మీ ప్రసంగాలలోను మీరు సోవియట్ యూనియన్‌లో జరుగుతున్న ప్రజాస్వామ్యీ కరణ గురించి చెప్పారు. ఇప్పుడు మీకు ప్రజాస్వామ్యాన్ని గురించిన అమెరికన్ భావాలను కనీసం హడావుడిగానైనా చూసే అవకాశం లభించింది. మీరు తెలుసుకున్న దేమిటి? ప్రజాస్వామ్యాన్ని గురించిన అమె రికా భావాలకు, ప్రజాస్వామ్యీకరణను గురిం చిన మీ భావాలకుమధ్య యెలాటి తేడాను మీరు చూశారు అన్నది చెప్పగలుగుతారా?

జ: అమెరికా సమాజంలో అంతర్లీనంగా వున్న విలువలేమిటి, మా సమాజంలో అంత ర్లీనంగావున్న విలువలేమిటి అనే విషయాన్ని పరిశీలించి అవగాహనపర్చుకోవడం అటు మీ దేశంలోనూ, ఇటు మా దేశంలోనూకూడా అవసరమని నేను భావిస్తున్నాను.

అధ్యక్షునితో ముఖాముఖి జరిగిన సమా వేశాలలోనూ కాంగ్రెస్ నాయకులతో యితర పక్షాలతో జరిగిన సమావేశాల్లోనూ యీ సమస్యపై గంభీరమైన సంభాషణ, చర్చ జరిగింది.

మేం అంగీకరించినదిదీ: ఈ సమస్య లన్నిటినీ—అంటే ప్రజాస్వామ్యానికి సంబంధించిన, మానవ హక్కులకు సంబం ధించిన విషయాల్నీ, మానవీయ రంగంలో వున్న ప్రతి ఒక్క విషయాన్నీ—రాజకీయ జోస్యాల పరిధినుంచి వేరుచేద్దాం. వాటిని వాస్తవిక అధ్యయనరంగంలోకి తెద్దాం. అమెరికా ప్రజలు తాము యెంచుకున్న పథాన్ని అనుసరించడంలో రూపొందించు కున్న విలువలు, సోవియట్ ప్రజలు 1917లో తాము ఎంపికచేసుకున్న నాటినుంచి సాధిం చిన విజయాలు—వీటిని పరస్పరం తెలుసు కుందాం.

సుప్రీం సోవియట్, అమెరికా కాంగ్రెస్‌ల

స్థాయిలో చర్చలను, గోష్ఠులను, సమావేశాలను నిర్వహించడం ద్వారా, సంభాషణలు, విశ్లేషణలు జరపడంద్వారా యీ కృషి జరగాలని మేం అంగీకరించాం. మా దేశంలో పరిస్థితినిగురించి విశ్లేషించి వివరించేందుకు, అలాగే అమెరికాలో పరిస్థితినిగురించి మాకు అవగతమైన మేరకు మా అభిప్రాయాన్ని తెలిపేందుకు మేంసిద్ధంగావున్నాం. అమెరికా పక్షం తాను యేమిచెప్పితీరాలని భావిస్తున్నదో దానిని దృఢంగా, స్పష్టమైన దృష్టాంతాలతో చెప్పాలి. అంటే యీ విషయాన్ని గంభీరమైన పద్ధతిలో చేపట్టాలని దీని అర్థం. అది ప్రయోజనకరంగా వుంటుందని నేను భావిస్తున్నాను.

ప్ర : అమెరికా, సోవియట్ యూనియన్ల మధ్య సంబంధాలలో ఏమాత్రం సాధారణ స్థితిలోలేని విషయాలలో వాణిజ్యస్థాయికూడా ఒకటని నేను అనుకుంటున్నాను. ఈశిఖరాగ్ర సమావేశంలో అధ్యక్షుడు రీగన్‌తోగాని, లేదా యితర నాయకులతోగాని యీ పర్యటన సందర్భంగా యీ సమస్యగురించి ఏమైనా చర్చించగలిగారా? అమెరికా, సోవియట్ యూనియన్‌ల మధ్య ఆర్థిక సహకారానికిగల అవకాశాలను గురించి మీ అభిప్రాయాలు మాకు చెప్పగలరా?

జ : ఇది చాలా ఆసక్తికరమైన ప్రశ్న. ఒక ముఖ్యవిషయానికి సంబంధించినది. మన సంబంధాలు బాగుచేసుకొనే విధంగా మార్పు తేవాలని మనం హృదయ పూర్వకంగా యెంచుకుని వున్నట్టయితే, యే దిశలోనూ పురోగతిని బలహీనపడటాన్ని మనం ఎంత మాత్రం అనుమతించజాలమని నేననుకుంటున్నాను. అయితే వాస్తవానికి ఆర్థిక సహకారాన్ని, వాణిజ్యాన్ని విస్తరింప చేసేందుకు యిప్పటివరకూ జరిగిన కృషి చాలాతక్కువ.

ఆర్థిక బాంధవ్యాలను, ఆర్థిక సంబంధాలను పునర్నిర్మించకుండా రాజకీయ సంభాషణలను ఫలప్రదంగా నిర్వహించడం సాధ్యమని యెవరూ ఆశించజాలరు. గత మూడు రోజులుగా నేను అధ్యక్షునితోనూ, కాంగ్రెస్ నాయకులతోనూ సంభాషణలు జరిపాను. మీ కాంగ్రెసు యిదివరకు అనేక సవరణలను ఆమోదించడం ద్వారా యీ రంగంలో "అద్వితీయమైన దోహదం" చేకూర్చింది: యిప్పుడా సవరణలన్నిటినీ తొలగించాలంటే దానికి ఒక భారీ బుల్‌డోజర్ అవసరమవుతుంది.

పరిస్థితిని సమీక్షించాల్సిందిగా నేను వారిని కోరాను. ఈరోజున నేను వ్యాపారులతో, అమెరికా వ్యాపారవర్గాలకు చెందిన ముఖ్యప్రతినిధులతో పుష్టికరమైన సంభాషణ జరిపాను. అతిముఖ్యమైన యీ రంగంలో మేలుదిశగా మార్పు అవసరమన్న అవగాహన యేర్పడిందని చెప్పవీలుంది. తుదిపత్రంలో దీనికి సంబంధించిన విషయాలు నమోదై వున్నాయి. వ్యాపారాన్ని, ఆర్థిక సంబంధాలను, ప్రోత్సహించేందుకు, సంయుక్త ప్రాజెక్టులతో సహా ప్రధాన ప్రాజెక్టులను స్థాపించేందుకు యిది వుద్దేశితమైంది.

అమెరికా వ్యాపారులు, సోవియట్ యూనియన్‌లోని వ్యాపారవర్గాలు సహకారం పెంచుకునేందుకు యీ రాజకీయ సందేశం వీలుకల్పిస్తుందని నేను భావిస్తున్నాను. అందుకు అపార అవకాశాలున్నాయి. సోవి

యట్ యూనియన్‌ను గురించి తెలిసిన వారు వాటిని అంచనా వేయగల్గుతారు.

అమెరికా ప్రతినిధి ఒకరు యివాళ యిలా అన్నారు. "చైనాతో సంబంధాలతో పోలిస్తే చిన్నమైన పరిస్థితి సోవియట్ యూనియన్‌లో వుంది. సోవియట్ యూనియన్‌లో కొనుగోలు శక్తి చాలా హెచ్చుగావుంది. అందువల్ల సంయుక్త ప్రాజెక్టులను చేపట్టడానికి మేం యిష్టపడుతున్నాం."

అయితే యిందులో పోటీ అనేది యేదీ లేదు. చైనాతో మేమూ, మీరుకూడా బాంధవ్యాలను పెంపొందించుకుందాము. చైనాతో బాంధవ్యాలను మరింత అభివృద్ధి పర్చుకోవడాన్ని మీరు కొనసాగించినట్టయితే దానిని మేం యెంతగానో హర్షిస్తాం. చైనా ప్రజా రిపబ్లిక్‌తో, మా పొరుగు దేశం, మా మిత్ర దేశం అయిన చైనా ప్రజారిపబ్లిక్‌తో మా సంబంధాలు పెరుగుతూనే వుంటాయని నేను భావిస్తున్నాను.

ప్ర. గత వారంలో అనేక సందర్భాలలో సోవియట్ విదేశాంగ మంత్రిత్వశాఖ కార్యాలయం బయట అహింసాయుత శాంతియుత ప్రదర్శకులపై మీ అధికారులు మొరటుగా ప్రవర్తించారు. పెరిస్త్రోయికా, గ్లాస్నోస్త్ అంటే అదేనా?

జ: చట్టాల్ని యెవరైనా ధిక్కరించినట్టయితే, రాజ్యం వునికిలో వుందనీ, చట్టాలు వునికిలో వున్నాయనీ ధృవీకరించడం అనే బాధ్యతా విధులు నిర్వర్తించాల్సినవారు రంగప్రవేశం చేస్తారు. ఒక్కొక్కప్పుడు కొన్ని ఘటనలు సంభవిస్తాయి. అయితే శాసన ధిక్కారణ జరిగినపుడు మాత్రమే అలాటి ఘటనలు సంభవిస్తాయి. మీరు వుటంకించిన నిర్దిష్ట సందర్భంలో అంతా మామూలుగానే సాగింది: చట్టప్రకారమే జరిగింది. ఆ ఘటన అంతటితో ముగిసి పోయింది.

ప్ర: ఎ.బి.ఎం సంధిపై పట్టుపట్టకుండానే దాడి ఆయుధాలపై చర్చల్లో కొంత ప్రగతి వుండ వీలుంటుందనీ, ఎస్.డి.ఐ గురించి కొంత రాజీ వుండవచ్చనీ మీరు యిక్కడికి రావడానికిముందు మీ సహచరులు కొందరు సూచ్యప్రాయంగా తెలిపారు; ఆ రెండు విషయాలూ ఒకదానితో మరొకటి ముడిపడివున్నాయని యింకామీరు భావిస్తున్నట్టు కనబడుతున్నది. ఈ రెంటికీ గల ముడిని గురించి సంభాషణల సందర్భంగా మీరు గట్టిగా నొక్కి చెప్పినట్టు అమెరికా ప్రభుత్వ అధికార్లు మాకు తెలిపారు. అమెరికా అధ్యక్షులు మాస్కో పర్యటనకు వచ్చేలోగా యీ మధ్యకాలంలో మొదట ఎస్.డి.ఐ పై ఒప్పందాన్ని కుదుర్చుకోనవసరం లేకుండానే దాడి ఆయుధాలను గురించి సంధిని కుదుర్చుకునేందుకు యేదైనా మార్గంవుందని మీరు భావిస్తున్నారా? లేక ఆ రెంటికీ ముడి శాశ్వతమైనదేనా?

జ: నా ప్రారంభ వాక్యాలలో మా వైఖరిని వివరించాను. సోవియట్ యూనియన్‌లో అమెరికా అధ్యక్షుని పర్యటన సమయంలో సంధిపై సంతకాలు జరిగేట్టు చేసేందుకు మేం తీవ్రంగా కృషిచేస్తాం. పరస్పరం అంగీకరించి సంయుక్త ప్రకటనలో నమోదు చేసిన సూత్రాల ప్రాతిపదికపై మేం నిర్మాణాత్మకంగా కృషి చేస్తాం.

ప్ర: ఉత్తరాదిన నౌకాదళంతో సహా సైనిక దళాలను తగ్గించదల్చినట్టు మీరిటీవల ప్రతిపాదించారు. ఆ తరువాత యెందువల్లనో యీ ప్రతిపాదనను అది నాటో-వార్సా సంబంధాలలో భాగమే అయినప్పటికీ దాన్ని గురించి ప్రస్తావించడం మానుకున్నారు. ఈ ప్రతిపాదన యిప్పటికీ సజీవంగా వుందా? దాని పరిస్థితి యేమైంది? ప్రాచ్యపాశ్చాత్యాల మధ్య భవిష్యత్తులో జరిగే సంభాషణల్లో దానిని చేర్చడం జరుగుతుందా?

జ: ఒక తరహా సమస్యల సముదాయాన్ని పరిష్కరిస్తూ యితర రంగాలలో మరింత పెద్ద సమస్యలు పేరుకుపోకుండా తప్పించడం అనేది అణ్వస్త్ర విసర్జనపథంలో సాగడాన్ని మనం ప్రారంభించిన పరిస్థితులలో, సాంప్రదాయక ఆయుధాల విషయాన్ని చేపట్ట సంకల్పిస్తున్న పరిస్థితులలో యెంతో ముఖ్యం. అంటే, యూరపులో, ఆసియాలో, ప్రపంచ స్థాయిలో అణ్వాయుధాలను— మధ్యశ్రేణి, స్వల్పశ్రేణి తరగతుల మిసిలీల విషయం నేను ప్రస్తావిస్తున్నాను—తొలగించడాన్ని మనం ఆరంభించినపుడు, యితర మండలాలలో సైనికతలపాటును ముమ్మరం చేసే వుద్దేశంతో హటాత్తుగా యేవిధమైన "పరిహార చర్యలు" చేపట్టకూడదు.

అలాచేయడం తప్పు అని నా అభిప్రాయం అందువల్లనే ఉత్తరాదిప్రాంతాలలో సైనిక కార్యకలాపాలను తగ్గించాలనే మా ప్రతిపాదన నిర్మాణాత్మకమైనది. సైనిక తలపాటును తగ్గించాలన్న సాధారణ భావన దానికి ప్రాతిపదిక. ఆప్రతిపాదనకు యిప్పటికీ మేము కట్టుబడివున్నాం.

ప్ర: అఫ్ఘనిస్తాన్ విషయంలో ఐ.రా.స మధ్యవర్తి డీగో కార్డొవెజ్ కృషిని గురించి మీరు ప్రస్తావించారు. ఒక రాజకీయ పరిష్కారాన్ని కనుగొనేందుకు తోడ్పడే నిమిత్తం జనవరి, ఫిబ్రవరిలలో కొత్త సంభాషణల పరంపరను ప్రారంభించాలని కార్డొవెజ్ ప్రతిపాదించారు. అఫ్ఘనిస్తాన్ పీపుల్స్ డెమోక్రాటిక్ పార్టీ, యేడు ముజహెద్దీన్ బృందాలు లేదా మీ మాటల్లో చెప్పాలంటే దుష్మన్ల బృందాలు, బహూశా అఫ్ఘనిస్తాన్ మాజీరాజు నాయకత్వాన ఆఫ్ఘన్ పెద్దల బృందం— యివన్నీ భాగంగా వుండే తాత్కాలిక ప్రభుత్వాన్ని అఫ్ఘనిస్తాన్‌లో యేర్పరచడం యీ రాజకీయ పరిష్కారలక్ష్యం. అఫ్ఘనిస్తాన్‌లో ఒక తాత్కాలిక ప్రభుత్వాన్ని యేర్పాటు చేసేందుకు జరిగే ఆ కృషిని మీరు బలపరుస్తారా? వచ్చేయేడు వేసవిలోగా ఆ ప్రయత్నం గనక ఫలప్రదమైనట్టయితే, అప్పటికి ముజహెద్దీన్ బృందాలకు ఆయుధ సరఫరాలను అంతం చేయడానికి అమెరికా అంగీకరించినట్టయితే, మీరు అఫ్ఘనిస్తాన్ నుంచి సైన్యాల వుపసంహరణను, అంటే వచ్చే వేసవిలోనే ప్రారంభిస్తారా?

జ: మా వైఖరిని సవివరంగానే నేను విశదీకరించాననుకుంటున్నాను. అయితే యీ ప్రశ్నను అడిగారు కాబట్టి, జవాబిస్తాను. జనవరి, ఫిబ్రవరిలలో కొత్త సమావేశం జరిగినట్టయితే దాన్ని మేం హర్షిస్తాం. యిందుకు మా వంతు దోహదం చేకూర్చేందుకు సిద్ధంగా వున్నాం. ఇతర ప్రశ్నలన్నీ పరస్పర సంబంధం గలవిగా యిదివరకే అంగీకరించడం జరిగింది. సైన్యాల వుప

సంహరణ ప్రశ్నమ, ఆయుధాలు, డబ్బు సహాయం చేయడాన్ని రద్దుచేసే ప్రశ్నను—యీ రెంటినీ పరస్పర సంబంధమైనవిగా కనక పరిశీలించడానికి అంగీకరించినట్టయితే వచ్చే నెలలోనే సానుకూల ఫలితాలు సాధించ వీలుందని నేను భావిస్తున్నాను. సంప్రతింపులు జరపాలనీ, యీ అంశంపై పక్షాల వైఖరిని సవివరంగా పరిశీలించాలనీ అధ్యక్షులూ, మేమూ అంగీకరించాం,

ప్ర: సమీప భవిష్యత్తులో రాజకీయ సంభాషణలు బాగా ఫలవంతమయేట్టు కనిపిస్తున్న రంగం యేది?

జ: వూహాగానాలు వద్దు. అయినప్పటికీ యీ సమావేశం సందర్భంగా యిప్పుడు కొంత సానుకూల పరిస్థితిని సృష్టించు తున్నాం అని నేను భావిస్తున్నాను. మన కార్యాచరణ యేకరీతిగా సాగినట్టయితే, సహనం పాటించినట్టయితే అనేక రంగాలలో పెద్ద మార్పులుతెచ్చే వీలుంది. ముఖ్యంగా నిరాయుధీకరణ రంగంలో పెద్ద మార్పుతెచ్చే వీలుంది.

ప్ర: పర్షియా సింధుశాఖ విషయంలో మీ అభిప్రాయాలు అమెరికా అభిప్రాయాలు యేమేరకు కలుస్తున్నాయి? యేమేరకు విభేదిస్తున్నాయి? ఆ మండలంలో పై చేయి సంపాదించడంకోసం మీరు తాపత్రయ పడుతున్నారని, ఇరాన్‌ను రక్షించ యత్నిస్తున్నారని మీపై ప్రత్యేకించి ఆరోపణ చేశారు. మధ్య ప్రాచ్య విషయాలపై అంతర్జాతీయ సమావేశం మీకు అధిక ప్రాధాన్యతగల విషయం కాకుండా, లేక ప్రాధమ్యతగల విషయం కాకుండా యిప్పుడు యెందుకయిపోయింది?

జ: మీరడిగిన రెండో ప్రశ్నతో ప్రారంభిస్తాను. మధ్యప్రాచ్యంపై అంతర్జాతీయ సమావేశ సన్నాహాలు, ఆ సమావేశం జరపడం—వీటినిగురించి అమెరికా ప్రభుత్వ వైఖరిని పునరాలోచించాల్సిందిగా అధ్యక్షుల వారిని నేను కోరాను; అలాటి సమావేశం జరపాల్సిన తక్షణ ఆవశ్యకతగురించీ, సాధ్యతనుగురించీ ప్రపంచంలో విస్తృతమైన యేకాభిప్రాయం వుందని నాకనిపిస్తున్నది.

ఈ విషయమై చర్చ కొనసాగుతుందని నాకు తోస్తున్నది. యెందుకంటే యీ సమావేశ సన్నాహాలలో అమెరికా ప్రభుత్వానికి ఆందోళన కల్గించే విషయ మేమీలేదు. ఈ క్రమం పరిధిలో ద్వైపాక్షిక, త్రైపాక్షిక, మండలవారీ సమావేశాలు జరపవీలుంటుంది. ఈ విషయంలో అనేక ప్రభుత్వాలు వ్యక్తం చేసే వివిధ అభిప్రాయాలనుపరిశీలించడానికి యిలాంటి సమావేశం అవకాశం కల్పిస్తుందని నేను భావిస్తున్నాను. ఈరంగంలో పురోగతి సాధ్యమేనని నేను అనుకుంటున్నాను.

ఇక మీమొదటి ప్రశ్నకు సంబంధించి: అవును ఆవిధంగా నిందమోపారు, మమ్మల్ని గురించి మంచిగాచెప్పుకొనేట్టు అమెరికన్లను గురించి చెడుగా చెప్పుకొనేటట్టు చేసేందుకు మేం ప్రయత్నిస్తున్నట్టుమాపై నిందవేశారు దీంతో నేను యేకీభవించడం లేదు. అయితే ఒక పక్షం అది యేమి చేస్తున్నదీ అన్న దానిపై దాని కృషిని గురించిన మంచి అభిప్రాయమో, చెడుఅభిప్రాయమో యేర్పడుతుంది. అంతే తప్ప అది చేస్తున్న కృషిని గురించి యితరులు యెలా అభివర్ణించారూ అన్న దానిపై ఆధారపడి అభిప్రాయా

లేర్పడవు, మేం యెలా వ్యవహరిస్తున్నాం. అమెరికన్లు యెలా వ్యవహరిస్తున్నారు, యితరులు యెలా వ్యవహరిస్తున్నారు అన్నది పరిశీలించడానికి దానిపై మీ సొంత అభిప్రాయాన్ని మీరు యేర్పరచుకోవడానికి మీకు అవకాశముంది.

ఒక పెద్ద సంఘర్షణ ప్రజ్వరిల్లే పరిస్థితి ఆ మండలంలో యేర్పడకుండా నిరోధించాల్సిన గొప్ప బాధ్యత పెద్ద రాజ్యాలపైనా, భద్రతాసంఘశాశ్వతసభ్యదేశాలపైనావుందని మా అభిప్రాయం. ఈ ఘర్షణలో వున్న పక్షాలు యేమి చేయాలని యితరులు కోరుతున్నది ఆపక్షాలు తెలుసుకొనేటట్టు చేయాలి; పరిస్థితిని విషమింపచేయడం అనేది అనుమతించరాదన్న విషయమని తెలుసుకొనే అవకాశం ఆ పక్షాలకుకల్గించాలి; యిలా వ్యవహరించడం అవసరమని అన్ని దశలలోనూ, అంటే 598 తీర్మానం ఆమోదించడానికి ముందూ చెప్పాం, యిప్పుడు కూడా చెపుతున్నాం. ఆ తీర్మానాన్ని, అది కల్పించే అవకాశాలను యిప్పటికీ పూర్తిగా వినియోగించుకోలేదని మేం భావిస్తున్నాం.

నావ్యాఖ్యకే నేను పరిమితమౌతాను. యెందుకంటే మేం మరింత నిర్దిష్టమైన చర్చను జరిపాం: అది పూర్తికాలేదు: దాన్ని కొనసాగించాలని నిర్ణయించాం; పర్షియా సింధు శాఖ పరిస్థితిలోని, ఇరాన్-ఇరాక్ ఘర్షణ పరిస్థితిలోని యీ అతి సంక్లిష్టదశలో మన రెండు దేశాల బాధ్యతాయుత పాత్రను నెరవేర్చే నిమిత్తం యీ చర్చను కొనసాగించ నిర్ణయించాం.

ప్ర: ఇటీవలి రోజులలో జరిగిన ఘటనల్ని గురించి రెండు మూడు సంవత్సరాలక్రితం యెవరైనా వూహించి చెప్పినట్టయితే దాన్ని రాజకీయ విచిత్రవూహాకల్పన అని బహుశా అభివర్ణించి వుండేవారు. అది యిప్పుడు నిజమవుతున్నది. ఈ వర్తమాన క్రమానికి, యీ మలుపునకు వస్తుగత ప్రాతిపదికగా వున్నది యేమిటి? యీ మలుపు యిప్పుడు యెందుకు సంభవిస్తూంది?

జ: అణ్వాయుధాల దశలవారీ నిర్మూలనకు మా పథకాన్ని, అన్ని రంగాలలో సైనిక తలపాటును తగ్గించే మా పథకాన్ని జనవరి 15 న ప్రకటనద్వారా ప్రతిపాదించినపుడు యిదంతా భ్రమ అని చాలామంది అంటూ వుండేవారు. అలా భ్రమ అంటూ వూహాగానాలు చేసినవారిదే పొరపాటని జీవితమే రుజువుపర్చింది.

అత్యంత నాటకీయమైన సమావేశం జరిగిన ప్రదేశం అయిన రక్యావిక్‌కు మేం చేరుకున్నపుడు—సందర్భవశాత్తు ఒక్క మాట—యిప్పుడిక్కడవున్న మీలో యెంత మంది అప్పుడక్కడికి వచ్చారు? (చాలా మంది చేతులు యెత్తారు) చాలా మంది వున్నారే మంచిది.

అప్పుడు నా పత్రికాగోష్టి యెలాటి వాతావరణంలో ప్రారంభమైందీ ఒక్కసారి మీరు గుర్తు చేసుకోండి. ఆశించినవన్నీ విఫలమైనాయి. అంతా నాటకీయంగా ముగిసింది. హాలులో ప్రాతికేయుల్ని నేను చూశాను. వారి ముఖకవళికలనుబట్టి వారెలాటివారో నేను అర్థం చేసుకున్నాను. నేను యెదుర్కొంటోతున్నది కేవలం వృత్తిరీత్యా జర్నలిస్టుల్ని, పదునైన వాణిగల పత్రికల వారినీ మాత్రమే

కాదనీ, అక్కడ యేం జరుగుతున్నదీ అన్న దానిపట్ల శ్రద్ధాందోళనలుగల వారిని నేను యెదుర్కోబోతున్నాననీ గ్రహించాను. అందరిలోనూ ఆ మనోస్థితే ప్రస్ఫుటంగా కనిపించింది.

ఆ పత్రికాగోష్ఠి నాకు గుర్తుంది. ఆరోజున అక్కడ నేను చెప్పిన యీ కింది విషయాన్ని నేనీ రోజున నూటికి నూరుపాళ్ళూ ధృవీకరించగలను—రక్యావిక్ ఒక నాటకీయ ఘటన, అయితే అదే సమయంలో, రాజకీయ వేత్తల చర్యలనూ, ప్రవర్తననూ అంతిమంగా నియంత్రించేది, నిర్ధారించేది ఒకటి వుంది అనే విషయాన్ని గుర్తించేట్టు చేసిన ఒక ముఖ్యమైన ముందంజ. ప్రపంచ ప్రజల మనోభావాలలో యిటీవలి సంవత్సరాలలో నాటకీయమైన మార్పులు వచ్చాయి. మొత్తం మానవాళిపై ప్రభావాలు కల్గించే అనేక యిబ్బందులు తప్పనిసరిగా యేర్పడతాయనే అవగాహన ప్రజలలోకల్గేలా చేసిన మార్పు యిది.

అన్ని దేశాలలోని మేధావుల కార్యకలాపాలవల్లే యిది జరిగింది. భౌతికశాస్త్రవేత్తలు, గణితశాస్త్ర వేత్తలు, వైద్యులు, కళాకారులు —వీరంతా యేమి జరుగుతున్నదీ గ్రహించారు. అనంతరం వారు వ్యక్తం చేసిన భయాందోళనలు ప్రజలలోని అన్ని తరగతుల వారికీ తెలియజేయడం జరిగింది. అన్ని దేశాలలోని ప్రజల మనసులలో యింతటి వేగవంతమైన మార్పులు వచ్చి వుండకపోయినట్టయితే నిజమైన నిరాయుధీకరణ రంగంలో ప్రథమ ప్రధానచర్య—యీ ప్రధాన చరిత్రాత్మక పత్రంపై సంతకాలు—జరగడాన్ని సాధ్యం చేసిన విధంగా మార్పులు వచ్చి వుండేవే కావు.

ప్ర: త్వరలో మీరు లాటిన్ అమెరికా పర్యటనకు వెళ్ళాలని సంకల్పిస్తున్నట్టు మాకు తెలుసు. ఆ పర్యటన వుద్దేశ్యమేమిటి? సమీప భవిష్యత్తులో సోవియట్ యూనియన్ నుంచి యేవిధమైన రాజకీయ చొరవలు వస్తాయని లాటిన్ అమెరికన్లు ఆశించ వీలుందో చెబుతారా?

జ: నేనక్కడికి అతి త్వరలో వెళుతున్నానని మీకు అప్పుడే తెలిసిందన్నమాట? (హాలులో నవ్వులని ప్రతిస్పందన) ఆ ఖండంలో, చాలా గంభీరమైన చరిత్రాత్మక ప్రాధాన్యతగల ప్రగాఢ మార్పులు జరుగుతున్న ఆ ఖండంలో కొన్ని దేశాలకు వెళ్ళాలన్న గట్టి ఆకాంక్ష నాకు వుంది. ఆసియాలో జరుగుతున్నవాటికి, లాటిన్ అమెరికాలో జరగనున్న పరిణామాలను జోడించి చూసినట్టయితే ప్రపంచ రాజకీయాలను అవే చాల వరకు నిర్ణయించనున్నాయని నేను భావిస్తున్నాను. అందువల్ల లాటిన్ అమెరికా దేశాలలో జరుగుతున్న శక్తివంతమైన, వేగపూరితమైన మార్పులు, వాస్తవాన్ని తెలుసుకోవాలని కోరుకునే యే రాజకీయవేత్తనైనా, స్వయంగా వాటిని పరిశీలించి తన రాజకీయ కార్యకలాపాలలో వినియోగించే నిమిత్తం సొంత విశ్లేషణను రూపొందించుకొనేందుకు అక్కడికి వెళ్ళాలని ప్రేరేపిస్తాయని నా అభిప్రాయం. అదీ ప్రధాన వుద్దేశం. విస్తృతమైన అభివృద్ధి పంథాలో అడుగుపెట్టేందుకుగాను లాటిన్ అమెరికాముందు పెద్ద అవకాశాలున్నాయని అనుకుంటున్నాను. అయితే

అది యెదుర్కొంటున్న కష్టాలు కూడా పెద్దవే.

ప్ర: రీగన్‌తో మీ సమావేశాలవల్ల ఆయనకు సోవియట్ యూనియన్‌పట్ల యిది వరలో వున్న అభిప్రాయాలను మార్చగలిగినట్టు మీరు భావిస్తున్నారా? ఆరు, ఏడు సంవత్సరాలక్రితం ఆయన సోవియట్ యూనియన్‌ను "దుష్ట సామ్రాజ్యం" అని అభివర్ణిస్తుండేవారు.

ఇక ప్రశ్నలో రెండవ భాగం. వాషింగ్టన్‌లో యీ మూడురోజులు గడిపిన అనుభవం ప్రాతిపదికగా అమెరికాను గురించి మీకిదివరలోవున్న అభిప్రాయాలను వేటినైనా మీరు మార్చుకున్నారా?

జ: అధ్యక్షుని అభిప్రాయాలు మేలు దిశగా మారివుంటాయని వూహిస్తున్నాను. అలాగే నావీను.

ప్ర: ఈరాత్రి మీరు బెర్లిన్‌కు బయల్దేరుతున్నందుకు సంతోషం. మీరు సంతకం చేసిన యీ సంధికి మీ బంధుదేశాలు చేసిన దోహదం, జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్ చేసిన దోహదంగురించి మీ అంచనా యేమిటి?

జ: గత కొన్ని సంవత్సరాలుగా మేం చేసిన ప్రతిఒక్క నిర్మాణాత్మక ప్రతిపాదనలోనూ మా బంధుదేశాల భాగస్వామ్యం వున్నది: ప్రతిఒక్క విషయాన్ని మేంకలసి పరిశీలించాం, చర్చించాం. అన్ని విషయాలలోనూ సంపూర్ణమైన సమరసభావంతో మేం వ్యవహరించాం. ఒక శాశ్వత ప్రాతిపదికపై వ్యవహరించాం. ఈ సమావేశం విషయంలో, మధ్యశ్రేణి, స్వల్పశ్రేణి మిసైల్ల నిర్మూలన ఒప్పందంపై యీ సంధి విషయంలో ప్రధానమైన దోహదంచేసినందుకు మాబంధు దేశాలకు షేమెంలో కృతజ్ఞులమని మరోసారి చెప్పదలుస్తున్నాము. మిగతా విషయాలు బెర్లిన్‌లో చెబుతాను.

ప్ర: ఈమూడు రోజుల శిఖరాగ్ర సమావేశంలో సోవియట్ యూనియన్, అమెరికాల మధ్య సంబంధాల క్రమాన్ని గణనీయంగా మార్చినట్టు మీరూ, అధ్యక్షుడు రీగన్ యిద్దరూ భావిస్తున్నట్టు కనిపిస్తున్నది. ఈ మూడు రోజుల శిఖరాగ్ర సమావేశంతో మీ యిద్దరి మధ్య ఒకరిపట్ల మరొకరి సంబంధాలు మారిపోయినట్టుకనిపిస్తున్నది. వచ్చినమార్పేమిటి? మీకూ, అధ్యక్షునికీ మధ్య ఆ మార్పు యెలా వచ్చింది?

జ: గత మూడు రోజులలో కుదుర్చుకున్న ఒప్పందాలు మన రెండుదేశాల మధ్య సంబంధాల అభివృద్ధికి పరమోన్నతమైన ప్రాముఖ్యతగలవని నేను భావిస్తున్నాను. అయితే ఒక షరతు: అదేమంటే మన నిబద్ధతలకు మనం కట్టుబడి వుండాలి. మన ఒప్పందాలను ఆధారంచేసుకుని మేం బాధ్యతాయుతంగా ప్రవర్తిస్తామని అమెరికాప్రజలకు, ప్రభుత్వానికి నేను హామీయివ్వదలుస్తున్నాను. యిప్పుడు అధ్యక్షునికీ, నాకూ మధ్య మరింత అవగాహన యేర్పడిందని నేను భావిస్తున్నాను. మా సంభాషణ మరింతగా వ్యవహార సరళిలో సాగింది; వైఖరులు మరింత నిర్మాణాత్మకంగా మారాయి. యిప్పుడు ఒకరిపట్ల మరొకరికి మరింత నమ్మకం యేర్పడిందని సైతం నేను చెప్పగలను.

ప్ర: వైట్‌హౌస్‌లో జరిగిన వీడ్కోలు ఉత్సవంలో చేసిన ప్రసంగాలలో మీరుగాని, అధ్యక్షుడుగాని సోవియట్ యూనియన్‌తో

రొనాల్డ్ రీగన్ జరుపనున్న పర్యటనగురించి ప్రస్తావించనే లేదు. ఆ పర్యటన అసలు జరుగుతుందా? లేక అది మీ సంబంధాలలో ఏర్పడే పురోగతిమీద ఆధారపడివుంటుందా?

జ: సందర్శన తప్పకుండా జరుగుతుంది. ఆ విషయాన్ని సంయుక్త ప్రకటన పేర్కొంటోంది.

ప్ర: పెరిస్త్రోయికా విజయం అనేది నిరాయుధీకరణ రంగంలో ఒప్పందాల సాధనపై యెంతవరకు ఆధారపడివుంటుందో చెబుతారా?

జ: నిరాయుధీకరణకు, అభివృద్ధికి మధ్య సంబంధం అన్న భావన పెరిస్త్రోయికాకు కూడా వర్తిస్తుంది.

ప్ర: ఐ.ఎన్.ఎఫ్ సంధిపై సంతకం చేసిన అనంతరం మధ్య యూరప్‌లో అణ్వస్త్ర రహిత నడవ యేర్పాటుకుగల ప్రాముఖ్య మేమిటో వివరిస్తారా?

జ: ఈ అంశం యిప్పుడు నానాటికీ మరింత తక్షణావశ్యకతను సంతరించుకుంటోంది. అది చాలా విలువైన చొరవ అని అంటాను.

ప్ర: ఎ. బి. ఎం సంధినుంచి వుపసంహరించుకోకుండా వుండేందుకు నిర్దిష్టమైన కాలపరిమితిని గురించి వాషింగ్టన్ సంభాషణలలో మీరు చర్చించారా? ఆ సంధికి భాష్యం అనబడే దాన్ని గురించి చర్చించారా? ఎస్.డి.ఐ కార్యక్రమాన్ని గురించి సోవియట్ పక్షంగాని, అమెరికా పక్షంగాని యేమైనా చెప్పాయా?

జ: నేనిలా జవాబిస్తాను: ప్రతిఒక్క విషయం చర్చించాం.

ప్ర: వ్యూహాత్మక రక్షణ రంగంలో సోవియట్ యూనియన్‌కూడా పని చేస్తున్నదని మీరు అన్నారు గదా....

గోర్బచేవ్: నేనలా యేమీ చెప్పలేదు.

ప్రశ్న కొనసాగింపు: రొనాల్డ్ రీగన్‌తో మీ సమావేశాల అనంతరం యీ రంగంలో యేమి చేయాలని మీ నిపుణులను మీరు ఆదేశిస్తారు? వారా పనిని మరింత త్వరిత పరుస్తారా లేక వేగం తగ్గిస్తారా?

జ: యిదీ నేను చెప్పింది: కొన్ని దిశలలో మేం ప్రాథమిక పరిశోధన జరుపుతున్నాం. అమెరికాలో రక్షణ చొరవ అని పిలుస్తున్న దాని కిందకు వచ్చే కొన్ని అంశాలకు కూడా యీ పరిశోధన వ్యాప్తమవుతుంది. అయితే ఎస్. డి. ఐ ను మేం గట్టిగా వ్యతిరేకిస్తున్నాం అని కూడా నేను చెప్పాను. మేం మా దేశంలో దానిని అభివృద్ధిపర్చబోము. దానిని అభివృద్ధి పర్చకుండా వుండాలని మేం అమెరికా ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాం.

కాని, అమెరికా ప్రభుత్వంగనక మా అభిప్రాయాన్ని చెవినిబెట్టకుండా, ఎస్.డి.ఐ ను సృష్టించే పథాన్నే యెంచుకున్నట్టయితే అందుకు అమెరికా ప్రభుత్వమే పూర్తిబాధ్యత వహించాల్సివుంటుంది.

దీనివల్ల వ్యూహాత్మక స్థిరత్వం ఛిన్నాభిన్నమవుతుంది. అనూహ్య పర్యవసానాలతో కూడిన ఆయుధపోటీ కొత్త రంగాలు ఆవిర్భవిస్తాయి. అమెరికన్లదగ్గర డబ్బు విపరీతంగా వుంటే వారు దానిని ఎస్.డి.ఐ పై దుబారా చేసుకోనీయండి. మేం ఆదేమాదిరిగా కాక యితర పద్ధతుల్లో దానికి జవాబుకోసం అన్వే

షిస్తాం. దానికయే ఖర్చు వందరెట్లు లేదా యింకా యెక్కువరెట్లు తక్కువ వుంటుంది. యిదీ నేను చెప్పిన మాట.

ప్ర: యిప్పటికే కుదిరిన ఒప్పందాలపై సంతకాలు చేయడం మినహా అదనంగా యేమీ లభించని శిఖరాగ్ర సమావేశాన్ని ప్రపంచమూ, మీరూ అంగీకరించజాలరని యిటీవల మాస్కోలో చేసిన ప్రసంగంలో మీరు అన్నారు. ఇప్పుడు మీరు మాకు చెప్పిందాన్నిబట్టి మొత్తం జరిగిందంతా యేమిటీ అంటే ఐ. ఎన్. ఎఫ్ సంధిపై సంతకాలు చేయడమే. నిరాయుధీకరణ నడవ విషయంలో మీ ప్రతిపాదనను తిరస్కరించడం జరిగింది; అణ్వస్త్ర పరీక్ష నిషేధం విషయంలో యెలాటి ఒప్పందమూ కుదరలేదు. మీకేమీ ఆశాభంగం కలగలేదా? లేదా మేం ఆశాభంగం చెందాలని మీరనుకుంటున్నారా?

జ: నేను వుపోద్ఘాతంలో చెప్పిన విషయాలను పునరుచ్చరించదల్చలేదు. అందులో నా పర్యటన ఫలితాల్నిగురించి వివరంగా నా అంచనాను యిచ్చాను. దానికి అదనంగా నేనేమీ చెప్పేదిలేదు.

ప్ర: ఎ. బి. ఎం సంధికి యెంతకాలం పాటు కట్టుబడివుండాలీ అన్న విషయంలో అంగీకారానికి మీ వుభయపక్షాలూ యేమైనా దగ్గరయ్యాయా? అలాటి అంగీకారం లేకుండా వ్యూహాత్మక క్షిపణుల విషయంలో యేవిధమైన ఒప్పందం కుదుర్చుకోడానికైనా సోవియట్ యూనియన్ సమ్మతించబోదని నేనర్థం చేసుకున్నాను; అది సరైనదేనా?

జ: మేం మా ప్రతినిధులకు ఆదేశాలు యిచ్చాం. వారు జెనీవాలో సంభాషణలు కొనసాగిస్తారు. ప్రస్తుతంమాత్రం యీ సమస్యల విషయమై నిర్దిష్ట వివరాల్లోకి నేను పోదల్చుకోలేదు.

ప్ర: ఆయుధ పోటీ దూర రోదసిలోకి విస్తరించకుండా నివారించడం ముఖ్యమైన విషయమని మీరు సర్వదా చెప్తూవున్నారు. యిక్కడ మీ సమావేశంవల్ల అలా విస్తరించే అవకాశమేమైనా తగ్గిందా?

జ: నేనలా అనుకోవడంలేదు. దూర రోదసిలోకి ఆయుధ పోటీ విస్తరించకుండా నిరోధించడం మా విధాన లక్ష్యంగా యిప్పటికీ వుందని నేనుమరోసారి చెప్పదల్చుకున్నాను.

(టాస్, 1987 డిసెంబరు 10)

# వీడ్కోలు సమావేశంలో మిహాయిల్ గోర్బచేవ్ ప్రసంగం

వైట్ హౌస్ సమీపంలో 1987 డిసెంబరు 10న జరిగిన వీడ్కోలు సమావేశంలో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి మిహాయిల్ గోర్బచేవ్ యిలా ప్రసంగించారు:

గౌరవనీయ అధ్యక్ష మహాశయా

గౌరవనీయ శ్రీమతి రీగన్‌గారు,

సోదర సోదరీమణులారా,

వాషింగ్టన్ సందర్శన మొత్తంమీద మా ఆశలకు న్యాయంచేసిందని మా స్వదేశానికి వెళ్ళేముందు చివరి నిముషంలో మేము సంతృప్తితో పేర్కొంటున్నాం. సోవియట్ అమెరికా సంబంధాల్లోని ముఖ్య సమస్యలపై, ప్రస్తుత ప్రపంచస్థితిలోని ముఖ్యాంశాలపై మేము మూడురోజులపాటు జటిలమైన కృషిచేశాం, వ్యవహార సరళిలో, నిర్మొహమాటంగా చర్చలు జరిపాం.

ఎంతో సాధించడం జరిగింది. అణుయుగ చరిత్రలో అపూర్వమైన అంజవేశామని నేను ప్రత్యేకించి నొక్కి చెప్పదలచుకున్నాను: తమ అణ్వాయుధాల్లో ఒక భాగాన్ని నిజంగా ధ్వంసంచేయాలని సైనిక శక్తిరీత్యా, వ్యూహశక్తిరీత్యా బృహత్తరమైన రెండు దేశాలు ఒక సంధిపై సంతకాలు చేయడం. ఈ విధంగా అణ్వస్త్ర నిసర్జన క్రమాన్ని కదలికలో పెట్టామని నేననుకుంటున్నాను.

అధ్యక్షులు రీగన్‌తో మేము జరిపిన చర్చల్లో ఆ క్రమంలోని ముఖ్యసమస్యపై అంటే వ్యూహాత్మకదాడి ఆయుధాలను, ప్రపంచంలోని ఆయుధాల్లో అత్యంత శక్తివంతమైన యీ ఆయుధాలను గణనీయంగా తగ్గించే విషయంపై కొంత పురోగతిని సాధించాం. అయితే యీ విషయంలో మనం యింకా యెంతో కృషిచేయాల్సివుంది.

మేము వుపయోగకరమైన అభిప్రాయాలను పరస్పరం వెల్లడింతుకున్నాం. ఇవి ప్రాంతీయ ఘర్షణలపై, ద్వైపాక్షిక సంబంధాల అభివృద్ధిపై, మానవ హక్కులపై వుభయపక్షాల వైఖరికి సంబంధించినవి. వీటిలో కొన్నిటికి నిర్దిష్టమైన పరిష్కారాలను, వుభయపక్షాలకూ, యితర దేశాలకూ సంతృప్తికరమైన పరిష్కారాలను మనం కనుగొనే అవకాశాలు కనిపిస్తున్నాయి.

భవిష్యత్తులో సంయుక్త కృషికోసం ఒక రకమైన ఎజెండాను మనం రూపొందించుకోగలిగాం. యిది వాషింగ్టన్ సందర్శనవల్ల ఒనగూడిన ప్రయోజనకర ఫలితాల్లో

ఒకటి; మన రెండు దేశాలమధ్య సంభాషణలను విశ్వసనీయమైన ప్రాతిపదికపై యిది వుంచుతుంది: యిది నిస్సందేహంగా నిర్మాణాత్మకమైనదే.

ఈ పర్యటనలో అమెరికా అధ్యక్షునితో మా చర్చలపైనే కేంద్రీకరించాం. దీనర్థం కాంగ్రెస్ సభ్యులతో, యితర రాజకీయ నాయకులతో, పురప్రముఖులతో, వ్యాపార ప్రతినిధులతో, విద్యావేత్తలతో, సాంస్కృతిక రంగంలోని ముఖ్యులతో, సమాచార సంస్థల నిర్వాహకులతో నేను జరిపిన సమావేశాల ప్రాముఖ్యతను తక్కువ చేసి చెప్పడం నా వుద్దేశం కాదు. అలాంటి సంబంధాలు ఒకరినొకరు మరింత బాగా, లోతుగా అర్థంచేసుకోడానికి తోడ్పడుతాయి; అభిప్రాయాలను, అంచనాలను, తుదకు పాతుకపోయిన మూస పోతలను పరిశీలించి సరిచేసుకోడానికి యెన్నో అవకాశాలను సమకూర్చుతాయి.

ఇదంతా యిటు విధానకర్తలను, అటు ప్రజలను, దేశాలను సన్నిహితం చేయడానికి ముఖ్యమైనదే.

సోవియట్ అమెరికా సంబంధాలను మెరుగుపర్చుకోవాలని అమెరికా సమాజంలో నానాటికీ ఆసక్తి పెరుగుతున్నదనే అభిప్రాయాలను యీ సమావేశాలు ధ్రువీకరించాయి. క్లుప్తంగా చెప్పాలంటే సోవియట్ ప్రజల్లో చాలా కాలంగా తొణికిసలాడుతున్న మనోభావాలకు దీటైనవాటిని మేము యీనాడు చూస్తున్నాం.

అమెరికాకు వీడ్కోలు చెపుతున్నాను. యీ దేశ రాజధానినే గాక, యీ మహత్తర దేశ ప్రజలను ప్రత్యక్షంగా కలుసుకుని సాధారణ అమెరికన్ పౌరులతో సైతం, సంభాషణలు, ఒక విధంగా సజీవ సంభాషణలు జరుపగలిగే విధంగా మీ దేశంలో మరోసారి పర్యటన కోసం నిరీక్షిస్తూ వుంటాను.

సమావేశాల్లోనూ, చర్చల్లోనూ మనం సాధించినదంతా కాలక్రమేణా మొత్తం ప్రపంచ వాతావరణాన్ని గణనీయంగా మెరుగుపర్చేందుకు, ప్రత్యేకించి అమెరికాలో పరిస్థితిని మా దేశమైన సోవియట్ యూనియన్‌పట్ల మరింత సరైన, సహనంతో కూడిన అవగాహనను యేర్పర్చుకోవడానికి వీలుగా మెరుగుపర్చేందుకు తోడ్పడుతుందని ఆశిస్తున్నాను.

అంతర్జాతీయ భద్రతను పటిష్టీకరించే వుమ్మడి లక్ష్యాలకు యీనాడు సోవియట్ యూనియన్ అమెరికాలు చేరువయ్యాయి. అయితే యీ లక్ష్యాన్ని యింకా చేరుకోవాల్సి వుంది, యిందుకు యెంతో కృషిచేయాల్సివుంది. దీన్ని యేమాత్రం జాప్యం చేయకుండా మనం ప్రారంభించాలి.

అధ్యక్ష మహాశయా, గౌరవనీయ అమెరికన్ పౌరులారా, మీ ఆతిథ్యానికి కృతజ్ఞతలు. అమెరికన్ ప్రజలందరికీ విజయం, సంక్షేమం, శాంతి ఒనగూడాలని కాంక్షిస్తున్నాను. ధన్యవాదాలు, సెలవు.

(టాస్, 1987 డిసెంబరు 10)

# సోవియట్-అమెరికా శిఖరాగ్రసమావేశ సంయుక్త ప్రకటన

సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి మిహాయిల్ ఎస్. గొర్బచేవ్, అమెరికా అధ్యక్షుడు రోనాల్డ్ డబ్ల్యు రీగన్‌లు 1987 డిసెంబర్ 7 నుంచీ 10వ తేదీ వరకూ వాషింగ్టన్‌లో సమావేశాలు జరిపారు.

సోవియట్ పక్షాన యీ సమావేశానికి హాజరైనవారు: సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ పొలిట్‌బ్యూరో సభ్యుడు, సోవియట్ యూనియన్ విదేశీ వ్యవహారాల మంత్రి అయిన ఎద్వార్డ్ ఎ. షెవర్డ్‌నాడ్జె; సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ పొలిట్‌బ్యూరో సభ్యుడు, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ కార్యదర్శి అయిన అలెక్సాండ్ర్ ఎ. యాకవ్‌లెవ్; సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ కార్యదర్శి అనతోలి ఎఫ్. దబ్రీనిన్; సోవియట్ యూనియన్ మంత్రిమండలి వుపాధ్యక్షుడు వ్లదీమిర్ ఎం. కామెన్‌త్సెవ్; సోవియట్ యూనియన్ సాయుధబలగాల సర్వసైన్య ముఖ్యాధికారి, సోవియట్ యూనియన్ రక్షణ వ్యవహారాల ప్రథమ డిప్యూటీ మంత్రిఅయిన సెర్గేయ్ ఎఫ్. అఖ్రొమెయెవ్; సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శికి సహాయకుడైన అనతోలి ఎస్. చెర్న్యాయెవ్; సోవియట్ కమ్యూనిసు పార్టీ కేంద్రకమిటీ జనరల్ డిపార్ట్‌మెంట్ అధిపతి వలేర్యి ఐ. బోల్దిన్; సోవియట్ యూనియన్ విదేశీ వ్యవహారాల డిప్యూటీ మంత్రి అలెక్సాండ్ర్ ఎ. బిస్మెర్త్‌నిహ్; అమెరికాలోని సోవియట్ యూనియన్ రాయబారి యూరి వి. దూబినిన్; సోవియట్ యూనియన్ విదేశీ వ్యవహారాల మంత్రిత్వశాఖ కలీజియం సభ్యుడు వీక్తర్ వి. కార్పొవ్; విశిష్ట రాయబారి అలెక్సేయ్ ఎ. ఓబుహవ్.

అమెరికా పక్షాన హాజరైనవారు: అమెరికా వుపాధ్యక్షుడు జార్జ్ బుష్; విదేశీవ్యవహారాల మంత్రి జార్జ్ పి. షూల్జ్; రక్షణ శాఖామంత్రి ఫ్రాంక్ సి. కార్లూసి; సైనిక సిబ్బంది ముఖ్యాధికారి హోవర్డ్ హెచ్. బేకర్; అధ్యక్షునికి తాత్కాలిక జూనియర్ అసిస్టెంట్ లెఫ్టినెంట్ జనరల్ కోలిన్ ఎల్. పోవెల్; విదేశీవ్యవహారాల రాయబారిశాఖ కౌన్సిలర్ మాక్స్ ఎం. కాంపెల్‌మన్; విశిష్ట రాయబారి, అధ్యక్షునికి ప్రత్యేక సలహాదారుడు, విదేశాంగ శాఖలో ఆయుధ నియంత్రణ వ్యవహారాల మంత్రి అయిన పాల్ ఎన్. నీషె, అధ్యక్షునికి ప్రత్యేక సలహాదారుడు, విదేశాంగశాఖలో ఆయుధ నియంత్రణ వ్యవహారాల మంత్రి, రాయబారి ఎద్వర్డ్ ఎల్. రౌనీ, సైనిక సంయుక్త ముఖ్యాధికారుల ఛైర్మన్ అడ్మిరల్ విలియం జె. క్రోవె; సోవియట్ యూని

యన్‌లో అమెరికా జూనియర్ రాయబారి జాక్ ఎఫ్. మాట్‌లాక్; యూరపియన్, కెనడియన్ వ్యవహారాల విదేశాంగ శాఖ సహాయ మంత్రి రోజానె ఎల్. రిడ్‌గ్వే.

1985 నవంబర్‌లో జెనీవాలో వుభయ దేశాల నాయకుల సమావేశంలో కుదిరిన అంగీకారం మేరకు జరిగిన యీ అధికార పర్యటన సందర్భంగా, ఆయుధాల తగ్గింపులు, మానవహక్కులు, మానవతాసమస్యలు, ప్రాంతీయ ఘర్షణల పరిష్కారాలు, ద్వైపాక్షిక సంబంధాలతో సహా వుభయ దేశాల మధ్యగల మొత్తం సమస్యలగురించి ప్రధాన కార్యదర్శి, అధ్యక్షుడూ సమగ్రంగా, వివరంగా చర్చించారు. ఉభయపక్షాలమధ్య కొనసాగుతున్న భేదాభిప్రాయాలుయీచర్చల్లో ప్రతిబింబించాయి. అయితే పరస్పర ప్రయోజనం గల రంగాల్లో పురోగతికి యీ అవరోధాలు అధిగమించరానివి కావు అనే అవగాహనతో చర్చలు అరమరికలు లేకుండా, నిర్మాణాత్మకంగా జరిగాయి.

ఉభయ దేశాలమధ్య సంబంధానికి మొత్తంగా పరివ్యాప్తమైన సంభాషణను శక్తి వంచనలేకుండా జరపడానికి వుభయులూ తమ గట్టి నిబద్ధతను పునరుద్ఘాటించారు.

జెనీవాలో అంగీకారానికి వచ్చిన, రక్యావిక్‌లో ప్రతిపాదించిన విస్తృతమైన అజెండాను పరిపూర్తిచేయడంలో యిప్పటివరకు సాధించిన పురోగతిని నాయకులు వుభయులూ సమీక్షించారు. యీ అజెండాలోని కొన్ని విషయాలకు సంబంధించి గత రెండేళ్ళకాలంలో ముఖ్యమైన ఒప్పందాలు కుదిరినందుకు వారు ప్రత్యేకించి సంతృప్తిని వ్యక్తంచేశారు.

వ్యూహాత్మక స్థిరత్వాన్ని మెరుగుపర్చడానికి, ఘర్షణాప్రమాదాన్ని తగ్గించడానికి వుద్దేశించిన క్రమంలో నిర్దిష్ట చర్యలకు ప్రాతిపదికను సమకూర్చిన తమ జెనీవా, రక్యావిక్ సమావేశాలకుగల మౌలిక ప్రాముఖ్యాన్ని గురించి ప్రధానకార్యదర్శి, అధ్యక్షుడూ రూఢిగా చెప్పారు. అణుయుద్ధంలో విజేతలంటూ యెవరూ వుండరనే, అలాంటి యుద్ధాన్ని యెన్నటికీ జరపకూడదనే తమ సత్యనిష్ఠా పూర్వక కృతనిశ్చయాన్ని వారు యికముందు కూడా మార్గదర్శకంగా వుంచుకుంటారు. అమెరికా, సోవియట్ యూనియన్‌ల మధ్య అణుయుద్ధమైనా, సాధారణ యుద్ధమైనా, యెలాంటి యుద్ధమైనాసరే జరగకుండా నివారించాలని వారు నిశ్చయించుకున్నారు. సైనికాధిక్యతను సంపాదించడానికి వారు ప్రయత్నించబోరు.

ఉభయదేశాల మధ్య తలపాటును నివారించడానికీ, మరింత దృఢమైన, స్థిరమైన సంబంధాన్ని పెంపొందించడానికీ వాస్తవిక మార్గాలను అన్వేషించడంలో సోవియట్ యూనియన్, అమెరికాలకు గల ప్రత్యేకమైన బాధ్యతను వుభయ నాయకులూ గుర్తించారు. యిందుకోసం సంభాషణను ముమ్మరం చేయాలనీ, తమ సంబంధాలలోని అన్ని రంగాలలో నిర్మాణాత్మక సహకారం దిశలో పొడసూపుతున్న ధోరణులను ప్రోత్సహించాలనీ వారు అంగీకరించారు. యితర దేశాలతో కలసి యిలాంటి కృషి చేసినట్లయితే మానవాళి మూడవ సహస్రాబ్దంలో ప్రవేశించేటప్పటికి మరింత సురక్షితమైన ప్రపంచాన్ని నిర్మించడానికి యిది దోహదంచేస్తుందని వారు గట్టిగా నమ్ముతున్నారు.

తమ మధ్యశ్రేణి, స్వల్పశ్రేణి మిసిలీలను నిర్మూలించడం గురించి సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల సమాఖ్యకూ, అమెరికా సంయుక్త రాష్ట్రాలకూమధ్య కుదిరిన సంధిపై వుభయ నాయకులూ సంతకాలు చేశారు. యీ సంధి లక్ష్యం దృష్ట్యా—అంటే సోవియట్ యూనియన్, అమెరికాలకు చెందిన అణ్వాయుధాల ఒక తరగతికి తరగతినే నిర్మూలించడం అనే లక్ష్యం దృష్ట్యానూ—తనిఖీ నిబంధనల వినూత్న స్వభావం, పరిధుల దృష్ట్యానూ యీ సంధి చరిత్రాత్మకమైనది. యీ వుమ్మడి విజయం మరింక యెక్కువ స్థిరత్వానికి కీలకమైన దోహదం చేస్తుంది.

## అణు, రోదసీ విషయాలపై చర్చలు

వ్యూహాత్మక దాడి ఆయుధాల తగ్గింపులపై జరగాల్సిన సంప్రతింపులను గురించి ప్రధాన కార్యదర్శి, అధ్యక్షుడు చర్చించారు. యీ ఆయుధాల 50 శాతం తగ్గింపుల సూత్రాన్ని అమలుజరిపే సంధిని కుదుర్చుకునే దిశలో గణనీయమైన పురోగతి జరిగినట్టు వారు పేర్కొన్నారు. వ్యూహాత్మక దాడి ఆయుధాలను తగ్గించడానికి, పరిమితం చేయడానికి సంబంధించిన సంధినీ, ముఖ్యమైన పత్రాలన్నిటినీ రూపొందించే పనిని సాధ్యమైనంత త్వరగా పూర్తిచెయ్యాలని, ప్రధానంగా 1988 ప్రథమార్థంలో యీ నాయకుల తదుపరి సమావేశం నాటికి ఆ సంధిపై సంతకాలు జరిగేట్టు పూర్తిచెయ్యాలని జెనీవాలోని తమ సంప్రదింపులదార్లను ఆదేశించడానికి వారు అంగీకరించారు. సంయుక్త ముసాయిదాసంధి పాఠంలో సమ్మతి, అసమ్మతి అంశాల నమోదును దృష్టిలో పెట్టుకుని ఫలప్రదమైన తనిఖీ గురించిన నిబంధనలపై త్వరిత ఒప్పందంతోసహా సంయుక్త ముసాయిదా సంధి పాఠంలోని సమస్యల పరిష్కారాన్ని శీఘ్రతరం చేసేందుకు తమ సంప్రదింపులదార్లను ఆదేశించడానికి అంగీకరించారు.

జెనీవాలోని సంప్రతింపులదార్లు యీ కింది విధంగా చేయాలి: రక్యావిక్‌లో అంగీకరించిన, తదనంతరం అభివృద్ధి పర్చిన భావనకనుగుణంగా ఆయుధాల్లో 50 శాతం తగ్గింపులను, జెనీవాలో రూపు దిద్దుతున్న స్టార్ట్ సంధి ముసాయిదా సంయుక్త పాఠంలో అంగీకృత భాగాలలో యిప్పుడు ప్రతిబింబితమైన యీ 50 శాతం తగ్గింపులను యీ ఒప్పందాల రూపకల్పనలో వారు ప్రాతిపదికగా చేసుకోవాలి. వారు ప్రాతిపదికగా చేసుకొనేవాటిలో యీ కిందివికూడావుండాలి: వ్యూహాత్మకదాడి ఆయుధ వాహక వ్యవస్థల సంఖ్య 1600కు వాటిపై అణుశీర్షాలు 6,000లకు 154 భారీమిసిలీలపై అణుశీర్షాలసంఖ్య 1540కు మించకూడదు, అనేగరిష్ఠ పరిమితులకు సంబంధించిన అంగీకారం; భారీబాంబర్లు, వాటిలోని అణ్వాయుధాలకు సంబంధించిన సంఖ్య విషయంలో అంగీకృత నియమం; తగ్గింపుల ఫలితంగా సోవియట్ యూనియన్ ఐ. సి. బి. ఎం ల, ఎస్. ఎల్. బి. ఎం ల మొత్తం దాడిశక్తిని యిప్పుడున్న స్థాయికి కనీసం 50 శాతమైనా తగ్గించాలనే, ఏపక్షమూ వీటి దాడిశక్తిలో యీస్థాయిని మించకూడదనే అంగీకారం. అలాంటి ఒప్పందాన్ని వుభయులకూ సంతృప్తికరమైన పద్ధతిలో నమోదు చేయడం జరుగుతుంది.

అగ్రప్రాధాన్య కర్తవ్యాలుగా వారు యీ కింది సమస్యలపట్ల దృష్టి కేంద్రీకరించాల్సిన అవసరం వుంది:

(ఎ) యీ తగ్గింపులు వ్యూహాత్మక స్థిరత్వాన్ని పెంపొందించేట్టు హామీకల్పించడానికి అదనపు చర్యలు అవసరం. మొత్తం ఆయుధాల గరిష్ట సంఖ్య 6000 కు మించకూడదు. అందులో ఐ. సి. బి. ఎం దానితోబాటు ఎస్. ఎల్. బి. ఎం పై వుండే మొత్తం ఆయుధాలసంఖ్య 4900 కు మించకూడదు అనేది యిందులో భాగం.

(బి) దూరశ్రేణి, గగనయాన అణ్వాయుధ క్రూయిజ్ మిసిలీలను (ఎ. ఎల్. సి. ఎం లు) లెక్కపెట్టే విబంధనలు అన్ని రకాల భారీబాంబర్లకుకూడా వర్తింపజేయాలి. ప్రతినిధివర్గం యీ రంగంలో నిర్దిష్ట విబంధలను నిర్వచించాలి:

(సి) ఇక ప్రస్తుతమున్న బాలిస్టిక్ మిసిలీలను లెక్కగట్టే నియమాలు. ప్రస్తుతమున్న రకాల బాలిస్టిక్ మిసిలీల అణుశీర్షాలు, యీ కిందకనబర్చిన సంఖ్యలో మోహరించి వున్నాయనే అవగాహనను వుభయ పక్షాలూ ప్రాతిపదికగా చేసుకున్నాయి: అమెరికాలో: పీస్‌కీపర్ (ఎం. ఎక్స్): 10, మైన్యూట్‌మన్-III : 3, మైన్యూట్-II : 1. ట్రైడెండ్-I : 8, ట్రైడెంట్ II: 8, పొసైడన్: 10. సోవియట్ యూనియన్‌లో: ఎస్. ఎస-17 : 4, ఎస్. ఎస-19 : 6, ఎస్. ఎస-18 : 10, ఎస్. ఎస-24: 10, ఎస్. ఎస-25 : 1, ఎస్. ఎస-11 : 1, ఎస్. ఎస-13:1, ఎస్. ఎస-ఎన్-6:1, ఎస్ఎస్-ఎన్-8:1, ఎస్ఎస్-ఎన్ 17:1, ఎస్-ఎస్-ఎన్-18 : 7, ఎస్-ఎస్-ఎన్-20. 10, ఎస్-ఎస్-ఎన్-23 : 4. మోహరించివున్న అన్ని నిర్దిష్ట బాలిస్టిక్ మిసిలీపైగల అణుశీర్షాల సంఖ్యను తనిఖీచేయడానికి వీలు కల్పించే పద్ధతిని అభివృద్ధిచేయడం జరుగుతుంది. మోహరించివున్న ఒకరకం బాలిస్టిక్ మిసిలీపైగల ప్రకటిత అణుశీర్షాల సంఖ్యను యేపక్షమైనా మార్చదలచుకుంటే వుభయ పక్షాలు పరస్పరం యీ విషయాన్ని ముందుగా తెలియజేసుకోవాలి. వ్యూహాత్మక దాడి ఆయుధాల తగ్గింపు, పరిమితుల గురించిన సంధి పరివ్యాప్తమైన భావిరకాల బాలిస్టిక్ మిసిలీలపై అణుశీర్షాలను యెలా లెక్కగట్టాలి అనే అంశంపై కూడా ఒక ఒప్పందంవుండాలి

(డి) దీర్ఘశ్రేణి అణ్వాయుధ ఎస్ ఎల్. సి. ఎం ల మోహరింపును పరిమితం చేసే సమస్యకు పరస్పర ఆమోదయోగ్యమైన పరిష్కారాన్ని వుభయ పక్షాలూ కనుగొంటాయి. మొత్తం 6,000 లోగా అణుశీర్షాలుగల దీర్ఘశ్రేణి, అణ్వస్త్ర ఎస్. ఎల్. సి. ఎం లకు, అలాగే 1600 వ్యూహాత్మకదాడి వాహన వ్యవస్థకు పైజెప్పిన పరిమితులు వర్తించబోవు. అలాంటి మిసిలీలపై పరిమితులను తామే నెలకొల్పుతామని వుభయపక్షాలూ నిబద్ధతను వ్యక్తంచేశాయి: అలాగే అలాంటి పరిమితుల తనిఖీకోసం పరస్పర ఆమోదయోగ్యమైన, ఫలప్రదమైన పద్ధతులను తామే స్వయంగా కనుగొనాలనే నిబద్ధతను వ్యక్తంచేశాయి. వీటిలో జాతీయ సాంకేతిక సాధనాల వినియోగం, సహకార చర్యలు,

ప్రత్యక్ష తనిఖీలు వుంటాయి.

(ఇ) తమ మధ్యశ్రేణి, స్వల్పశ్రేణి మిసిలీల నిర్మూలనగురించిన సంధిలోని నిబంధనలపై ఆధారపడి, వ్యూహాత్మకదాడి ఆయుధాల పరిమితి, తగ్గింపుల తనిఖీ గురించిన సంధి నిబంధనల ప్రకారం రూపొందించే చర్యలలో కనీసం యీ కిందివి వుండాలి:

1. సంధి ప్రకారం పరిమితం చేసిన ఆయుధ వ్యవస్థల సంఖ్యను, వాటిని వుంచిన స్థలాలను గురించి, అలాగే అలాంటి వ్యవస్థలు గల సదుపాయాల స్థలాలనుగురించి వుభయ పక్షాలూ చేసే ప్రకటనలతో కూడిన సమాచార ఆదానప్రదానాలు. సదుపాయాలు అంటే యివి: యీ సంధికి పరివ్యాప్తమైనట్టి వ్యవస్థలను వుత్పత్తి చేయడంకోసం, అంతిమంగా కూర్పుచేయడంకోసం, విల్వచేయడంకోసం, పరీక్షించడంకోసం, మోహరించడంకోసం నెలకొల్పిన సదుపాయాలు, వాటిని నెలకొల్పిన స్థలాలు. యిలాంటి ప్రకటనలను సంధిపై సంతకాలు జరగక ముందే పక్షాలు పరస్పరం తెలియజేసుకోవాలి; సంధి అమలులోకి వచ్చిన తర్వాత నియతకాలాల్లో ఆ ప్రకటనలను మెరుగుపర్చాలి.

2. ఈ సంధి అమలులోకివచ్చిన తర్వాత యీ ప్రకటనల కచ్చితత్వాన్ని సకాలంలో తనిఖీ చేయడానికి పునాదిస్థాయి పర్యవేక్షణ.

3. అంగీకరించిన పరిమితులను సాధించడానికి వ్యూహాత్మక వ్యవస్థల నిర్మూలన విషయంలో ప్రత్యక్ష పరిశీలన.

4. ఈ సదుపాయాల వుత్పత్తిని ధ్రువీకరించడానికి కీలక వుత్పత్తి సదుపాయాలకు, సహాయక సదుపాయాలకు సంబంధించిన ఆవరణలచుట్టూ, ప్రవేశద్వారాలవద్దా నిరంతర ప్రత్యక్ష పర్యవేక్షణ.

5. ఈ కింది పేర్కొన్నవాటి విషయంలో ప్రత్యక్ష తనిఖీకి స్వల్పవ్యవధి నోటీసు యివ్వడం:

(i) అంగీకరించిన పరిమితుల మేరకు తగ్గింపుక్రమం అమలుజరిపే స్థలంగురించిన ప్రకటన;

(ii) ఈ సంధికి పరివ్యాప్తమైన అంగీకృత పరిమితులను సాధించిన తర్వాత వ్యవస్థలు మిగిలివున్న స్థలాలు;

(iii) అలాంటి వ్యవస్థలు వున్నట్టి స్థలాలు. (పూర్వమే ప్రకటించిన సదుపాయాలు).

6. వ్యూహాత్మక దాడి ఆయుధాల రహస్య మోహరింపు, వుత్పత్తి, నిల్వ, లేదా మరమ్మతులు జరుగుతున్నాయని యే పక్షమైనా భావిస్తే ఆ స్థలాల తనిఖీకి సంబంధించి స్వల్ప వ్యవధి నోటీసు యిచ్చి అంగీకరించిన పద్ధతుల ప్రకారం దీన్ని అమలుజరిపే హక్కు:

7. జాతీయ సాంకేతిక సాధనాల సహాయంతో తనిఖీ చేయడానికి ఆవరోధం కలిగించే విధంగా మరుగుపర్చడాన్ని లేదా యితర కార్యకలాపాలను నిషేధించే నిబంధనలు. యిలాంటి నిబంధనల్లో టెలీమెట్రీ ఎన్‌క్రిప్షన్‌ను నిషేధించడమూ, మిసిలీ ప్రయాణం సందర్భంగా టెలీమెట్రిక్ సమాచార ప్రసారం పూర్తిగా లభ్యంకావడమూ యిందులో వుంటాయి.

8. జాతీయ సాంకేతిక సాధనాలద్వారా వ్యూహాత్మక దాడి ఆయుధాల తగ్గింపు, పరిమితులకు సంబంధించిన కార్యకలాపాల పరిశీలనను పెంచేందుకు రూపొందించిన

చర్యలు. సంధిప్రకారం పరిమితం చేసినవాటిని మిసిలీ స్థావరాలలో, బాంబర్ స్థావరాలలో, జలాంతర్గాముల రేవులలో తనిఖీబృందం యెంచుకున్న స్థలాలలో, సమయాలలో బహిరంగంగా ప్రదర్శించడం యీ చర్యల్లో వుంటాయి.

జెనీవాలోని తమ ప్రతినిధి వర్గాలు ఒక ఒప్పందాన్ని రూపొందించాలనికూడా వ్యూహాత్మక దాడి ఆయుధాల గురించిన సంధిపత్రం తయారీని దృష్టిలోవుంచుకుని వుభయదేశాల నాయకులూ వారికి ఆదేశమిచ్చారు. ఎ.బి.ఎం సంధి అనుమతిస్తున్న మేరకు అవసరాన్ని బట్టి పరిశోధన, మోహరింపు, పరీక్షలు జరిపే విషయంలో 1972 లో సంతకాలు జరిగిన ఎ.బి.ఎం సంధిని వుభయపక్షాలూ పాటించాలనే, ఒక నిర్ణీతకాలవ్యవధివరకూ ఎ.బి.ఎం సంధినుంచీ వుపసంహరించుకోరాదనే కట్టుబాటు యీ ఒప్పందంలో వుంటుంది. ఈ నిర్దిష్టకాల వ్యవధి ముగియడానికి ముందు మూడేళ్ళలోగానే వ్యూహాత్మక స్థిరత్వాన్ని గురించి ముమ్మరంగా చర్చలు ప్రారంభం కావాలి. ఈ కాలవ్యవధి ముగిసిన తర్వాత పక్షాలు యే ఒప్పందానికీ రాకపోయినట్లయితే, ప్రతి ఒక్క పక్షానికీ తన కార్యాచరణ పంథాను నిర్ణయించుకునే స్వేచ్ఛ వుంటుంది. వ్యూహాత్మక దాడి ఆయుధాల సంధికి, ఎ.బి.ఎం సంధికి, చట్టబద్ధంచేసిన యిలాంటి యితర ఒప్పందాలకు గల ప్రతిపత్తే పైచెప్పిన ఒప్పందానికి కూడా వుండాలి. పరస్పరం సంతృప్తిచెందే విధంగా యీ ఒప్పందాన్ని వమోదు చేస్తారు. అందువల్లే, అగ్రప్రాధాన్య ప్రాతిపదికపై యీ సమస్యలను పరిశీలించాల్సిందిగా వారు తమ ప్రతినిధి వర్గాల ఆదేశమిచ్చారు.

అణుయుద్ధప్రమాదాన్ని తగ్గించడంకో వ్యూహాత్మక పరిస్థితి నెలకొన్నట్టి పరిస్థితు అమెరికా-సోవియట్ వ్యూహాత్మక సంబం సరళిలో రానున్న మార్పులను వూహిం డానికి హామీకల్పించే పద్ధతులను గురిం వుభయపక్షాలూ చర్చిస్తాయి.

## ఇతర ఆయుధాల నియంత్రణ సమస్యలు

ఆయుధాల పరిమితి, తగ్గింపులకు సం ధించిన విస్తృత పరిధిగల యితర సమ లను అధ్యక్షుడు, ప్రధాన కార్యదర్శి ప క్షించారు. భద్రతా విషయాలకు సంబంధి సత్ఫలితాలనివ్వగల సంప్రతింపుల ప్రా ఖ్యాన్ని గురించీ, భద్రత, స్థిరత్వాల పెంపొందించగల సమానప్రాయి, తనిఖీ చే డానికి వీలైన ఒప్పందాలద్వారా ఆయుధా పరిమితి, తగ్గింపుల ప్రధాన రంగాల్లో పురో మించడాన్ని గురించీ వుభయపక్షాలూ నొక్కి చెప్పాయి.

## అణ్వస్త్ర పరీక్షలు

అమెరికా విదేశీ వ్యవహారాల మంత్రి, సోవియట్ యూనియన్ విదేశీ వ్యవహారా మంత్రి 1987 సెప్టెంబర్ 17న వాషింగ్టన్‌లో ఆమోదించిన సంయుక్త ప్రకటన ప్రకారం 1987 నవంబర్ 9 నుంచీ పూర్తిస్థాయి, దశలవారీ సంప్రతింపులు ప్రారంభం కావడాన్ని వుభయ దేశాల నాయకులూ హర్షించారు.

1987 డిసెంబర్ 1 కి పూర్వంనుంచీనే పూర్తిస్థాయి, దశలవారీ సంప్రతింపులు ప్రారంభించడానికి అప్పుడు సోవియట్ యూనియన్, అమెరికా పక్షాలు అంగీకరించాయి: యివి ఒకేచోట జరుగుతాయి. యీ సంప్రతింపుల్లో వుభయపక్షాలూ తొలిచర్యగా ఫలప్రదమైన తనిఖీ చర్యల గురించి అంగీకారానికి వస్తాయి. 1974 నాటి సోవియట్, అమెరికా పరీక్షల నిషేధ ప్రథమ సంధిని, 1976 నాటి శాంతియుత అణు ప్రేలుళ్ళ సంధిని ధ్రువీకరించడానికీ, ఫలప్రదమైన నిరాయుధీకరణ క్రమంలో భాగంగా, అణ్వస్త్ర పరీక్షలను పూర్తిగా నిలిపివేసే అంతిమలక్ష్యానికి దారితీయగలిగిన, అణ్వస్త్ర పరీక్షలపై మధ్యంతర పరిమితులను గురించిన సంప్రతింపుల్లో మరింత ముందుకు సాగడానికీ యిలాంటి అంగీకారం వీలుకల్పిస్తుంది. యితర విషయాలతో బాటు అగ్రప్రాధాన్య అంశంగా, అణ్వాయుధాలను తగ్గించి, చివరకు వాటిని నిర్మూలించడం యీ క్రమం లక్ష్యం. 1974, 1976 నాటి సోవియట్ యూనియన్-అమెరికా సంధులను మరింత సమర్థంగా తనిఖీ చేసే చర్యలను మెరుగుపర్చుకునేందుకు వుభయపక్షాలూ ఒండొరుల పరీక్షస్థలాల్లో సంయుక్త తనిఖీ ప్రయోగాలను రూపొందించి, నిర్వహించదలిచాయి. యీ తనిఖీ చర్యలను సాధ్యమైనంత మేరకు మున్ముందు కుదుర్చుకో వీలున్న అణ్వస్త్ర పరీక్షల పరిమితి ఒప్పందాలలోవినియోగించుకుంటారు.

1988 జనవరిలో ఒండొరుల పరీక్షకేంద్రాలలో నిపుణుల పర్యటన ఆదానప్రదానాలు జరిపేందుకూ, ఒండొరుల పరీక్షస్థలంలో సంయుక్త తనిఖీ ప్రయోగాన్ని రూపొందించి, దాన్ని ఆతర్వాత నిర్వహించేందుకూ వుభయ పక్షాలూ సకాలంలో ఒప్పందం కుదుర్చుకోవడంపట్ల కూడా నాయకులు హర్షం వెలిబుచ్చారు. సోవియట్ యూనియన్, అమెరికాల విదేశాంగమంత్రులు 1987 డిసెంబరు 9 వ విడుదలచేసిన ప్రకటనలో యీ ప్రయోగానికి సంబంధించిన నిర్దిష్ట షరతులను నిర్ధారించారు. 1974 నాటి పరీక్షల నిషేధ ప్రథమ సంధిలోని, 1976 నాటి శాంతియుత అణుప్రేలుళ్ళ సంధిలోని నిబంధనల పాటింపును తనిఖీ చేసేందుకు మరింత ఫలప్రదమైన చర్యలను అభివృద్ధి చేయడంలో యీ ఒప్పందాలకుగల విలువను వుభయదేశాల నాయకులు గుర్తించారు.

## అణ్వస్త్రవ్యాప్తి నిరోధం

అణ్వాయుధాల వ్యాప్తి నిరోధంపట్ల, ముఖ్యంగా అణ్వస్త్రవ్యాప్తి నిరోధక సంధిని పటిష్టం చేయడంపట్ల సోవియట్ యూనియన్, అమెరికాల నిబద్ధత కొనసాగుతూనే వుంటుందని ప్రధాన కార్యదర్శీ, అధ్యక్షుడూ మరోసారి ధ్రువీకరించారు. తమ గత సమావేశం తర్వాత యీ సంధిలో భాగస్వాములైనవారు దీనిపట్ల ప్రదర్శించిన నిబద్ధతను గురించి వుభయదేశాల నాయకులు సంతృప్తి వ్యక్తంచేశారు: యీ సంధిపట్ల సార్వత్రిక నిబద్ధతను సాధించడానికి యితర దేశాలతో కలిసి మరింత కృషిచేయాలనే వుద్దేశం తమకువున్నట్టు వారు రూఢిగా పేర్కొన్నారు.

మరింత పటిష్టంచేసిన ఐ. ఏ. ఇ. ఎ రక్షణలకింద, అణుభద్రత రంగంలోని, అలాగే అణుపదార్థాలు, యంత్ర పరికరాలు, సాంకేతిక పరిజ్ఞానం విషయంలో సముచిత నిపుణనియంత్రణల కింద అణుశక్తిని శాంతి యుత ప్రయోజనాలకోసం వినియోగించే కృషిలో అంతర్జాతీయ సహకారానికి తోడ్పాటునిస్తామని ప్రధాన కార్యదర్శి, అధ్య క్షుడూ వెల్లడించారు. అణ్వస్త్రాల వ్యాప్తి నిరోధానికి సంబంధించిన ద్వైపాక్షిక సంప్ర తింపులు నిర్మాణాత్మకమైనవనీ, ప్రయోజన కరమైనవనీ, వాటిని కొనసాగించాలనీ నాయకులు అంగీకరించారు.

## అణుయుద్ధ ప్రమాదాన్ని తగ్గించే కేంద్రాలు

తమతమ రాజధానుల్లో అణుయుద్ధ ప్రమా దాన్ని తగ్గించే కేంద్రాలను నెలకొల్పడానికి సంబంధించిన ఒప్పందంపై 1987 సెప్టెంబర్ 15 న వాషింగ్టన్‌లో సంతకాలు జరిగినందుకు నాయకులు హర్షం ప్రకటించారు. యీ ఒప్పందాన్ని త్వరలో అమలుజరుపుతారు.

## రసాయనిక ఆయుధాలు

రసాయనిక ఆయుధాల నిషేధాన్ని గురిం చిన, నిర్మూలనను గురించిన, తనిఖీకి సాధ్య మైన,సమగ్రమైన.ఫలప్రదమైన ఒక అంతర్జా తీయ ఒడంబడికకోసం సంప్రతింపులు జరప డానికి వుభయదేశాల నాయకులు తమ నిబద్ధ తను వ్యక్తంచేశారు. యిప్పటివరకూ సాధిం చిన ప్రగతిపట్ల హర్షం వెల్లడిస్తూ, రసా యనిక ఆయుధాలుగల దేశాలకన్నిటికీ పరి వ్యాప్తమయ్యేట్టి, నిజంగా ప్రపంచ వ్యాప్త మైన, తనిఖీ చేయడానికి సాధ్యమైన ఒడం బడికను కుదుర్చుకోడానికి ముమ్మరంగా సంప్రతింపులు జరపాల్సిన అవసరాన్ని గురించి వారు మరోసారి నొక్కిచెప్పారు. మరింత నిష్కపటంగా వ్యవహరించడానికీ, రసాయనిక ఆయుధాలకు సంబంధించి ద్వైపాక్షిక, అలాగే బహుపాక్షిక ప్రాతి పదికపై యితోధిక విశ్వాస సంవర్ధనకు సోవి యట్ యూనియన్, అమెరికాలు సుముఖంగా వున్నాయి. అణ్వాయుధాల వ్యాప్తి, ప్రయో గాల విషయంలో పెరుగుతున్న సమస్యపై నిపుణుల నియతకాలిక చర్చలను కొనసాగిం చాలని వారు అంగీకరించారు.

## సాంప్రదాయిక బలగాలు

యూరప్‌లో సాయుధబలగాల, సాంప్ర దాయిక ఆయుధాల రంగంలో సైనిక తల పాటు స్థాయిని తగ్గించే కర్తవ్యానికిగల ప్రాముఖ్యాన్ని గురించి ప్రధాన కార్యదర్శి, అధ్యక్షుడూ చర్చించారు. యీ సమస్యపై సంప్రతింపులు జరపడానికి ఆదేశమిచ్చే విష యమై వియన్నాలో సాగిస్తున్న పనిని శీఘ్రంగా పూర్తిచేయడానికి సుముఖంగా వున్నట్టు వుభయదేశాల నాయకులూచెప్పారు; యిలా జరిగితే, నిర్దిష్ట చర్యలను రూపొందిం చేందుకు సాధ్యమైనంత త్వరలో ముఖ్యమైన సంప్రతింపులు ప్రారంభించడానికి వీలుకలుగు తుందని వారు పేర్కొన్నారు. యూరప్‌లో విశ్వాసం, భద్రత సంవర్ధన చర్యలు, నిరాయుధీకరణల గురించి స్టాక్ హోంలో జరిగిన సమావేశ నిబంధనలను అమలు జరపడమనేది పరస్పర అవగాహనను పటిష్ట చేయడంలో, స్థిరత్వాన్ని పెంచడంలో ముఖ్య

...న అంశమనీ, యీ క్రమాన్ని కొనసాగించ ...కీ, పటిష్ఠంచేయడానికీ తాము సుముఖంగా ...న్నామనీ వారు చెప్పారు. అపరిష్కృత ...మస్యల పరిష్కారంకోసం కృషిని ...మ్మరం చేయాల్సిందిగా తత్సంబంధిత ప్రతినిధులకు ఆదేశ మివ్వడానికి ప్రధాన ...ర్యదర్శీ, అధ్యక్షుడూ అంగీకరించారు.

వియన్నా సంప్రతింపులను (బలగాలను ...రస్పరం, సమతూకంగా తగ్గించుకునేందు ...ద్దేశించినవి) గురించి కూడా వారు ...ర్చించారు.

## I. యూరప్‌లో భద్రత, సహకారాల గురించి తదనంతర సమావేశం

హెల్సింకీ తుదిచట్టం, మాడ్రిడ్ తుది ...త్రం ప్రకారం అన్ని ప్రధాన రంగాల్లో ...ాధించిన సంతులిత పురోగతి ప్రాతిపదిక పై ...యన్నా సి. ఎస్. సి. ఇ తదనంతర ...మావేశాన్ని జయప్రదంగా ముగించేందుకు ...యూరప్‌లో భద్రత, సహకారాల గురించి ...రిగిన సమావేశంలో పాల్గొన్న తక్కిన ...3 మంది భాగస్వాముల లాగానే వారూ ...మ కృతనిశ్చయాన్ని వెలిబుచ్చారు.

## II. మానవ హక్కులు, మానవీయ సమస్యలు

మానవ హక్కులనుగురించి, మానవీయ ...మస్యలను గురించి, సోవియట్-అమెరికా ...ంభాషణలో వాటి స్థానాన్నిగురించి ఉభయ ...ేశాల నాయకులూ క్షుణ్ణంగా, అరమరికలు ...లేకుండా చర్చించారు.

## III. ప్రాంతీయ సమస్యలు

ఆఫ్ఘనిస్తాన్, ఇరాన్-ఇరాక్ యుద్ధం, మధ్యప్రాచ్యం, కంపూచియా, దక్షిణాది ఆఫ్రికా, మధ్య అమెరికాల సమస్యలు, యితర సమస్యలతో సహా ప్రాంతీయ సమస్యలను గురించి ప్రధాన కార్యదర్శీ, అధ్యక్షుడూ విస్తృతపరిధిలో, అరమరికలు లేకుండా వ్యవహారసరళిలో చర్చజరిపారు. ఈ విషయం తీవ్రమైన విభేదాలు వున్నట్టు వారు తెలిపారు: కానీ, క్రమంతప్పకుండా తమ అభిప్రాయాలను పరస్పరం తెలియ జేసుకోడానికి గల ప్రాముఖ్యాన్నికూడా వారు గుర్తించారు. అంతర్జాతీయ వుద్రిక్తతలను తగ్గించేందుకై, ప్రాక్-పశ్చిమ సంబంధాలను మెరుగుపర్చేందుకై ప్రాంతీయ ఘర్షణల పరిష్కారానికి ప్రాముఖ్యం పెరుగుతున్నట్టు వుభయదేశాల నాయకులు పేర్కొన్నారు. ప్రాంతీయ ఘర్షణలకు తలపడిన పక్షాలు తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను, భద్రతను ముందుకు తీసుకెళ్ళగల పరిష్కారాలను అవి కనుగొనేందుకు తోడ్పడడమే. యీ సమస్యలపై సోవియట్ యూనియన్, అమెరికాలు జరిపేచర్చకు లక్ష్యంగా వుండాలని వారు అంగీకరించారు. ప్రాంతీయ ఘర్షణల పరిష్కారానికి దోహదం చేసేందుకు ఐక్య రాజ్యసమితి, యితర అంతర్జాతీయ సంస్థల పాత్రను పెంచే విషయానికి గల ప్రాముఖ్యాన్ని గురించి వుభయదేశాల నాయకులూ నొక్కిచెప్పారు.

## IV. ద్వైపాక్షిక వ్యవహారాలు

సోవియట్-అమెరికా ద్వైపాక్షిక సంబంధాల పరిస్థితిని ప్రధానకార్యదర్శీ, అధ్యక్షుడూ

వివరంగా సమీక్షించారు. ద్వైపాక్షిక సంబంధాలను, ఆదానప్రదానాలను, సహకారాన్ని మరింత విస్తృతపర్చి పటిష్టంచేయడంవల్ల వుపయోగముంటుందని వుభయులూ గుర్తించారు.

## ద్వైపాక్షిక సంప్రతింపులు

అనేక నిర్దిష్ట ద్వైపాక్షిక సమస్యలపై ప్రస్తుతం జరుగుతున్న అమెరికా-సోవియట్ సంప్రతింపుల స్థితిగతులను సమీక్షించిన తర్వాత యీ విషయంలో తమ ప్రతినిధులు ముమ్మరంగా కృషి జరపాలని వుభయదేశాల నాయకులూ వారికి విజ్ఞప్తి చేశారు; యీ కింది అంశాలపై పరస్పర ప్రయోజనకరమైన ఒప్పందాలను కుదుర్చుకోవడం యీ కృషి లక్ష్యం: వాణిజ్యనౌకాయాన సమస్యలు; చేప-పట్టడం; సముద్ర అన్వేషణ; అపాయపరిస్థితిలో ఆదుకుని రక్షించడం; సముద్రయాన రేడియో వ్యవస్థలు; సోవియట్ యూనియన్-అమెరికా తీరస్థ సరిహద్దు; రవాణా, తదితర రంగాలలో సహకారం.

అయిరఫ్లోత్, పాన్ అమెరికన్ ఎయిర్ వేస్‌లు మాస్కో-న్యూయార్క్ ప్రయాణ మార్గాన్ని సంయుక్తంగా నిర్వహించడంతో సహా, సోవియట్-అమెరికా విమానరవాణా ఒప్పంద పరిధిలో నేరుగా ప్రయాణీకుల విమాన సర్వీసును విస్తరించడం గురించిన ఒప్పందంపట్ల, ప్రపంచ సముద్రం గురించిన సోవియట్-అమెరికా ఒప్పందాన్ని పునరుద్ధరించడంపట్ల వారు సంతృప్తి వ్యక్తంచేశారు.

## ప్రజలకూ ప్రజలకూ మధ్య సంబంధాలు, ఆదానప్రదానాలు

విద్య, శాస్త్రవిజ్ఞానం, సంస్కృతి, క్రీడల రంగాలకు సంబంధించి 1985 నవంబరులో జెనీవా సమావేశంలో సంతకాలు జరిగిన సోవియట్-అమెరికా సాధారణ ఆదాన ప్రదానాల ఒప్పందాన్ని అమలు జరపడంలో సాధించిన పురోగతిని వుభయదేశాలూ పరిగణనలోకి తీసుకున్నాయి; యీ రంగాలలో మరింత పురోగమించడానికి గల అవరోధాలను తొలగించే కృషి కొనసాగించేందుకు అంగీకరించాయి. తొలి ఆదానప్రదానాల ఒప్పందపు 30 వ వార్షికోత్సవాన్ని 1988 జనవరిలో జరుపుకోడానికి సంబంధించిన పథకాలపట్ల వారు సంతృప్తి వ్యక్తంచేశారు.

తమ తమ ప్రజలమధ్య అవగాహనను విస్తృతం చేయడంలో సంబంధాలకూ, ఆదానప్రదానాలకూ గల ప్రాముఖ్యాన్ని వుభయదేశాల నాయకులూ మరోసారి ధ్రువీకరించారు జెనీవాలో, 1985 లో జరిగిన తమ సమావేశంలో తీసుకున్న చొరవ ప్రకారం ప్రజలకూ ప్రజలకూ మధ్య సంబంధాల— గత రెండేళ్ళలో లక్షలాది మంది సోవియట్, అమెరికా పౌరులు పాల్గొన్న క్రమం యిది —అభివృద్ధిలో సాధించిన పురోగతిపట్ల వారు ప్రత్యేకించి సంతృప్తి వ్యక్తంచేశారు. యువజనులతో సహా, యిలాంటి సంబంధాలను మరింత విస్తరించడంపట్ల తమకుగల బలమైన నిబద్ధతను గురించి వుభయదేశాల నాయకులూ మరోసారి నొక్కిచెప్పారు.

## ప్రపంచ వాతావరణంలో, పరిసరాలలో మార్పు గురించిన ప్రతిపాదన

స్ట్రాటావరణంలో ఓజోన్‌పొర రక్షణ, పరిరక్షణలాంటి, పరస్పరం శ్రద్ధ వహించాల్సిన రంగాలలో సహకారం; సోవియట్-అమెరికా పరిసరాల పరిరక్షణ ఒప్పందాన్నీ, శాంతియుత ప్రయోజనాలకోసం దూరగోదసిని అన్వేషించి వినియోగించుకోవడంలో సహకారానికి సంబంధించి సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల సమాఖ్యకూ, అమెరికాసంయుక్త రాష్ట్రాలకూ మధ్య కుదిరిన ఒప్పందాన్నీ అనుసరించి సమాచార ఆదాన ప్రదానాలను పెంచడం—వీటిద్వారా, ప్రపంచ వాతావరణంలో, పరిసరాల్లో వస్తున్న మార్పులపై సంయుక్త అధ్యయనాలు జరపాలని చేసిన ద్వైపాక్షిక ప్రతిపాదనను పరిసరాల పరిరక్షణలో సహకారాన్ని గురించి 1985 నవంబర్‌లో జెనీవాలో చేసుకున్న ఒప్పందం ప్రకారం వుభయదేశాల నాయకులు ఆమోదించారు. ఈ దృష్ట్యా, భవిష్యత్తు శీతోష్ణస్థితి గురించి వివరంగా అధ్యయనం జరుగుతుంది. ప్రపంచ శీతోష్ణస్థితిలో, పరిసరాలలో వస్తున్న మార్పుల రంగానికి అంతకంతకూ ప్రాముఖ్యత పెరుగుతోంది: యీ రంగంలో విస్తృత అంతర్జాతీయ, ద్వైపాక్షిక సహకారాన్ని వుభయపక్షాలూ పెంపొందిస్తూనే వుంటాయి.

## సహకార కార్యకలాపాలు

శాంతియుత ప్రయోజనాలకోసం నియంత్రిత థెర్మోన్యూక్లియర్ ఫ్యూజన్‌ను వుపయోగించుకోవడంలో సోవియట్ యూనియన్‌కు, అమెరికాకు, ఇతర దేశాలకు చెందిన శాస్త్రవేత్తలమధ్య మరింత సహకారం నెరపే విషయాన్ని ప్రధానకార్యదర్శీ, అధ్యక్షుడూ సమర్థించారు. ఫ్యూజన్ టెస్ట్ రియాక్టర్‌కు సంబంధించిన నాలుగుభాగాలు గల కాన్సెప్చ్యల్ డిజైన్ విషయంలో అంతర్జాతీయ అణుశక్తి ఏజెన్సీ ఆధర్యాన యూరపియన్ ఆటమిక్ ఎనర్జీ సంస్థతో (యూరాటం), జపాన్‌తో సహకారం నెరపాలనే వుద్దేశం సోవియట్ యూనియన్, అమెరికాలకు వున్నట్టు వారు రూఢిగా చెప్పారు.

అణుశక్తిని శాంతియుత ప్రయోజనాలకు వుపయోగించుకోవడం గురించిన ద్వైపాక్షిక ఒప్పందం ప్రకారం అణు రియాక్టర్ భద్రతా రంగంలో ఒక శాశ్వత కార్యాచరణ బృందాన్ని యేర్పాటుచేసే విషయంలో సాధించిన పురోగతిపై వుభయదేశాల నాయకులూ సంతృప్తి వ్యక్తంచేశారు: యీ రంగంలో సహకారాన్ని మరింత అభివృద్ధి చేయడానికి తమ సంసిద్ధతను వెల్లడించారు.

మాదకద్రవ్యాల అంతర్జాతీయ దొంగ రవాణాను అరికట్టడంలో ద్వైపాక్షిక సహకారాన్ని వృద్ధిచేయడానికి ప్రధాన కార్యదర్శీ, అధ్యక్షుడూ అంగీకరించారు. యిందుకోసం 1988 ప్రారంభంలో తగువిధమైన ప్రాథమిక సంప్రతింపులు జరపడానికి వారు అంగీకరించారు.

విమాన, సముద్ర రవాణాల భద్రతకు హామీ కల్పించడంలో మరింత ఫలప్రదమైన సహకారాన్ని అభివృద్ధిచేసేందుకై, యిటీవల నెలకొన్న సంబంధాలను పెంపొందించడానికి కూడా వారు అంగీకరించారు.

ఆర్కిటిక్‌కు సంబంధించిన సమస్యల విషయంలో విస్తృత సంబంధాలను, సహకారాన్ని ప్రోత్సహించే పద్ధతులగురించి వుభయ దేశాల నాయకులూ పరస్పరం అభిప్రాయాలు తెలియజేసుకున్నారు. ఆర్కిటిక్ ప్రాంత పరిసరాల పరిరక్షణ శాస్త్రీయ పరిశోధనలో సమన్వయ కృషితోసహా, యీ విషయాలపై ఆర్కిటిక్ దేశాల మధ్య ద్వైపాక్షిక, ప్రాంతీయ సహకారానికి వారు తమ తోడ్పాటును వ్యక్తం చేశారు.

సోవియట్ యూనియన్, అమెరికా, ఫ్రాన్స్, కెనడాలు సంయుక్తంగా నిర్వహిస్తున్న అంతరిక్షస్థిత కోసపాస్/సర్నాట్‌ల భూగోళ పరిశోధనకు, ఆపదల్లో ఆదుకునే వ్యవస్థకు సంస్థాగతరూపం యిచ్చేందుకు సంప్రతింపులు జరపాలనే నిర్ధారణను వుభయదేశాల నాయకులూ హర్షించారు.

## వాణిజ్యం

పరస్పర ప్రయోజనకరమైన వాణిజ్య, ఆర్థిక సంబంధాల విస్తరణకు వుభయపక్షాలూ తమ గట్టి మద్దతును ప్రకటించాయి. యీ లక్ష్యాన్ని సాధించడానికి నిర్దిష్ట ప్రతిపాదనలను రూపొందించేందుకై అమెరికా-సోవియట్ యూనియన్ సంయుక్త వాణిజ్య కమిషన్‌ను సమావేశపర్చాల్సిందిగా తమ తమ వాణిజ్య మంత్రులకు వారు ఆదేశమిచ్చారు. ఆర్థిక, పారిశ్రామిక, సాంకేతిక సహకారాన్ని పెంపొందించేందుకు అమెరికా సంయుక్తరాష్ట్రాలకూ, సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల సమాఖ్యకూ మధ్య కుదిరిన దీర్ఘకాలిక ఒప్పందం పరిధిలో నిర్దిష్ట ప్రతిపాదనలను రూపొందించడం కూడా యీ లక్ష్యంలో భాగం. వుభయదేశాల చట్టాలకూ, నిబంధనలకూ అనుగుణమైన, వాణిజ్య పరంగా లాభదాయకమైన సంయుక్త ప్రాజెక్టులు అనేవి వాణిజ్య సంబంధాలను మరింత అభివృద్ధి చేయడంలో సరైన పాత్రను నిర్వహించగలవని వారు అంగీకరించారు.

## దౌత్య సంస్థలు

తమతమ దౌత్య, కాన్సులర్ సంస్థలకు సముచితమైన, సురక్షితమైన సదుపాయాలు కల్పించడానికిగల ప్రాముఖ్యతను వుభయ పక్షాలూ అంగీకరించాయి. రాయబార కార్యాలయాల, కాన్సులేట్స్ జనరల్ కార్యాయాల పని తీరుకు సంబంధించిన సమస్యలను నిర్మాణాత్మకంగా, పారస్పర్యత ప్రాతిపదికపై పరిశీలించాల్సిన అవసరాన్ని గురించి వారు నొక్కి చెప్పారు.

## భవిష్యత్ సమావేశాలు

అన్ని స్థాయిల్లో అధికారిక సంబంధాలను మరింత విస్తరింప చేయాలనీ, ముమ్మరం చేయాలనీ, అలాగే సోవియట్-అమెరికా బాంధవ్యంలోని అన్ని రంగాల్లో ప్రత్యక్ష, నిర్దిష్ట ఫలితాలు సాధించడం దీనికి లక్ష్యంగా వుండాలనీ ప్రధాన కార్యదర్శి, అధ్యక్షుడూ అంగీకరించారు.

సోవియట్ యూనియన్‌ను సందర్శించాల్సిందిగా అధ్యక్షుడు రీగన్‌ను ప్రధాన కార్యదర్శి గోర్బచేవ్ జెనీవా శిఖరాగ్ర సమావేశం సందర్భంగా అందించిన ఆహ్వానాన్ని గుర్తుచేస్తూ రీగన్‌ను మళ్ళీ ఆహ్వానించారు. ఆహ్వానాన్ని అధ్యక్షుడు రీగన్ సంతోషంగా అంగీకరించారు. యీ పర్యటన 1988 ప్రథమార్ధంలో జరుగుతుంది.

(టాస్, 1987 డిసెంబర్ 11)

# బెర్లిన్‌లో వార్సాసంధి దేశాల నాయకుల సమావేశం

వార్సాసంధి సభ్యదేశాల సోదర పార్టీల కేంద్రకమిటీల ప్రధాన (ప్రథమ) కార్యదర్శులు పరస్పర అంగీకారంతో 1987 డిసెంబరు 11న బెర్లిన్‌లో సమావేశమయ్యారు.

తమ అమెరికా పర్యటనను, అధ్యక్షులు రీగన్‌తో తమ చర్చల సరళిని, ఫలితాలను యీ సమావేశానికి మిహయిల్ గోర్బచేవ్ సవివరంగా నివేదించారు.

వాషింగ్టన్‌లో జరిగిన చర్చలకు బంధు దేశాల నాయకులు తమ పూర్తి ఆమోదాన్ని తెలియజేశారు. ఆ చర్చల ఫలితాలను యెంతో విలువైనవిగా అంచనావేశారు.

జర్మనీ సోషలిస్టు యూనిటీ పార్టీ ప్రధాన కార్యదర్శి, జి. డి. ఆర్ స్టేట్ కౌన్సిల్ అధ్యక్షుడు అయిన ఎరిక్ హోనెకర్ వార్సా సంధి రాజ్యాల నాయకుల సమావేశంలో పాల్గొన్నవారి గౌరవార్థం స్టేట్ కౌన్సిల్ ఆవరణలో విందు చేశారు.

సమావేశంలో పాల్గొన్నవారి నుద్దేశిస్తూ మిహయిల్ గోర్బచేవ్ ప్రసంగించారు. ఆయన ప్రసంగ పాఠం యీ కింద యిస్తున్నాం:

ప్రియమైన కామ్రేడ్స్, మిత్రులారా,

సోవియట్, అమెరికా శిఖరాగ్ర సమావేశం ముగిసినవెంటనే యిక్కడ, బెర్లిన్‌లో మన సమావేశంలో ఒకరి అభిప్రాయాలను మరొకరు తెలుపుకున్న తీరుపట్ల నా ప్రగాఢ సంతృప్తిని మొదట వ్యక్తం చేయదల్చుకున్నాను. ప్రపంచ భవిష్యత్తు దృష్ట్యా యీ శిఖరాగ్ర సమావేశానికిగల ప్రాధాన్యతను అంచనావేయడంలో మన యేకాభిప్రాయం యిక్కడ వెల్లడైంది.

ఈ విషయాన్ని ఎరిక్ హోనెకర్ యిప్పుడే మనముందు యెంతో చక్కగా వుంచారు. సమావేశంలో పాల్గొన్నవారంతా యిదే అభిప్రాయాన్ని వెల్లడించారు.

రెండు తరగతుల అణ్వాయుధాలను నిర్మూలించే మొదటి సంధిపై సంతకం జరగడమనేది చరిత్రనుసృష్టించిన ముందంజ అని చెప్పడం అతిశయోక్తి కాదు.

ఈ సంక్లిష్ట సమస్యను పరిష్కరించడానికి అనేక కారకాలు తమ వంతు కర్తవ్యాన్ని నిర్వర్తించాయి. సోషలిస్టు దేశాల సమన్వయీకృత చర్యలు లేనిదే నిరాయుధీకరణకు వాటి యేకోన్ముఖ, నిరంతరకృషి లేనిదే, యింతకుముందే అమలులోకి వచ్చిన చర్యలతోసహా యీ లక్ష్యసాధనకు వుద్దేశించిన అనుకూలమైన వాటి కార్యక్రమంలేనిదే యిది సాధ్యమయ్యేది కాదు.

అధ్యక్షులు రీగన్‌తో చర్చలు జరిపే సందర్భంలో సోవియట్ ప్రతినిధివర్గం తన మిత్రులు, బంధువులు యిచ్చిన ఒక విధమైన ఆదేశాన్ని ప్రాతిపదికగా చేసుకుని వ్యవహరించిందని కామ్రేడ్ ఎరిక్ హోనేకర్ చెప్పినది పూర్తిగా సరియైనదే. యిది మా వైఖరికి ఒక ప్రత్యేక ప్రాధాన్యతను సంతరించిపెట్టింది: అదేసమయంలో చర్చల్లో

ఫలితాల సాధనపట్ల మా బాధ్యతను మరింతగా గుర్తెరిగేటట్టు చేసింది. అందువల్ల సాధించిన విజయం మన సమిష్టి కృషిఫలితమని సకారణంగానే చెప్పవచ్చు.

జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్కు, జెకొస్లొవేకియాల నాయకత్వం చేపట్టిన నిర్మాణాత్మక వైఖరిని నేను ప్రత్యేకంగా పేర్కొనదలిచాను. యీ దేశాల భూభాగాల గురించి సంధిలో ప్రస్తావించిన భాగాన్ని అమలు జరపడానికి సంబంధించిన నిర్దిష్ట సమస్యలన్నిటి విషయంలో అంగీకారానికి రావడం యీ వైఖరివల్లే వీలుపడింది.

వాషింగ్టన్ సమావేశ ఫలితాలను యిప్పుడు ప్రపంచంలో ప్రతి ఒక్కచోటా ముమ్మరంగా చర్చిస్తున్నారు. ప్రపంచ యుద్ధానంతర కాలంలో చాలా కొద్ది ఘటనలు మాత్రమే యింతటి ఆసక్తికరమైన, సానుకూలమైన ప్రతిస్పందనను, భవిష్యత్తుపట్ల యింతటి ఆశలను కల్గించాయి. యిది యెంతో స్పష్టంగా విదితమౌతోంది. యీ విషయం తెలుసుకోడానికి వేరే అభిప్రాయ సేకరణలేవీ అవసరం లేదు.

వాషింగ్టన్ సంధిని యీ రెండు అంశాలుగా పరిగణించడానికి తగిన కారణముంది: యేడు సంవత్సరాల సుదీర్ఘ రాజకీయ, దౌత్య కృషి ముగింపు, ఆయుధ పోటీని నిజంగా నిలువరించడానికి మొదటి అంజ: అంతర్జాతీయ సంబంధాల అభివృద్ధిలో ఒక దశ సమాప్తి, మరో దశ ఆరంభం.

ఈ నూతన దశ సానుకూల పరిస్థితుల్లో ప్రారంభమౌతోంది. వ్యూహాత్మక దాడి ఆయుధాలను 50 శాతం తగ్గించే విషయంలో పురోగమనం అని నా అభిప్రాయం. యితర తక్షణ సమస్యల పరిష్కారంకోసం యే మాత్రం జాప్యంచేయకుండా కృషి చేయడం అవసరమని పరస్పరం ఒక అవగాహనకు రావడంకూడా జరిగింది—అని రసాయనిక ఆయుధాల నిర్మూలన, అణ్వస్త్ర పరీక్షలకు స్వస్తి, సాంప్రదాయక ఆయుధాల, సాయుధ బలగాల తగ్గింపు. ప్రాంతీయ ఘర్షణల పరిష్కారంకోసం అన్వేషణ,మానవ సమస్యలతోసహా మానవీయ సమస్యలను గంభీర, బాధ్యతా భావంతో చర్చించడం కొనసాగుతాయి.

దీనంతటికీ యెలాంటి కృషి అవసరం లేదనీ, నిరాయుధీకరణ రైలుబండి వేగాన్ని పుంజుకొని దానంతటికదే ముందుకు దూసుకపోతుందనీ అనుకోవడం శుద్ధ పొరపాటు అవుతుందనేది నిజం. మనం వాస్తవిక వాదులం. మరో అంజకు, మొదటి అంజ తర్వాత వేసే ముఖ్యమైన, భారీస్థాయి అంజలకు హామీ కల్పించడానికి యెంతటి కృషి అవసరమో మనకు బాగా తెలుసు.

ఇక మనకు సంబంధించి నంతవరకూ వాషింగ్టన్‌లో సంతకాలు జరిగిన సంధి అనంతరపు నూతన ఒప్పందాలకోసం ముందుకు సాగడానికీ, ప్రాణాంతక ఆయుధాగారాల నుండి మానవాళి మనుగడకు ప్రమాదం లేకుండా వాటిని తుదకంటా తగ్గించడానికీ హామీ కల్పించే నిమిత్తం సోవియట్ యూనియన్, యితర సోషలిస్టు దేశాలు చేయగల్గినదంతా చేస్తాయని ప్రపంచ ప్రజలు భరోసాతో వుండవచ్చు.

మరో ముఖ్యపరిస్థితినికూడా నేను నొక్కి

చెప్పదలిచాను. అంతర్జాతీయ రంగంలో ప్రారంభమైన మంచి మార్పులు యిప్పుడు సోదర దేశాల్లో సోషలిజాన్ని మెరుగు పర్చడానికి, పునర్నవీకరించడానికి జరుగుతున్న బృహత్ కృషితో విడదీయ వీలులేనంతగా ముడిపడివున్నాయి.

ఈ క్రమాల దేశీయాంగ పార్శ్వం యెక్కడ ముగుస్తుందో, విదేశాంగ పార్శ్వం యెక్కడ ప్రారంభమౌతుందో చెప్పడం కష్టం. మన దేశాల్లోని ఆర్థికాభివృద్ధి త్వరణం ప్రజాస్వామ్యీకరణ, యితోధిక బాహాటత — యివి అసలు సోషలిజం స్వరూపాన్నే మార్చివేస్తున్నాయి. దశాబ్దాలుగా పాశ్చాత్యదేశాల్లో రూపుగొన్న ప్రచారతంతులను పనికిరాకుండా చేస్తున్నాయి; శాంతి, ప్రగతుల ప్రయోజనాల కోసం ఫలవంతమైన సహకారానికి, దేశ దేశాల ప్రజల్లో పరస్పర అవగాహనకూ అవకాశాలను విస్తరింప చేస్తున్నాయి.

సోవియట్ కమ్యూనిస్టులమైన మేము పెరిస్త్రోయికా కృషినీ, శాంతియుత సహజీవన పటిష్టీకరణనూ ఒకే విధానానికిచెందిన రెండు అంశాలుగా పరిగణిస్తున్నాం. యిది శాంతి, స్వేచ్ఛాయుత శ్రమ, న్యాయం, ప్రజల సంక్షేమం దిశలో వున్ముఖమైవుంది.

కార్మేడ్స్, యీనాడు ప్రపంచంలోని ప్రజలంతా యీ సంవత్సరానికి వీడ్కోలు చెప్పడానికి, 1988 నూతన సంవత్సరానికి స్వాగతం పలకడానికి సన్నద్ధమౌతున్నారు. గడిచిపోయే సంవత్సరం కన్నా రానున్న సంవత్సరం మెరుగ్గా వుంటుందని యీ సందర్భంగా ప్రతిఒక్కరూ ఆశించడం సహజమే. ఐ. ఎన్. ఎఫ్ సంధి యావన్మంది ప్రజలకు నూతన సంవత్సరపు ఒక మంచి, గొప్ప కానుక. ప్రపంచంలోని అనేక మిలియన్ల ప్రజల ఆశల సాఫల్యత అనేది మన పార్టీల కార్యకలాపాలపై, మన రాజ్యాల విధానాలపై చాలావరకు ఆధారపడివుంటాయి. యిందుకోసం మనం పట్టుదలతో కృషి చేస్తాం.

నా ప్రసంగాన్ని ముగించేముందు జర్మన్ కార్మేడ్స్ యిచ్చిన ఆతిధ్యానికి హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలుపుతున్నాను.

మా పార్టీ తరపున, సోవియట్ ప్రజల తరపున సోదర సోషలిస్టుదేశాల కమ్యూనిస్టులకు, శ్రామికప్రజలకు అందరికీ అభినందనలు తెలియజేస్తున్నాను.

(ప్రావ్దా, డిసెంబరు, 12, 1987)

# సోవియట్ టెలివిజన్‌లో గొర్బచేవ్ ప్రసంగం

సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి మిహాయిల్ గొర్బచేవ్ డిసెంబరు 15 రాత్రి సోవియట్ సెంట్రల్ టెలివిజన్‌లో ప్రసంగించారు. అయన ప్రసంగ పూర్తి పాఠమిది :

ప్రియమైన కామ్రేడ్స్, నమస్కారాలు

నా అమెరికా పర్యటన ముగిసింది. నా అమెరికా పర్యటనకు గడిచిన మార్గం సులభమైనదేమీకాదు: అంతకుముందు జెనీవా, రక్యావిక్ సమావేశాలు జరిగాయి: సోవియట్ యూనియన్, అమెరికా నాయకులమధ్య ముమ్మర సంభాషణలు జరిగాయి: దౌత్యపరమైన ముమ్మర సంప్రతింపులు జరిగాయి.

మన బంధుదేశాలతో మనం సర్వదా సంప్రదిస్తూనేవున్నాం. యితర రాజ్యాల నాయకులతో అభిప్రాయాలను చురుకుగా పరస్పరం తెలియ జేసుకుంటూనేవున్నాం. ప్రపంచ ప్రజల, శాస్త్ర, సాంస్కృతిక రంగకార్యకర్తల, శాంతిని సమర్థిస్తున్న విభిన్న రాజకీయ ధోరణులుగల ప్రతినిధుల మనోభావాలను ప్రత్యేకించి శ్రద్ధతో ఆలకిస్తూనే వున్నాం. యిదంతా ప్రపంచంలో జరుగుతున్న క్రమాలపట్ల మనఆలోచనను సుసంపన్నంచేసింది; మనం సరియైన దిశలో సాగుతున్నామనే విశ్వాసాన్ని మనలోపాదు కొల్పింది.

ఈ విధంగా మేము వాషింగ్టన్‌కు మన ప్రజల, మన బంధుదేశాల ఆదేశంతో వెళ్ళాం. మిలియన్లాది సహృదయుల మనోభావాలను, కోరికలను పరిగణనలోకి తీసుకుని వెళ్ళాం.

అక్కడ వాషింగ్టన్‌లో మేము అనుసరించాల్సిన సూత్రబద్ధ వైఖరిని అనేకసార్లు పొలిట్ బ్యూరోలో చర్చించి, సమగ్రంగా ఆచితూచి, అన్నివిధాలా సన్నద్ధమై వెళ్ళాం. ప్రతి విషయాన్ని సైనిక-సాంకేతిక దృక్కోణంనుండి పదే పదే పరిశీలించాం. మన పార్టీ 27 వ మహాసభ నిర్ణయాలు, 1986 జనవరి 15 న ప్రకటించిన అణ్వస్త్రరహిత ప్రపంచ స్థాపనా కార్యక్రమం—యివీ యీ సన్నాహాలకు తాత్విక రాజకీయ పునాదిగా వుండినాయి.

మా పర్యటన ఫలితాలూ, సారమూ అందరికీ తెలిసిందే. మధ్యశ్రేణి మిసిలీల నిర్మూలన గురించిన సంధిపై అమెరికా అధ్యక్షునితో కలిసి మేము సంతకం చేశాం. ఈ సమస్యపై కుదిరిన ఒప్పందం ఒక ప్రధాన అంతర్జాతీయ ఘటన; నూతన రాజకీయ ఆలోచనాధోరణికి విజయం.

వ్యూహాత్మక దాడి ఆయుధాల తగ్గింపు సమస్యపై చర్చలు బాగా కేంద్రీకరించాం. ఈ చర్చలు మా సమయంలో యెక్కువ భాగాన్ని తీసుకున్నాయి. 1972 లో ఆమోదించిన ఎ. బి. ఎం సంధిని చెక్కుచెదరకుండా వుంచితేనే వ్యూహాత్మక దాడి ఆయుధాలను 50 శాతం తగ్గించడానికి అంగీకరిస్తామని మన సంసిద్ధతను పునరుద్ఘాటించాం. యీ సమావేశం ఫలితాలపై విడుదల చేసిన సంయుక్త ప్రకటనలో యిది ప్రతిబింబితమైంది.

అణుపరీక్షలకు స్వస్తి చెప్పే సంధిని సాధ్యమైనంత త్వరలో కుదుర్చుకోవాల్సిన ఆవశ్యకతను మేము మరోసారి బాగా అవగతమయ్యేట్టు ముందుకుతెచ్చాం. రసాయనిక ఆయుధాల నిర్మూలన సమస్యను, యూరప్‌లో సాంప్రదాయిక ఆయుధాల, సాయుధదళాల తగ్గింపు సమస్యను క్షుణ్ణంగా చర్చించాం.

మొత్తంమీద నిరాయుధీకరణ; అణ్వాయుధ ప్రమాదం తొలగింపు; ప్రపంచంలో వుద్రిక్తతల, తలపాటుల తగ్గింపు: అంతర్జాతీయ సంబంధాల అభివృద్ధిలో నూతన వైఖరుల పటిష్ఠీకరణ—వీటన్నిటికీ సంబంధించిన సమస్యలను మేము ముందుకు తేదలిచాం. చర్చల సందర్భంగా వాస్తవంలో యిదే జరిగింది.

రెండు తరగతుల అణుమిసిలీలను నిర్మూలించేందుకు వుద్దేశించిన సంధిపై సంతకాలు జరగడమే వాషింగ్టన్ సందర్శన ప్రధాన ఫలితమనడంలో సందేహంలేదు. అణ్వాయుధాగారాలను నిజంగా నిర్మూలించే దిశలో యిది ప్రథమ అంజ. నిన్నటివరకు యిది చాలామందికి కల్పనా లోకమనిపించింది. యీ నాడు యిది వాస్తవమౌతోంది.

నామమాత్రపు అంజ మాత్రమే వేశారని కొందరంటున్నారు—అంటే మానవాళికి కేవలం 4 శాతం అణ్వాయుధాల బెడద మాత్రమే తప్పిందంటున్నారు. అయినప్పటికీ ఒక విషయం మర్చిపోకూడదు. భూమ్మీదగల ప్రాణమున్న ప్రతిదాన్ని నాశనంచేయడానికి యిప్పుడున్న అణ్వాయుధాల్లో ఐదు శాతం చాలునని విజ్ఞాన శాస్త్రజ్ఞుల లెక్కలు తెలియజేస్తున్నాయి.

అంతేకాదు; ఆయుధపోటీ మంది నిరాయుధీకరణకు మారే అవకాశాన్ని యీ సంధి ప్రతిఒక్కరికీ కనులకు కట్టినట్టు చూపుతోంది. యీ సంధి కుదరడాన్ని సాధ్యం చేసిన వాతావరణాన్ని పరిరక్షించుకోవడం, మరింత నిర్మాణాత్మకంగా, యేకరీతిగా కృషి చేయడం ముఖ్యం. యిందుకు యీ సంధిని ధ్రువీకరించడంద్వారా దానికి నిజమైన బలాన్ని సమకూర్చడమే ముఖ్యంగా చేయాల్సిన పని.

సోవియట్ యూనియన్ సుప్రీం సోవియట్ సంబంధించినంతవరకు అది యీ సంధిని బలపరుస్తుందనుకుంటున్నాను. యెందుకంటే యిది ప్రజల సంకల్పం.

సోవియట్ యూనియన్ సుప్రీం సోవియట్ డిప్యూటీలు చాలామంది, దీని కమిషన్లు, ముఖ్యంగా విదేశీ వ్యవహారాల కమిషన్లు యీ సంధిని రూపొందించే సందర్భంగా తలెత్తిన సమస్యలను పరిశీలించడంలో వాస్తవంగా పాల్గొన్నాయి. యిది కూడా ముఖ్యమైనదే.

దీన్ని ధ్రువీకరించాలా, వద్దా అనే సమస్యపై అమెరికాలో పెనుగులాడుతున్నారు. యిది మనకు తెలుసు. అమెరికా ప్రజలు దీన్ని బలపరుస్తున్నారనే విషయంకూడా మనకు తెలుసు. మేము అమెరికాలో వున్నపుడే యిది మరోసారి మాకు కొట్టవచ్చినట్టు కనిపించింది.

ఇది చాలా ముఖ్యమైనకాలం. బెర్లిన్‌లో జరిగిన వార్సాసంధి దేశాల నాయకుల సమావేశంలో యీ కాలపు కీలక స్వభావం, దీని ప్రాముఖ్యతపట్ల గల యెరుక పూర్తి స్థాయిలో వ్యక్తమైన విషయం మీకు చెప్పదలచుకున్నాను.

వార్సాదేశాల నాయకులు తమ సంయుక్త ప్రకటనలో మా అమెరికా సందర్శన ఫలితాలను యేకగ్రీవంగా ధ్రువీకరించారు. ఈ నూతన దశలో నిరాయుధీకరణ, అంతర్జాతీయ సహకార ప్రయోజనాల కనుగుణంగా వ్యవహరించగలమని వారు కృతనిశ్చయంతో ప్రకటించారు.

వాషింగ్టన్ సమావేశ ఫలితాలపట్ల అనేక దేశాలు యెంతో సానుకూలంగా ప్రతిస్పందించాయని చెప్పవచ్చు.

కానీ, యెప్పుడైతే పాత అభిప్రాయాలు మట్టికొట్టుకుపోతూంటాయో, వాటితో తమ రాజకీయ, ఆర్థిక సంక్షేమాన్ని ముడేసుకున్నవారి ప్రతిఘటనకూడా తప్పకుండా పెరుగుతుంది.

మేము తిరిగివచ్చి దాదాపు మూడురోజులైంది. యీలోగానే అమెరికాలోని, యితర పాశ్చాత్య దేశాల్లోని కొన్ని నిర్దిష్టవర్గాలు మంచికి జరుగుతున్న మార్పులను నిరోధించడానికి సమాయత్తమౌతున్నాయి.

చాలాదూరంవరకు వెళ్ళవద్దని, నిరాయుధీకరణ క్రమాన్ని నిలుపరించాలని అమెరికా నాయకత్వానికి ఆ వర్గాలు చేస్తున్న విజ్ఞప్తుల గోల నానాటికీ పెరుగుతున్నది.

మధ్యశ్రేణి, స్వల్పశ్రేణి మిసిలీల నిర్మూలన నష్టాన్ని పరిహరించేందుకు యూరప్‌కు దగ్గరగానూ, యూరప్‌లోకి నూతన అణ్వాయుధాలను తీసుకెళ్ళడంద్వారా, యూరప్‌లో వున్న అణ్వాయుధాలను, యితర ఆయుధాలను ఆధునికీకరించడం ద్వారా తక్షణ చర్యలు తీసుకోవాలని డిమాండు చేస్తున్నారు. వాషింగ్టన్‌లో జరిగిన చర్చలు ఎస్.ఒ.ఐ. లాంటి సమస్యపైగల అభిప్రాయభేదాలను తొలగించాయనీ కొందరు

బల్లగుద్ది చెప్పడానికి ప్రయత్నిస్తున్నారు. ఆ వాదనను అడ్డంపెట్టుకుని ఎస్. డి. ఐ కార్యక్రమం పనిని త్వరితం చేయాలని వారు పిలుపులు యిస్తున్నారు.

ఇవి యెంతో ప్రమాదకర ధోరణులని చెప్పకతప్పదు. వాటిని తక్కువ అంచనా వేయరాదు. అంతర్జాతీయ సంబంధాల విస్తైనికీకరణ క్రమంలోని కొత్త మలుపును అవి సీరుగార్చగలవు.

దురభిమానపూరితమైన కాంక్రీట్ గోడలను, శత్రుత్వాల మూసపోతలను చీల్చుకుని మొలిచిన అణ్వస్త్ర విసర్జన తొలి అంకురాన్ని కాపాడడానికి ప్రపంచ కుటుంబం, ముఖ్యంగా అమెరికా, సోవియట్ యూనియన్ దేశాల ప్రజలు, అన్ని దేశాల్లోని ఆరోగ్యకరమైన శక్తులు తమ కృషిని ద్విగుణీకృతం చేస్తాయని మా నమ్మకం. సానుకూల ధోరణుల ప్రగాఢతను, పరస్పర అవగాహన, సహకారాల పటిష్టీకరణను పెంపొందించడానికి అందరూ కృషిచేయడం యిప్పుడు చాలా ముఖ్యం.

సైనికవాదం, యుద్ధం—వీటి అపారమైన బరువును వదిలించుకొనేందుకు మొత్తం మానవాళికి ఒక చరిత్రాత్మక అవకాశాన్ని యిప్పుడు కుదిరిన అంగీకారాలు సమకూర్చాయి. యీ సైనికవాదం, యుద్ధాలు అమానుషంగా యెన్నో ప్రాణాలను బలిగొన్నాయి. ఆర్థికాభివృద్ధిని, పాదార్థిక సంస్కృతిని వెనక్కి చుట్టివేశాయి. ప్రజల స్వేచ్ఛకు, ఆత్మిక, సామాజిక సృజనాత్మకతకు బంధనాలు వేశాయి.

నా పర్యటన సందర్భంగా చర్చించిన ప్రతి ఒక్క సమస్యలో అమెరికా, సోవియట్ యూనియన్ పాత్ర, బాధ్యతల విషయం ప్రస్తావనకు వచ్చింది. అవి యేవిధంగా సహకరించుకోవాలీ, సంబంధాలను పెంచుకోవాలీ అనే విషయం యేదో ఒక రూపంలో చర్చకు వచ్చింది. యిది ఉభయదేశాలకూ, మొత్తం ప్రపంచానికీ ముఖ్యం.

దీనిపట్ల యెరుక సోవియట్ యూనియన్‌లోనేగాక అమెరికాలోకూడా పెరుగుతోంది. యిది మేము రాజకీయ నాయకులతో. పురప్రముఖులతో, విజ్ఞానశాస్త్ర, సాంస్కృతిక రంగ ప్రతినిధులతో జరిగిన సమావేశాల్లో. వారితో జరిగిన చర్చల్లో గమనించాం.

నూతన వాస్తవికతలను అవగతం చేసుకోవడం, అందుకనుగుణంగా వుభయ దేశాలమధ్య సంబంధాల్లో వ్యవహరించడం, సహజీవనం నెరపడం, ప్రతి ఒక్క దేశ ప్రజల ఎంపికపట్ల గౌరవం కనబర్చడం—యివి అవసరమని అధ్యక్షునితోనూ, యితర అమెరికన్ రాజకీయ నాయకులతోనూ జరిగిన చర్చల సందర్భంగా మేము పదేపదే నొక్కి చెప్పాం. అమెరికా పక్షానికి తరచు పరిపాటి అయిన వివాదాలలో, పరస్పర ఆరోపణల్లో నిమగ్నమయేందుకు వాషింగ్టన్‌కు రాలేదని మేము ఖరాఖండిగా చెప్పాం. మేము నిజమైన రాజకీయ చర్చల్లో నిమగ్నమయేందుకు వచ్చామని చెప్పాం.

కామ్రేడ్స్, అమెరికా ప్రభుత్వ ప్రతిస్పందన, ప్రవర్తన యెలా వుండింది, మన సంబంధాలపట్ల దాని వైఖరులు లేదా అభిప్రాయాలు యేమిటి, యీ విషయంలో దానిలో యేమైనా మార్పులు వచ్చాయా అనే విషయాలు తెలుసుకోవాలనే ఆసక్తి మీకు వుంటుందని నేను అనుకుంటున్నాను. యిది సహజమే.

ఈ సమస్యపై ప్రతినిధివర్గంలోని మేము అనేకసార్లు మా అభిప్రాయాలను పరస్పరం తెలుపుకున్నాం. యిది అంతసులభంగా అంకెకు వచ్చే సమస్యకాదు. రెండు దేశాల సంబంధాల్లో తీవ్రమార్పులు వచ్చాయని యిప్పుడే చెప్పడానికి ప్రయత్నించడం తొందరపాటే అవుతుంది. యిది దృఢంగా యేర్పడిన అభిప్రాయంతోనూ, వాస్తవ ఆధారంగానూ, యేమాత్రం అతిశయోక్తులు లేకుండానూ నేను చెపుతున్నాను.

ఏదేమైనప్పటికీ అధ్యక్షునితోనూ, అమెరికాలోని యితర రాజకీయ నాయకులతోనూ జరిగిన చర్చలు మునుపటికన్నా భిన్నంగా వున్నాయని చెప్పదలచుకున్నాను. యివి మరింత నిర్మాణాత్మకంగావున్నాయి. మార్పులు వస్తున్నాయి అనే అభిప్రాయం మేధావుల, వాణిజ్యవర్గాల, జనబాహుళ్య ప్రసార సాధనాల సంస్థల ప్రతినిధులతో చర్చించిన అనంతరం నాకు యేర్పడింది.

సామాన్య అమెరికన్ల సుహృద్భావ వెల్లువ మా దృష్టిని ఆకట్టుకుంది. యెందుకంటే వారు టెలివిజన్‌ద్వారా, పత్రికలద్వారా మన లక్ష్యాలను, మన నిజమైన అభిప్రాయాలను తెలుసుకున్నారు: మనం కోరుకుంటున్న దేమిటో, అమెరికాను, అమెరికన్లను సోవియట్ ప్రజలు యేవిధంగా పరిగణిస్తున్నారో వారు అర్థంచేసుకున్నారు.

అధ్యక్షునితో నేనీవిషయం చెప్పాను: పరస్పర అవగాహనామార్గంలోకి, మన వుభయదేశాల, మొత్తం ప్రపంచ ప్రయోజనాలకోసం నిర్మాణాత్మక సహకార మార్గంలోకి మన సంబంధాలను మళ్ళించడానికి సోవియట్ నాయకత్వం సిద్ధంగావుంది. కచ్చితంగా యీ సందర్భంలోనే యితర సమస్యలను లేవనెత్తాం; యీనాటి రాజకీయాల అత్యంత తీవ్రసమస్యల పరిష్కారాన్వేషణకు కలిసి రావాల్సిందిగా అమెరికా ప్రభుత్వాన్ని ఆహ్వానించాం.

ప్రాంతీయ ఘర్షణలకు రాజకీయ పరిష్కారాన్ని సమకూర్చడంలో మన రెండు దేశాలు సహాయపడడానికిగల అవకాశాలను అమెరికాపక్షం ముందు మేము పట్టుదలతో లేవనెత్తాం—యీ రంగంలో మనం చాలా ముందుకు పురోగమించలేక పోయినప్పటికీ యీ సమస్యలపై జరిగిన చర్చలు పరిస్థితిని స్పష్టంచేశాయి, సంభాషణల కొనసాగింపునకు వీలుకల్పించాయి.

సోవియట్ యూనియన్, అమెరికాలమధ్య ద్వైపాక్షిక సంబంధాల అభివృద్ధి విషయానికి సోవియట్-అమెరికా శిఖరాగ్ర సమావేశ సంయుక్త ప్రకటన యెంతో

ప్రాధాన్యతను యిచ్చింది యిది మీరు గమనించేవుంటారు. అనేక అంశాలపై నిర్దిష్ట ఒప్పందాలు కుదిరాయి—అవి విజ్ఞానశాస్త్ర సహకారరంగానికి, సాంస్కృతిక ఆదాన ప్రదానాల రంగానికి, ప్రజలమధ్య సంబంధాలకు చెందినవి.

ఈ చర్చల్లోనూ, ముఖ్యంగా వ్యాపార ప్రతినిధులతో సమావేశంలోనూ ఆర్థిక సహకార, వాణిజ్య విస్తరణకు సంబంధించిన అంశాలపై ఆసక్తికరమైన సంభాషణ జరిగింది.

ఆ రంగంలో సానుకూల మార్పులు సోవియట్, అమెరికా సంబంధాల యావత్తు వాతావరణాన్ని. యింకా చెప్పాలంటే ప్రపంచంలోని పరిస్థితిని మెరుగుపర్చడానికి యెంతో ముఖ్యమైనవిగా వుండగలవు. యేదేమైనప్పటికీ నేను యిదివరకే ఒక సందర్భంలో చెప్పినట్టు యిందుకు యెంతో కృషి ముఖ్యంగా అమెరికా వైపునుండి అవసరం. యెందుకంటే అమెరికా తప్పిదంవల్లనే సాధారణ, పరస్పర ప్రయోజనకర ఆర్థిక సంబంధాల మార్గంలో యెన్నో కృత్రిమఅవరోధాలు తలెత్తాయి.

ప్రియమైన కామ్రేడ్స్, నేను మరొక్కవిషయాన్ని మీ దృష్టికితీసుకరాదలచాను. మన పునర్ నిర్మాణకృషిని మొత్తం ప్రపంచం యెంతటి ఆసక్తితో తిలకిస్తున్నదో అమెరికా సందర్శనలో మాకు స్పష్టంగా అవగతం అయింది. అనేక వర్ణాలు, యెంతో భిన్నస్వభావంగల ప్రశ్నలు అడిగారు. పునర్ నిర్మాణం అంటే ఏమిటి? దానికి ప్రతిఘటన యేమైనా వస్తున్నదా? పునర్ నిర్మాణాన్ని ముందుకు తీసుకెళ్ళగల పట్టుదల మీకుందా? మీరు అర్థంతరంగా దాని వదిలివేయరుకదా? సోవియట్ సమాజాన్ని అంత ప్రగాఢంగా పునర్ నవీనీకరించడాన్ని ప్రజలు అంగీకరిస్తున్నారా?

పునర్ నిర్మాణ పథంలో సోవియట్ సమాజంలో జరుగుతున్న దానిపట్ల కనబరుస్తున్న నిజమైన, హృదయ పూర్వకమైన ఆసక్తి యిది. యిందులో సందేహం లేదు. ఈనాటి ప్రపంచంలో మనదేశపాత్రకుగల గుర్తింపును యిది ధ్రువీకరిస్తున్నది. యిది మనందరికీ మరోసారి దీన్ని గుర్తుచేస్తున్నది: పునర్‌నిర్మాణ విప్లవ ఆశయాన్ని ముందుకు తీసుకపోవడంలో మనం విజయాలు యెంతగాసాధిస్తే అంతర్జాతీయ రంగంలో వ్యవహారాలు అంతగా చక్కబడుతాయి.

ఈనాటి పరిస్థితి యిలా వుంది, ప్రపంచాభివృద్ధి గతితర్కం యిలా వుంది— ఈనాటి ప్రపంచం యెంతో వైవిధ్యపూరితమూ, పరస్పర విరుద్ధ స్వభావమూగల దైనప్పటికీ, అది అంతస్సంబంధంగలదీ, అఖండమైనదీ అని చెప్పడానికి యిది మరో రుజువు. దీన్ని మనం అర్థంచేసుకోవాలి. ప్రతీ పట్టణంలో, ప్రతీ గ్రామంలో, ప్రతీ సమిష్టి శ్రామికబృందంలో మొత్తం దేశంలో మనకు నిర్దిష్ట ఆచరణాత్మక కర్తవ్యాలు యెదురౌతున్నాయి కాబట్టి దీన్ని మనం మనసులో వుంచుకోవాలి.

పునర్ వ్యవస్థీకరణ కృషికి సోవియట్ ప్రజలు తమ దోహదాన్ని పెంచుతున్నందుకూ, సమాజాన్ని విప్లవకరంగా పునర్నవంచేయాలని పార్టీ యిచ్చిన పిలుపునందుకుని దాన్ని ఆచరణలో పెడుతున్నందుకూ, ప్రారంభించిన పరివర్తనలలో వారు క్రియాశీలంగా పాలుపంచుకుంటున్నందుకూ, శాంతికోసం పార్టీ కేంద్ర కమిటీ, ప్రభుత్వమూచేస్తున్న కృషికి వారు తోడ్పాటుయిస్తున్నందుకూ వారికి కృతజ్ఞతా వాచకాలు తెలుపుతున్నాను. యిదంతా లేనిదే యిటీవల జరిగిన చర్చలు విజయవంతమయ్యేవికావు, అసలు ఆ చర్చలే జరిగివుండేవికావు.

కామ్రేడ్స్, ధన్యవాదాలు. యీ విజయానికి మనల్ని మనం అభినందించుకుందాం. మన కృషిని కొనసాగిస్తూనేవుందాం.

మీ అందరికీ మంచి జరగాలని కోరుకుంటున్నాను.

(టాస్, 1987 డిసెంబరు 15)

# శిఖరాగ్ర సమావేశ ఫలితాలకు సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ పొలిట్‌బ్యూరో ఆమోదం

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ పొలిట్‌బ్యూరో సమావేశం 1987 డిసెంబరు 17న జరిగింది. వాషింగ్టన్‌లో జరిగిన సోవియట్-అమెరికా శిఖరాగ్ర సమావేశ ఫలితాలను అది పరిశీలించింది. అమెరికా పర్యటన సందర్భంగా మిహాయిల్ గోర్బచేవ్ నిర్వహించిన కార్యకలాపాలను పొలిట్‌బ్యూరో సంపూర్ణంగా ఆమోదించింది.

స్వల్పశ్రేణి, మధ్యశ్రేణి మిసిలీల నిర్మూలనగురించి సోవియట్, అమెరికాల మధ్య కుదిరిన సంధిపై వాషింగ్టన్‌లో సంతకాలు జరగడం అంతర్జాతీయ పరిణామంలో ఒక ముఖ్య ఘట్టం. అణ్వస్త్రరహిత ప్రపంచాన్ని సృష్టించే ఆచరణాత్మక కృషి ప్రారంభమైంది. యిది చరిత్రాత్మక సంధి, యెందుకంటే మొట్టమొదటిసారిగా అమెరికా, సోవియట్ యూనియన్‌లకు చెందిన రెండు తరగతుల అణ్వస్త్రాలను నిజంగా నిర్మూలించడానికి వుద్దేశించిన సంధి యిది. వుభయపక్షాలూ దీన్ని పాటిస్తున్నదీ, లేనిదీ విశ్వసనీయంగా తనిఖీ చేయడానికి యీ సంధిలోని కచ్చితమైన అజమాయిషీ చర్యలు వీలుకల్పిస్తున్నాయి. సోవియట్-అమెరికా సంధి సకల దేశాల ప్రయోజనాలకు అనుగుణమైనది. యిది ప్రపంచమంతటా భద్రతాస్థాయిని పెంచుతుంది.

ఎ.బి.ఎం సంధిని పాటిస్తూనే వ్యూహాత్మక దాడి ఆయుధాలను సమూలంగా తగ్గించే విషయంలో గణనీయమైన ముందంజ వేయడం జరిగింది. ఇది పట్టుదలతో ఏకాగ్రతభావంతో చేసిన కృషి ఫలితమే. సోవియట్-అమెరికాల సంబంధాల్లో యీ ఆయుధాల సమస్య యిప్పటికీ ప్రధాన స్థానాన్ని ఆక్రమిస్తోంది. 1988 పూర్వార్థంలో అమెరికా అధ్యక్షుని సోవియట్ సందర్శన సందర్భంగా మాస్కోలో తత్సంబంధమైన సంధిపై సంతకాల నిమిత్తం దాన్ని సన్నద్ధపర్చడం తన కర్తవ్యం అన్న వాస్తవం ప్రాతిపదికగా సోవియట్ యూనియన్ ముందుకు సాగుతుంది.

సోవియట్-అమెరికా ద్వైపాక్షిక సంబంధాల అభివృద్ధిని ప్రోత్సహించాలనే, మానవీయ సంబంధాలపై మరింత నిర్మొహమాటమైన, నిర్మాణాత్మకమైన సంభాషణను జరపాలనే వుభయపక్షాల అభిప్రాయం చర్చల సందర్భంగా వ్యక్తమైంది. ప్రపంచంలోని అనేక మండలాల్లోని పరిస్థితిపై చర్చల సందర్భంగా తీవ్ర అభిప్రాయ భేదాలు

స్పష్టంగా వ్యక్తమైనప్పటికీ ఘర్షణా పరిస్థితులను పరిష్కరించడానికి నూతన వైఖరుల అన్వేషణామార్గాన్ని సోవియట్ పక్షం నికరంగా అనుసరించింది: అదే సమయంలో బయటి జోక్యంలేకుండా అన్ని దేశాలూ తమ సొంత అభివృద్ధి మార్గాన్ని యెంచుకునే హక్కును దృఢంగా బలపర్చింది.

1977 డిసెంబరు 11న బెర్లిన్‌లో జరిగిన వార్సానంధి దేశాల నాయకుల సమావేశ ఫలితాలను పొలిట్ బ్యూరో ఆమోదించింది. సోదర దేశాలమధ్య రాజకీయ సహకారాన్ని పెంపొందించడంలో యీ సమావేశం నూతన కొలికి అయింది.

వార్సానంధి రాజ్యాల నాయకులు వాషింగ్టన్‌లో కుదిరిన ఒప్పందాలను సంపూర్ణంగా బలపర్చారు: సోషలిస్టు దేశాల భద్రతను, మొత్తంగా ప్రపంచ భద్రతను పటిష్టీకరించడంలో ఆ ఒప్పందాలు యెంతో ముఖ్యమైనవని వారు నొక్కి చెప్పారు. ఆ విషయాన్ని పొలిట్‌బ్యూరో సంతృప్తితో గమనంలోకి తీసుకుంది.

సోవియట్-అమెరికాల మధ్య జరిగే నిరాయుధీకరణ చర్చల ఆద్యంతం సోషలిస్టు దేశాలతో యెప్పటికప్పుడు సన్నిహిత సంబంధాలు పెట్టుకోవడం యెంతో ముఖ్యమని పొలిట్‌బ్యూరో నొక్కి చెప్పింది. యూరపులో శాంతి, భద్రత, యిరుగుపొరుగు సహకారాన్ని పటిష్టం చేయడానికి సంబంధించిన తక్షణ సమస్యల విషయంలోనూ, అలాగే ప్రపంచ రాజకీయాల్లోని యితర సమస్యల విషయంలోనూ సోదర సోషలిస్టు దేశాలతో ముమ్మర సహకారం నెరపడం యెంతో ముఖ్యమని పొలిట్‌బ్యూరో నొక్కి చెప్పింది.

(టాస్, 17 డిసెంబరు, 1987)

**SOVIET SAMEEKSHA** (Telugu) Vol. 21, No. 51
Dec. 25, 1987

CONTENTS

120


సో స
సోవియట్ సమీక్ష

| | |
|---|---|
| సంపాదకుడు : | వై. ఎల్. ఫ్రొలోవ్ |
| సంయుక్త సంపాదకుడు : | జి. ఆళవందార్ |
| సహాయ సంపాదకుడు : | మునగాల జనార్ధన రెడ్డి |
| ఆర్టిస్ట్ : | ఎల్. వి. గుషేవ |



11 భారతీయ భాషల్లో
వెలువడే పత్రిక

Printed by A. N. Kazantsev and Published by him at Soviet Nadu Office, 115, Theagaraya Road, Madras-600 017, for the Information Department of the USSR Embassy in India. Printed at Sri Venkateswara Printers, Madras-600 021



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA105M234 |
| పుస్తకం పేరు | సోవియట్ సమీక్ష |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 125 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | CI, BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Vedavathi |
| పేజీలు విడదీసినది | Vedavathi |
| స్కాన్ చేసినది | S.Lakshmi |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |